



# సోవియట్ రష్యాలో ఆధ్యాత్మిక పరిశోధనలు

డా॥ వేదవ్యాస Ph.D.

# సోవియట్ రష్యాలో

## ఆధ్యాత్మిక పరిశోధనలు


రచన

**డా॥ వేదవ్యాస IAS, Ph.D**



**వేద విశ్వవిద్యాలయము**

***UNIVERSITY OF VEDIC SCIENCES***

జూబ్లీహిల్స్, హైదరాబాదు

**(1997)**

## విషయసూచిక

# ముందుమాట

మీరు - 'సోవియట్ రష్యాలో ఆధ్యాత్మిక పరిశోధనలు'- అన్న ఈ గ్రంథము ఎందుకు వ్రాశారు?

ఈ ప్రశ్న, నా పాతకాలం స్నేహితుడూ, హేతువాదీ (నాస్తికుడు etc) అయిన వ్యక్తి, అడిగాడు! నిజమే ఎందుకు రాశాను?

అని ఆలోచించేముందే - ఔను? ఇతడీ ప్రశ్న ఎందుకు అడిగాడు? అన్న ప్రశ్న నాలో ఉదయించింది! ఎందుకు అడిగాడో నాకు వెంటనే తెలకపోయినా, దాదాపు ఐదేళ్ళ పాఠకులలో అనేక మనస్తత్వాలు గలవారితో పరిచయం అవటంవల్ల ఆ ప్రశ్న వెనుకవున్న ఆలోచన పంథా, కొంత కొంత క్రమేణా, అవగతం కాసాగింది!

మొదట్లో అయితే - నాస్తికులు ఎందుకు ''దేవుడ్ని నమ్మం అంటున్నారంటే - దేవుడున్నాడని తెలియక'' అనుకొని దేవుని ఉనికిని తెలియజేసే అనేక తార్కాణాలను రోజుల తరబడి ఏకరువు పెట్టే వాళ్ళం. విద్యార్థులుగా వున్న రోజుల నించీ! వారు అన్నీవిని మళ్ళీ యింకొకడి దగ్గిర మళ్ళీ అదే టేపురికార్డుల్లా పెట్టడం చూసి ఆశ్చర్య పోయాను. ఇది

ఇంతకుముందే గదా? అన్ని తార్కాణాలతో రుజువులతో అర్థం అయ్యేలాగ చెప్పాము! అని!! ఆ తర్వాతగాని తెలిసింది కాదు - ఈ అపనమ్మకం నాస్తికత్వం సహజంగా వచ్చిన సందేహాలు కావని! ఇది ఒక 'నినాదం' అనీ!

నినాదం (Propaganda) అంటే అర్థము - అతడు మాట్లాడే 'వాదం' చెప్పే ఆర్గ్యుమెంట్లూ మతాన్ని దుయ్యబట్టడం - ఇత్యాది అతనికి సహజంగా కలిగిన సందేహాలు, కావని! అలా అయితే వాటికి తగు సమాధానాలు ఇచ్చిం తర్వాత కూడా - ఆ సమాధానాలు యిచ్చిన వాడ్ని వొదిలి, వేరే వాళ్ళని పట్టుకుని మళ్ళీ అవే వాదనలు, సందేహాలూ, ఏకరవు పెట్టడం వాళ్ళ మనస్సులు మార్చాలనుకోవటం అనేది జరగదు! అనగా అర్థం, ఎవరెన్ని సమాధానాలు వీరికి చెప్పగలిగినా, మీరు 'నచ్చజెప్ప - వీలుకానివ్వని' స్థితికి చేరుకున్న ప్రత్యేకవ్యక్తులు! వీరికి నమ్మకాపనమ్మ కాలనేవి వుండవు! కేవలం వారికి నేర్పించినవి 'ప్రాపగాండా'లాగా దొరికినవాడి దగ్గిరల్లా వల్లించుకుపోవడమే, వీరి ''వృత్తి'' అని! టేపుచేసిన వాదాలు ప్రతి నడి బజారులోనూ స్విచ్ నొక్కి వినిపించే యంత్రాలతో మనంవాదించి, నచ్చజెప్పటం ఎలాంటిదో - వీరికి నచ్చజెప్ప బూనటం కూడా అంతే - అలాంటి వారికి కాదు, ఈ పుస్తకం!

ఇతర దేశాలైన, అమెరికా, రష్యా, చైనా వంటి శక్తుల రాజకీయ పన్నాగపు వలలో చిక్కుకుని, డబ్బుకో, నిరుద్యోగానికో, ఆకలికో బలిఅయి - వాళ్ళు చెప్పమని నేర్పించిన చిలకపలుకుల నాస్తికవాదాలను వల్లించే వారికి కాదు - ఈ పుస్తకం!

అయితే, ఇలాంటి వారి మాటలు తగిలి, నాస్తిక - ఆస్తిక విచికిత్సల మధ్యనపడి, కొట్టుకుంటూ నిజంగా సందిగ్ధావస్థలో వీరి వలలో చిక్కి, జీవితాన్ని సర్వనాశనం చేసుకోకుండా తోడ్పడే నిజానిజాల విమర్శకు

సహాయ కారి అవుతుందని - రష్యాలో (అంటే ఈ హేతువాదాల గురుస్థానం ఒకప్పుడు నాస్తికులకు పుణ్యక్షేత్రమయిన కేంద్రములోనే,) ఏమి జరుగుతుందో తెలిపే ఉద్దేశంతో వ్రాయబడిందీ గ్రంథము! అంతేగాక, ఆ ప్రయోగములు, పరిశోధనలూ, అక్కడి మేధావులు (రాజకీయ తొత్తులుకాదు) సైంటిస్టులు చేస్తున్న పరిశోధనల ఫలితాల కారణంగా పెరిగే ఆస్తిక కిరణాలు రష్యాలో ఉదయించే 'శుభోదయం' యొక్క తొలి నీలికిరణాలే - ఈ ఆధ్యాత్మిక పరిశోధనలు, అని తెలుస్తుందని!!

వీటిని చదివితే అరవై (60) యేళ్ళుగా నాస్తికత్వాన్ని నమ్ముతూ మతాన్ని నాశనం చేశామని విర్రవీగుతూ మతాన్ని దేవుడిని ఆత్మనూ పుణ్యాపాపాలనూ నమ్మేవారిని బూర్జువాలుగా, అవకాశవాదులుగా, మోసగాళ్ళుగా చిత్రించి, హింసించి సైబీరియాలోని ఐస్ (మంచు) ఎడారిలో చావండి! అని వొదిలేసిన - ఆ రష్యాలోనే - ఆధ్యాత్మిక సత్యాలు నిజమేననీ యోగశాస్త్రం, పూర్వపు ఋషులు యోగులు మహాత్ములు సిద్ధపురుషులు ఉపదేశించిన మహాసత్యాలైన ఆత్మ, దివ్యశక్తులు, ఆధ్యాత్మిక సత్యాలు ఈనాటికీ స్పష్టంగా సైన్సుద్వారా ఋజువౌతున్న మహాసత్యాలని తెలిపే - రష్యను సైన్సు యొక్క ఆధ్యాత్మిక వెలుగు కిరణాలను మన వారికికూడా అందించాలనే తపనే - అందుకే రాశాను, ఈ పుస్తకాన్ని!

ఈ పుస్తకం ప్రచురించిన అతికొద్ది రోజులలోనే మూడుసార్లు అచ్చుపడినా - దాదాపు ఏడాదిగా కాపీలు అయిపోయి, ఎందరు అడిగినారో! అచ్చులో లేకపోతే చదివేసిన కాపీలైన అడిగి, ఎందరు చదివారో తలచుకుంటే ప్రజలలో ఆధ్యాత్మికత గురించి ఎంత ఆసక్తి వుందో ఆశ్చర్య మేసింది!!

అందులోనూ ఏ వొక్క కాపీ కూడా బైట పుస్తకాల షాపులలో పెట్టకుండా, కేవలం అతి చిన్నస్థాయిలో నడిచే యోగమిత్ర మండలి వారు

'వాలంటీర్లు' గా అమ్మినవేనని తెలిసినప్పుడు ఇంకా ఎంతో ఆశ్చర్యంవేసింది! అందుకే మళ్ళీ నాల్గవ అచ్చుకు అంగీకరించక తప్పలేదు! దీని వెల ఆధ్యాత్మిక పరిశోధనకై మీకు విరాళంగా ఇస్తున్నాను ఈ పుస్తకం సంతోషంతో!

అయితే ఈ పుస్తకం ద్వారా మీరు చెప్పదలచుకున్న విషయం ఏమిటి? అని ఒక సూటి ప్రశ్న వేశాడొక విద్యార్థి! ఇది నిజాయితీ అయిన గుండెనుంచి వచ్చినది కాబట్టి, సమాధానం చెప్పినందువల్ల అతనికి ప్రయోజనం వుంటుంది! అందుకే చెబుతాను!

మొదటి సత్యం - యుగయుగాలుగా మానవజాతి నమ్మిన మహా సత్యాలనబడే కొన్ని ఆధ్యాత్మిక సత్యాలు బూటకం కాదు, అని! ప్రతి వ్యక్తీ వాటిని తన స్వంతశక్తితో రుజువు చెయ్యలేకపోయినా వాదనతో ఎదురు - వాదించి గెలవలేక పోయినా, అందులోని సత్యాలు అబద్ధం ఎన్నటికీ కావు. అనీ! ఉదాహరణకు ప్రాచీన మతాలైన హిందూ, క్రైస్తవ, ముస్లిమ్ మతాలు- మనిషికి 'ఆత్మ' అనేది ఒకటి ఉంటుందనీ, అది ఈ పైకి కనిపించే శరీరంలో- కంటికి కనిపించని - ఒకానొక 'దివ్యశక్తి' తో తయారయివుంటుందని జోసెఫ్ కిర్లియన్ అనే రష్యను సైంటిస్టు కనిపెట్టిన సరికొత్త ఫోటోగ్రఫీవల్ల తేలింది! ఇది ఒక మహాసత్యం గాదూ!

ఈనాడు డాక్టర్లు మన శరీరంలోవున్న (బైటికి కనిపించని) అవయవాలు బైటనించే ఫోటో తీయడం ఎలాగైతే 'ఎక్స్‌రే'' (X-ray) ఫోటోగ్రఫీవల్ల సాధ్యమౌతున్నదో అల్లానే కిర్లియన్ ఫొటోగ్రఫీ ద్వారా, కంటికి కనిపించని మనలోవుండే 'జీవాత్మ' ను - ఫొటో తీశారు రష్యాలో సైంటిస్టులు! ఇది మోసానికి తావులేని నాస్తికులైన రష్యను వారిచేత కనిపెట్టబడిన విషయం గనుక - హేతువాదులూ, నాస్తికులూ కూడా కాదనలేని సత్యం!

దీనినే యోగులు 'సూక్ష్మశరీరం' అని లింగశరీరము అని సైంటిస్టులు ''ప్లాస్మా'' శరీరం అని వేరువేరు పేర్లతో పిలిచినా ఇది వస్తువు ఒక్కటే -

బైటికి కనిపించే పదార్థంతో తయారైన, ఈ భౌతిక కాయం లోపల దాగి వున్న - పదార్థంతో తయారుకాని, ఒకానొక ఆధ్యాత్మిక శక్తి తరంగాలలో తయారైన 'శరీరం', ఇదే ఈ బైటికి కనబడే శరీరాన్ని బ్రతికి వుంచుతున్న దని! ఇకపోతే కేవలం బైటి పదార్థశరీరం ''శవం''గా మారి ''మరణం'' పొందుతుందని!

మూడో విషయం - ఈ సూక్ష్మశరీరము కిర్లియన్ ఫొటోలో చూస్తే మనిషికి కొన్ని ఏళ్ళకిముందే రాబోయే రోగాలను వ్రణాలనూ, చూపిస్తుం దని! అంటే శరీరానికి కలగబోయే రోగాలు బాధలూ ఇత్యాదివాటిని కారణాలుగా ముందే సూక్ష్మశరీరం చూపిస్తుందని- అందుకే దీనిని పూర్వం, యోగులు కారణ శరీరం, అనటం ఎంతో సరైన విజ్ఞానంతో కూడిన వర్ణన అనీ ఒప్పుకోక తప్పదు! ఇది ఈ పుస్తకంలో తెలిపే అనేక విచిత్ర సత్యాలలో ఒకటి మాత్రమే!

మిగతావి - బోలెడు, అన్నీ ఇక్కడ ఏకరువు పెట్టక్కర్లేదు! అవన్నీ సత్యాలనీ! అందులో - గ్రహాలకు మనపై ప్రభావం ఉందని సైంటిఫిక్‌గా ఋజువైందని డా॥ జోనాస్ జ్యోతిషం సైన్సువంటి సత్యమే అని ఋజువు చేశాడని!

అయితే ఏమిటి? అయితే జాతకాలనూ జ్యోతిష్యాన్ని చూసి 'మూఢ నమ్మకాలు' అంటూ నాలిక పీక్కుని చావనక్కర్లేదు అంతే!! అదేమీ మూఢనమ్మకం కాదని తేలింది! ఏం చాలదా!

ఇలాగే, భూగర్భజలం - కనిపెట్టే నీటి ప్రబ్బలిచెట్టు కర్ర - 'మంత్ర దండం' అన్నా ఇంగ్లీషులో డౌనింగ్ - రాడ్ అన్నా దానివెనకాలవున్న ఆధ్యాత్మిక రహస్యాన్ని సైన్సు తలవొగ్గి ఆమోదించక తప్పదని - ఇలా ఎన్నో ఉన్నాయి. రష్యన్ల ఆధ్యాత్మిక పరిశోధనల వల్ల తెలిసేవి! అవన్నీ ఈ గ్రంథం నిదానంగా ఒకటికి పదిసార్లు, విమర్శతో చదివితే ఎన్నో వున్నాయి.

అన్నిటికన్నా విశేషం పదార్థంపై ''మనస్సు''కు వున్న అధికారాన్ని ప్రత్యక్షంగా ఋజువుచేసే 'నెల్యా మిఖైలోవా' పరిశోధనలు తెలుపుతున్నాయి, కేవలం ఏకాగ్రతవల్ల బల్లమీద దూరంగా పెట్టిన వస్తువులు జరిగి క్రిందపడేలాగ చేసిన అద్భుత ఆధ్యాత్మిక రహస్యం అది!

దీనివల్ల తేలేదేమంటే **(1)** మనస్సు పదార్థం కన్నా బలీయమైందని, **(2)** మనసును పనిచేయించే ఆత్మనిజమనీ - కిర్లియన్ ఫొటోగ్రాఫు ఋజువుచేస్తే, **(3)** జ్యోతిషం నిజమని డా॥ జోనాస్ నిర్ధారించాడు. **(4)** పదార్థం ఒక్కటే నిజమని - కంటికి కనిపించని ఆత్మనీ దేవుడని, లేరనే పదార్థ-వాదం అబద్ధం అనీ- దానివల్ల ఈ పదార్థవాదం నాస్తికవాదం నిజంగా మూఢనమ్మకాలనీ వీటినే నిజమనీ నమ్ముకుని 60-ఏళ్ళుగా బ్రతికి, మతాన్ని నాశనం చేయాలని చూసిన సోవియట్ రష్యా ఇన్నాళ్ళు తాను దూషించిన మతాలు తెలిపే సత్యాలనే తిరిగి నిజాలుగా ఏనాటికైనా గుర్తించకతప్పలేదనీ ఋజువయ్యిందిగదా?

కాబట్టి మతాన్ని, ఆధ్యాత్మికతనూ అనాదిగా విశ్వసిస్తున్న భారతీయ సంస్కృతి యదార్థమని గుడ్డివాళ్ళకు సైతం తెలిసేలాగ ఋజువు అవుతున్నాయి. యీ రష్యాలో జరుగుతున్న ఆద్యాత్మిక పరిశోధన వల్ల!

మరి మతం పేరిట జరిగే మోసాలు, - అన్యాయాల మాటేమిటి అని ఒక ప్రశ్న నాలోనే ఉదయించింది! అవును! మతం పేరిట- దేవుని పేరా జరిగే అన్యాయాలు, అక్రమాల మాట ఏమిటి?

అని ఆలోచిస్తే - ఈ ఆధ్యాత్మిక పరిశోధనలు - వాటిని నిజమని ఋజువు చెయ్యటంలేదు! గనుక ఆధ్యాత్మిక సత్యాలను నమ్మేవారు ఈ పరిశోధనలను చూసి భయపడరాదు! మోసాన్ని ఎవరూ నిజమని ఋజువు చెయ్యరు!

మరి ఈ దొంగ సాధువులు నకిలీబాబాలు అమ్మగార్లు వాళ్ళ మాటేమిటి?

బంగారపు నగలున్నప్పుడే ''నకిలీ'' బంగారం వస్తువులంటూ తయారవుతున్నాయి! అసలు ఈ ప్రపంచంలో బంగారం అన్నదే లేక పోతే నకిలీ బంగారం సరుకు పుట్టదు! దేనికి నకిలీ చెయ్యటం గనుక?

నకిలీ బంగారం వుండటంవల్ల - బంగారమే అసత్యం అని ఋజువు అవుతోందా? లేక బంగారం సత్యమే - నకిలీవి మాత్రమే అసత్యం అని మాత్రమే ఋజువు అవుతున్నదా?

దొంగ-సన్యాసులు నకిలీ మహాత్ములూ - దొంగబాబాలు వుండటం అనేది - అసలు నిజమైతే మహాత్ములనే వారు ఎక్కడో నిజంగా వుండబట్టే వారికి నకిలీలుగా వీళ్ళు తయారవుతారన్న సత్యం తెలుస్తుంది!

అంతే!! - దీనివల్ల దేవుడు అసత్యం అనీ - అసలు మహానుభావులే వుండరు అనీ, బాబాలు, సాధువులు మతం అంతా బూటకం అని రుజువు అవుతాయని హేతువాదాలు చెప్పే నినాదాలు-కేవలం నినాదాలే అని నిజంకాదనీ కాజాలవనీ మనం తెలుసుకోగల వివేకం విజ్ఞానం మనలో మేల్కొన్ననాడు, ఈ నాస్తికులు, నాస్తికసమాజాలు, హేతువాదులు, సహజంగానే నశించి పోతాయని, లేదా నిజం తెలుసుకోదలచిన వారిని వీళ్ళేమీ చెయ్యలేరని తెలుస్తుంది!

వేశ్యలు, భోగంవారున్న వీధిలో పడుపువృత్తి చేసుకునే స్త్రీలు ఉండటం వల్లే, పతివ్రతలే అసత్యం అనటం ఎంత నిజమో ఈ హేతువాదులు 'ప్రాపగాండా' (Propaganda) కూడా అంతే నిజమని!

కాకపోతే - ఈ వేశ్యలను పడుపువృత్తి చేసుకునే వాళ్ళను ద్వేషించ రాదని- జాలిపడాలనీ! అలాంటి వారికి వీలయితే సరిదిద్ది నిజమైనదేదో తెలుసుకుని జీవితాలను వ్యర్థం చేసుకోరాదన్న సత్యాన్ని బోధించాలని మనం గ్రహిస్తే చాలు - అదే నిజమైన ఆధ్యాత్మిక జీవితానికి మొదటిమెట్టు!

కాబట్టి నకిలీ బాబాలను దొంగ సాధువులను - జీవనోపాధికోసం రాజకీయవేత్తలుగా, దేశనాయకులుగా దేశభక్తులుగా, గొప్ప సంఘ సేవకులుగా దొంగవేషాలు వేస్తూ బ్రతికే అనేక రకాల మోసగాళ్ళ వంటి వాళ్ళేనని - నిజానికి ఆలోచిస్తే ఆ రాజకీయ మోసగాళ్ళు దేశాన్ని దోచుకుతింటున్న దానికంటె వీళ్ళు దేశానికి చేసే నష్టం చాలా తక్కువఅని - అసలు సమస్య సమాజంలో మోసం చేస్తేగాని పైకిరాలేమన్న విశ్వాసమే దీనికి కారణమని గ్రహిస్తే మన దేశానికి, మన సమాజానికి సరైనదారి దొరికినట్టే! మోసం అనేది ఒక జీవనవిధానం మోసగాళ్ళకు ఆయువుపట్టు!

దీన్ని బాగుచేసేది - నిజమైన ఆధ్యాత్మిక సత్యాలను ప్రజలకు తెలిపి - సత్యం, పవిత్రత, నిస్వార్థత, దైవశక్తి, పుణ్యం, పాపం, అనేవి అసత్యమని నేర్పటంగాక, సత్యాలని ప్రజలకు తెలియజేయటమే నిజమైన మానవసేవ! అదే నిజమైన మందు ఈనాటి మోసాలు వేషాలు ఏనాటికైనా నివారించాలంటే! నాస్తికత్వం కాదు!

ఇదే నేను చెప్పదలచుకున్న సత్యం! సోవియట్ రష్యాలోని ఆధ్యాత్మిక పరిశోధనలు నేర్పే - మహాసత్యం ఎందుకురాశానీ పుస్తకం అంటే నా సమాధానం ఇదే! ఇది చాలు, మనకు!

ఇతి, శమ్

హైదరాబాద్ **డా॥ వేదవ్యాస IAS, Ph.D**



1

# స్టాలిన్ జీవితంలో మరపురాని అనుభవం!

అది ''గోమెల్'' (Gomel) పట్టణం స్టాలిన్ ప్రభుత్వం అధికారంలో వున్నది. 1940వ సంవత్సరం రష్యా అంతటా ప్రఖ్యాతి పొందిన దివ్యశక్తులు కల్గిన ఆధ్యాత్మికుడు ''ఉల్ఫ్ మెస్సింగ్'' (Wolf Messing) ప్రదర్శనలు ఇస్తున్న రోజులవి. బైలో రష్యాలోని ఒక థియేటర్‌లో ప్రదర్శనకు చాలా ముందే టిక్కెట్లు అన్నీ అయిపోయినాయి. హాలు ''హౌస్‌ఫుల్'' (House full) అయి కిటకిటలాడుతోంది.

అందరి కళ్ళూ ఆత్రుతగా వేదికపైన సినీతారలను చూడ్డానికంటె ఎక్కువ ఉత్సాహంతో ''ఉల్ఫ్ మెస్సింగు''కోసం వెతుకుతున్నాయి! ప్రేక్షకులంతా వేయికళ్ళతో ఎదురుచూస్తున్నారు. ఇంతలో ఆకుపచ్చని యూనిఫారమ్ వేసుకున్న ఇద్దరు సోవియట్ రహస్య పోలీసు అధికారులు హాలులోనికి ప్రవేశించారు. అందరూ ఆశ్చర్యంతో వాళ్ళవైపే చూస్తున్నారు. ప్రేక్షకులను తోసుకుంటూ మధ్య నుంచి చోటుచేసుకొని ముందుకువెళ్ళి వేదికపైకి ఎక్కారు. హాలునిండా వున్న జనాన్ని ఒక్కసారి చూసి కొంచెం తటపటాయించి ''క్షమించాలి. ఈనాటికీ ప్రదర్శన అయిపోయింది'' అన్నారు. ప్రేక్షకులు ఆశ్చర్యంలో నుంచి తేరుకొనేలోపుగానే ప్రదర్శన ఇవ్వటానికి వచ్చిన ''ఉల్ఫ్ మెస్సింగ్''ను ఇద్దరూ చెరోపక్కా నిలబడి నడిపించుకొని తీసుకుపోయారు. ఎక్కడికో ఎవరికీ తెలియదు. ఆ రోజుల్లో స్టాలిన్ (Stalin) ప్రభుత్వంలో,

నిత్యం ఎవరో ఒకరిని ఏవో అనుమానాలపైన, అటు సైబీరియాకో లేక మరెక్కడికో దూరాన ఎవరికీ తెలియని ఏదో స్థలానికో, నిర్బంధంలో తీసుకుపోవటం పరిపాటి. ''ఎక్కడికి?'' అని ప్రశ్నలు వేసి అడిగే ధైర్యం ఎవరికీ లేదు. దాదాపు మనదేశంలో ఎమర్జెన్సీ నాటి భయానక వాతావరణమే! ఇంకొంచెం ఎక్కువేనేమో! 'స్టాలిన్' ఇనుప గుప్పెట రష్యాను పరిపాలించే రోజులవి.

''నా ట్రంకు పెట్టేది? నా హోటల్ బిల్లుమాటేమిటి?'' మెస్సింగ్ తనను తీసికెళ్తున్న వాళ్ళవైపు తిరిగి ప్రశ్నించాడు.

''ట్రంకుతో మనకు అవసరం లేదు. హోటల్‌బిల్లు సర్దుబాటు చేయబడింది''అని రహస్య పోలీసు అధికారి సమాధాన మిచ్చాడు.

కొంతకాలం తర్వాత మెస్సింగు ఆనాటి తన అనుభవాలను నెమరువేస్తూ చెప్పిన మాటలివి: ''కొంతసేపు ప్రయాణంచేసి మేము ఒకచోటుకి చేరుకున్నాం...అది ఏ ప్రదేశమో నాకు తెలియదు. నన్ను ఓ గదిలోకి తీసుకువెళ్ళారు. అది ఏదో ఒక హోటల్ రూములా వున్నది. ఒక వ్యక్తి ఆ గదిలోకి వచ్చాడు. ఎక్కువ పొడుగ్గాలేడు. మాదిరి ఎత్తుండి, దుబ్బుగా పెరిగిన మీసాలున్న ఆ వ్యక్తి

నాకెదురుగుండా వచ్చి నిలబడ్డాడు. ఆ వ్యక్తి ఎవరో తెలుసా? ఆధ్యాత్మిక శక్తుల ప్రదర్శనలిచ్చే నేను (ఉల్ఫ్‌మెస్సింగు), రష్యా నియంత స్టాలిన్‌తో తారసపడి ముఖాముఖి ఎదురుపడిన అద్భుత సమావేశం అది!'' అన్నాడు మెస్సింగు గతాన్ని తలుచుకుంటూ.

భౌతిక వాదాన్ని పూర్తిగా విశ్వసించే సామ్రాజ్యానికి నియంతలా పేరుమోసిన స్టాలిన్ ఓ వింత ప్రశ్న వేశాడు మెస్సింగుని -

అప్పుడు ''పోలెండు'' (Poland)లో ఏం జరుగుచున్నది. పోలెండు ప్రభుత్వ రాజకీయ నాయకులు వేస్తున్న ఎత్తుగడలు ఏమిటో చెప్పాలి? ఇవి

స్టాలిన్ మెస్సింగును కోరిన విశేషాలు. మెస్సింగు తన అద్భుత శక్తులు ఉపయోగించి, ఆ అతీంద్రియశక్తుల సహాయంతో తన పోలీస్ సహచరుల రహస్య రాజకీయ చర్యల గురించి స్టాలిన్ అడిగిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పాలి. దీన్నిబట్టి మెస్సింగు శక్తులలోని నిజానిజాలు స్టాలిన్ తరువాత తేల్చుకోదలిచారు. ఇది బాహ్యంగా మెస్సింగుకి పరీక్షగా కనిపించినా, స్టాలిన్ వ్యక్తిగత విశ్వాసాల పరీక్ష అయి వుండవచ్చు.

కాని ''ఉల్ఫ్‌మెస్సింగు'' అప్పటికే ప్రపంచమంతా పేరుమ్రోగిన దివ్యశక్తులు కల్గిన ఒక ఆధ్యాత్మిక వ్యక్తి! అప్పటికే ఎంతో మంది అనేకరంగాల్లోని ప్రముఖులు ఆయన దివ్యశక్తులు పరీక్షించి ఆశ్చర్యపోయారు. అలా స్వయంగా ఉల్ఫ్‌మెస్సింగు అద్భుతశక్తులను దర్శించిన వారిలో ప్రఖ్యాత సైంటిస్టు అయిన ''ఐన్‌స్టీన్'' (Einstein), మహాత్మాగాంధీ, ప్రఖ్యాత మనస్తత్వవేత్త ''ఫ్రాయిడ్'' (Freud) వంటి వాళ్ళు ఎందరో వున్నారు! చివరికి రష్యాలో కీర్తిశేషులు ''మార్షల్ పిల్‌సుడ్స్కీ'' (Marshal Pilsudsky) వంటి నాయకులు కూడా ''మెస్సింగు'' దివ్యశక్తులు ఎరిగినవారే! పోలెండ్‌ను హిట్లర్ ముట్టడించిన రోజులవి. నాజీ (Nazi) సైనికుల దురంతాలనుంచి తప్పించుకోవడానికి ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని 'మెస్సింగు' పారిపోయాడు.

ఎందుకంటే నమ్మశక్యంగాని ఆధ్యాత్మిక శక్తులున్న వ్యక్తి మెస్సింగు! ఆ విషయం హిట్లర్‌కీ తెలుసు. అందుకే ''మెస్సింగు''ను పట్టి తెచ్చిన వారికి 2,00,000 జర్మన్ ''మార్కులు'' ప్రైజుగా ప్రకటించాడు. ఆ పరిస్థితిలో స్టాలిన్, మెస్సింగును కలుసుకోవటం జరిగింది. ఆ మొదటి సమావేశం తరువాత ''జోసెఫ్ స్టాలిన్'' అనేక సార్లు ఉల్ఫ్‌మెస్సింగు అద్భుతశక్తులను స్వయంగా పరీక్షించాడు. అనేక సార్లు అతిరహస్యంగానూ, ఊహించరాని రహస్య పరిస్థితులలోనూ, స్టాలిన్ ''మెస్సింగు'' యొక్క అద్భుతశక్తులు గమనించడం జరిగింది. అంతేకాదు అప్పటికే స్టాలిన్‌కు మెస్సింగు యొక్క ఆధ్యాత్మిక శక్తులపై గురికుదిరింది. దూరాన ఎక్కడో జరుగుతున్న సంఘటనలు తేలిగ్గా పుస్తకం

చదివినట్లుగా చెప్పగలడు, మెస్సింగు. అంతేకాదు. స్టాలిన్‌కు పూర్తిగా తెలుసు. మెస్సింగు మనస్సుయొక్క ఏకాగ్రత ద్వారా తన ఆలోచనలను ఎదుటివ్యక్తి మనస్సులోకి ప్రవేశ పెట్టగలడని ఎదుటివ్యక్తి మనస్సులోని ఆలోచనలను కూడా తాను కంట్రోలు చేయగలడని! ఇతరుల ఆలోచనలను ''అలికివేయ''గలడని కూడా తెలుసు. ఉల్ఫ్‌మెస్సింగు శక్తులపై స్టాలిన్‌కు పూర్తివిశ్వాసం కుదిరింది. అయినాకాని స్టాలిన్ మెస్సింగుకు ఇంకో భయంకరమైన అగ్నిపరీక్ష పెట్టాడు! ఉల్ఫ్‌మెస్సింగు యొక్క ఆధ్యాత్మికశక్తులను పరీక్షించడానికి ఉద్దేశించిన ఈ పరీక్ష అతి విచిత్రమైనది. అతిరహస్యంగా జరగాల్సినది! అదేమిటంటే ఉల్ఫ్‌మెస్సింగు వెళ్ళి మాస్కోలోని ''గోస్‌బ్యాంకు'' (Gos Bank) క్యాషియరును కలవాలి. కలిసి తానెవరో తెలియకుండా ఆ క్యాషియరు ఆలోచనలను బలవంతంగా ఆజ్ఞాపించి, ఒక తెల్లకాగితం మీద సంతకం చేసి, అది ఒక ''చెక్కు''లాగా

ఆ క్యాషియరుకు ఇచ్చి (దాన్నిమార్చుకొని) దానిమీద లక్ష ''రూబుల్స్'' డబ్బును తీసుకురావాలి - ఇదీపరీక్ష. ఇది వింటున్న ఉల్ఫ్ మెస్సింగు ఒక్కసారి స్థంభించిపోయాడు. ఇది స్టాలిన్‌తో వ్యవహారం తన జీవితాన్ని అటోఇటో తేల్చివేసే పరీక్ష. కొన్ని సంవత్సరాల తర్వాత, ఆనాడు తన అనుభవాన్ని ఉల్ఫ్‌మెస్సింగు తన మాటలలో ఇలా చెప్పాడు. ''నేను బ్యాంకులో ప్రవేశించి సరాసరి క్యాషియరువైపు నడిచాను. అతడు చూస్తుండగానే ఒక నోట్‌బుక్‌తీసి అందులోంచి ఒక తెల్లకాయితం చింపి దానిపై సంతకంచేసి క్యాషియరు చేతికిచ్చాను. ఒక్క క్షణం క్యాషియరు తనచేతికిచ్చిన ఆ తెల్లకాయితాన్ని పరిశీలనగా చూశాడు. ఇంతలో నేను సూట్‌కేస్ తీసిబ్యాంకు 'కౌంటర్' దగ్గర తెరచి పెట్టాను. క్యాషియరు నుదురువంక కనుబొమ్మల మధ్యగా చూస్తూ, గట్టిగా సంకల్పించాను - అతను లక్షరూబుల్స్ తీసి నాకివ్వాలని! అంతే ఆ వయసు మళ్ళిన క్యాషియరు తను కూర్చున్న సీటులోంచి లేచి తనకున్న దీర్ఘకాల అనుభవంతో నేను తనకిచ్చిన ఆ తెల్లకాయితాన్ని జాగ్రత్తగా

యింకోసారి చదివి భద్రంగాదాచి, వెళ్ళి ఇనప్పెట్టేతాళాలు తీసి జాగ్రత్తగా అందులోంచి నోట్లకట్టలు లెక్కపెట్టి సరిగ్గా 1,00,000 అక్షరాల లక్ష రూబుల్స్‌ను ఎక్కౌంటు పుస్తకంలో నోటుచేసి నా దగ్గరకు తీసుకువచ్చి నా ముందు పెట్టాడు! ఆ నోట్లను తాపీగా నా సూట్‌కేసులో సర్ది చేతపట్టుకొని ''అతనికి' థాంక్స్ చెప్పిబయటికి వచ్చాను''- అని చెప్పాడు మెస్సింగు.

ఈ ప్రయోగం అవగానే ''ఉల్ఫ్‌మెస్సింగు'' గబగబా అడుగులు వేసుకుంటూ తిరిగి బ్యాంకులో ప్రవేశించాడు. ఆ ముసలి క్యాషియరు (Cashier)ను పిలిచి, తాను ఇచ్చింది తెల్లకాయితమని సరిగ్గా చూడమనీ హెచ్చరించి, తను తీసుకున్న లక్ష రూబుల్స్ నోట్లకట్టలను తిరిగి ఆ క్యాషియర్ టేబులుపైనే పెట్టేశాడు. ఒక్కసారి కళ్ళు గిర్రున తిరిగాయి. ఎంతో అనుభవజ్ఞుడైన ఆ బ్యాంకు క్యాషియరుకు మెస్సింగు అంతకుముందిచ్చిన కాయితాన్ని గబగబా బయటకు తీసిచూసాడు. ఆశ్చర్యం! అది చెక్కుకాదు తెల్లకాయితం. అకస్మాత్తుగా అతనికి గుండెపోటువచ్చి ఒక చేత్తో గుండె అదుముకుంటూ క్రింద పడిపోయాడు.

అదృష్టవశాత్తు ఆ గుండెపోటు నుంచి తేరుకొని ఆ క్యాషియరు బ్రతికి బయటపడ్డాడు. ఈ బ్యాంకు క్యాషియరే తర్వాత స్టాలిన్ పరిశీలించిన సాక్షులలో ముఖ్యమైనవాడుగా ఉల్ఫ్‌మెస్సింగుచూపిన అద్భుతశక్తికి నిదర్శనంగా స్టాలిన్ ముందు సాక్ష్యం ఇచ్చాడు! ఇతడు కాక ఇంకా ఇద్దరు సాక్షులు కూడా ఈ విషయాన్ని ధృవపరిచారు. ఉల్ఫ్‌మెస్సింగు తన అనుభవాల్ని చెపుతూ - ఇలాంటివెన్నో 'పరీక్షలు' పెట్టి తనను స్టాలిన్ అనుమానం లేకుండా పరీక్షించాడని చెప్పాడు.

ఇది ప్రపంచ ప్రఖ్యాతుడైన ఉల్ఫ్‌మెస్సింగు యొక్క ఆధ్యాత్మిక శక్తులతో సోవియట్ రష్యా నియంత స్టాలిన్‌కు జరిగిన మరపురాని అనుభవం.



2

# ఉల్ఫ్ - మెస్సింగ్

ఎక్కడనుంచి వచ్చిందీ అద్భుతశక్తి. మెస్సింగుకు? అతని శక్తులను గురించి విన్నవాళ్ళు. అతడి ప్రదర్శనలను చూసిన ప్రతివాళ్ళూ అడిగే ప్రశ్న ఇదే! ''ఇతడి అద్భుత జీవితంలో దాగివున్న రహస్యాలేమిటి?'' అని.

ఉల్ఫ్‌మెస్సింగుపుట్టింది రష్యాలో. ఇతడు వార్సాలో 'గోరాకాల్వారియా' లో, 1899వ సంవత్సరంలో, సెప్టెంబరు, 10న జన్మించాడు.

''యూదు''(Jews)లలో పోవిషా జాతికి చెందిన బీదకుటుంబంలో జన్మించిన ఇతని బాల్యం, దుర్భరదారిద్ర్యంతో నడచింది. అతని తల్లిదండ్రులు దైవంపై భక్తివిశ్వాసాలు కలిగిన ఒక మంచి కుటుంబానికి చెందినవారు.

చిన్నప్పటి నుంచి అద్భుతమైన జ్ఞాపకశక్తి వుండేది. ఉల్ఫ్‌మెస్సింగుకు అందుచేత ఆరుసంవత్సరాల వయస్సుకే ''యూదు''ల మతగ్రంథమైన ''టాల్‌ముడ్'' (Talmod) కంఠస్థం చేయగలిగాడు. వీరి కుటుంబములోని పెద్దలు ఇతన్ని మతాచార్యుడుగా శిక్షణ ఇచ్చేందుకు పంపించాలని ఉద్దేశించారు. అది విని కుటుంబముతో పరిచయమున్న వారందరూ కూడా ఎంతో ఆనందించారు. ఒక్క మెస్సింగుతప్ప! మెస్సింగు మాత్రం తనకా మత సంబంధమైన శిక్షణవద్దని మొండిగా వాదించాడు. ఈసమయంలో మెస్సింగు జీవితంలో ఒక ''వింత'' జరిగింది! మెస్సింగు దాన్నిగురించి ఇలా చెపుతాడు ''నాకిష్టం లేకపోయినా నన్ను మతాచార్యుడుగా చేయాలని అంతా అనుకున్నారు. సరిగ్గా ఇదే సమయంలో నా జీవితమంతా మార్చివేసిన ఓ అద్భుత ''మహిమ'' జరిగింది. ఆ రోజు మా నాన్నగారు నన్ను బజారుకువెళ్ళి ఒక సిగరెట్ ప్యాకెట్టు తెమ్మని పంపారు. అప్పటికే సంజపొద్దువాలి చీకట్లు అలుము కుంటున్నాయి. మేముండేది కొయ్యతో చేసిన ఇల్లు. వీధివాకిలి మెట్లుదిగి బయటకు వచ్చాను. ఇంటిముందు ''పోర్టికో'' అంతా దట్టమైన చీకటి. మెట్లు దిగానో లేదో నా ఎదుట చీకటిలో ఒక బ్రహ్మాండమైన ఆకారం నిలబడివుంది. తెల్లటి వస్త్రాలు ధరించి, చాలా పెద్దఆకారంతో వున్న ఆ వ్యక్తి ఖంగుమనే కంఠస్వరంతో ''బాబూ! నేను పై నుంచి వచ్చిన ధూతను! నీకో సందేశం తీసుకువచ్చాను... నీ భవిష్యత్తు గురించి తెలుపమని ఆదేశమయింది. నీవు తప్పక మతశిక్షణ ఇచ్చే ఆ స్కూలుకే వెళ్ళు! నీవు నేర్చుకునే ప్రార్థనలు దైవానికందు తాయి!''అన్నాడు. క్షణకాలంలో మెరుపు మెరిసినట్లుగా ఆ వ్యక్తి అక్కడే మాయమైనాడు! నాకేమీ పాలుపోలేదు. ఆరేళ్ళ పసివయస్సులో వున్న నాకు మనస్సుమీద ఆ మాటలు ఎలా పనిచేశాయో ఇప్పుడు వర్ణించడం కష్టం'' అంటాడు మెస్సింగు (Messing) తన గతాన్ని నెమరు వేస్తూ - ''ఒక పిడుగుపడి ఆ కరెంటు నాశరీరంలోకి వెళితే ఎలా వుంటుందో అలాగే అనిపించింది. వెంటనే స్పృహ తప్పి క్రింద పడిపోయాను. అలా ఎంతసేపు

గడిచిందో నాకు తెలియదు. నాకు తెలివివచ్చేసరికి అమ్మా నాన్నా నాపైనవంగి ప్రార్థన చేస్తున్నారు. ఆదుర్దా వాళ్ళ ముఖాల్లో కొట్టవచ్చినట్లు కనబడుతోంది. నాకు తెలివి రావటంతో వాళ్ళ మనస్సు కాస్తకుదుటపడింది. అప్పుడు నేను చూచిన దృశ్యం జరిగిన సంఘటనా, అంతా చెప్పాను వాళ్ళకు, నా తండ్రి అన్నీవిని ఆకాశం వంక చూస్తూ, – 'దైవసంకల్పం' అని మాత్రం అన్నాడు''

ఈ అద్భుతమైన సంఘటన జరిగిన తరువాత మతాచార్యులకు శిక్షణ ఇచ్చే ఆ స్కూలుకు వెళ్ళాలనే ఆకాంక్ష అతనిలో బాగాకలిగింది. కాని పిల్లవాడైన మెస్సింగుకు కఠినమైన ఆ స్కూలు శిక్షణ బాధగా అనిపించింది. చివరికి తన 11వ ఏట మెస్సింగ్ జేబులో 18 అణాలతో ఎవ్వరికీ చెప్పకుండా విశాల ప్రపంచంలోకి వెళ్ళిపోయాడు. ఏదో ఒక రైలులో ఎక్కాడు! ఆ ట్రైను ఎక్కడికి పోతుందో కూడా అతను ఆలోచించలేదు. తన దగ్గర టిక్కెట్టులేదు. దాదాపు ఖాళీగా వున్న ఆ రైలుపెట్టెలో సీటు క్రిందదూరి ఓమూల పడుకున్నాడు. రైలు కుదుపుకు చిన్నగా నిద్రపట్టింది. అలా ఎంతసేపు గడిచిందో అతనికి తెలియదు. ఇంతలో అతని జీవితంలో ఓ వింత సంఘటన జరిగింది. దానిని గురించి మెస్సింగు యిలా చెప్పాడు – టిక్కెట్టు అన్నకేకతో త్రుళ్ళి పడిలేచాను. ఎదురుగా వున్న టి.సిని చూచి ఒణుకు పుట్టిందినాకు. ఏమీ తోచక జేబులో వున్న ఓ తెల్లకాయితం ముక్క టిక్కెట్టు కలెక్టరు చేతికి అందించాను. అది అతను అందుకొంటూంటే మా యిద్దరి చూపులు కలిసాయి. క్షణకాలం! అంతే! ఎలా వచ్చిందో తెలీదు నాకా ఆలోచన అతడు దానిని టిక్కెట్టులాగా భావించాలని తీవ్రంగా సంకల్పించాను. అతని కనుబొమ్మల మధ్య చూస్తూ, అతను ఆ కాగితంముక్క అటు యిటూ త్రిప్పి చూసి మారుమాట్లాడకుండా టిక్కెట్టుకు చిల్లి పొడిచే తన చిన్న 'పట్టకారు' (Punch)తో దానిని ఒకసారి పంచ్‌చేసి, చెకింగ్ చేసినట్టే దానిని నాకు తిరిగి ఇచ్చేశాడు.

మరిటిక్కెట్టు ఉన్నది కదా! ఇక బెంచీ క్రింద ఎందుకు కూర్చోటం! లే! లేచి సీటుమీద కూర్చో! అన్నాడు ఆ టి.సి. ఆ క్షణం నుంచీ ప్రారంభ మయింది మెస్సింగ్ జీవితంలోని కొత్త అధ్యాయం అతనిలో దాగివున్న గొప్ప ఆధ్యాత్మిక శక్తి అనాడే మొదటిసారిగా తెలుసుకున్నాడు. ఉపయోగించ గలిగాడుకూడా. ఆనాటినుంచే మెస్సింగు యొక్క ఆధ్యాత్మిక శక్తులకు, వెనుక చూపన్నదే లేదు. అనేక దేశాలు తిరిగాడు. ఇతరుల మనస్సులను వశంచేసుకొని అనేక అద్భుతాలు చేసిచూపాడు. తన అద్భుతశక్తులు ప్రదర్శిస్తూ ప్రపంచంలో అనేక చోట్ల పర్యటించాడు. జపాన్, బ్రెజిల్, ఇండియా, ఆస్ట్రేలియా, అర్జంటీనా, లండన్, రోమ్, జనీవా - ఇలా ఊళ్ళు తిరిగినట్లు దేశాలే తిరిగాడు మెస్సింగు.

## గాంధీతో ''మెస్సింగ్':

ఇతడు 1937లో భారతదేశం వచ్చినప్పుడు గాంధీ మహాత్ముని కలుసుకున్నాడు. ఇద్దరూ చాలాసేపు రాజకీయాలు మాట్లాడుకున్నాక మెస్సింగ్ యొక్క అతీంద్రియ శక్తులను గాంధీజీ ఒక టెస్టు (Test) పెట్టారు. అదేమంత కష్టమైనదికాదు మెస్సింగ్‌కు. గాంధీజీ నోరు మెదపకుండా మనస్సుతోనే ఒక ఆజ్ఞ పంపించారు మెస్సింగ్ నుద్దేశించి - అక్కడ బల్లమీద నున్న మురళిని తీసుకువెళ్ళి, అవతల గదిలోనున్న మనిషికి ఇవ్వు!' అని గాంధీ ఆలోచనలను స్పష్టంగా విన్నారు మెస్సింగ్, వెంటనే లేచివెళ్ళి టేబుల్ మీదవున్న మురళిని తీసికొని ప్రక్కగదిలో వున్న వ్యక్తికి ఇచ్చాడు. మౌనంగానే, ఆ వ్యక్తి మురళిని తీసుకొని ఊద నారంభించారు.

ఆ మురళీ గానానికి ఆ గదిలోనే ఒక మూలపెట్టి వున్న బుట్ట ఉన్నట్లుండి కదలడం ప్రారంభించింది. చూస్తూండగానే బుట్టపై మూత తొలగింది. అందులోంచి రెండురంగుల పామొకటి పైకిలేచి మురళీనాదానికి అనుగుణంగా, చక్కగా ఆడసాగింది. ఇది చూసిన గాంధీ, మెస్సింగ్ యొక్క అద్భుతశక్తికి ఎంతో సంతోషించాడు.

ఉల్ఫ్-మెస్సింగ్ భారతదేశంలో అనేకచోట్ల తిరిగి, అనేక రహస్యస్థలాలలో తపస్సు చేసుకుంటున్న మహాయోగుల నెందరినో కలుసుకున్నాడు. వారి అద్భుత యోగశక్తులు చూచి ఎంతో ఆశ్చర్యపోయాడు-ముగ్ధుడైనాడు. భారతదేశపు యోగీశ్వరులను గురించి మెస్సింగ్ ఇలా అంటాడు - 'భారతీయ యోగులు అద్భుతశక్తి సంపన్నులు. వారు తమంతట తాముగా సంకల్ప మాత్రంతో నిర్వికల్పసమాధి స్థితిలోకి వెళ్ళగలరు. ఆ స్థితిలో వారు చలన రహితంగా దాదాపు మరణించిన వారిలా కనపడతారు. అలాంటి స్థితిలో వారు కొన్నివారాల తరబడికూడా ఉండగలరు. నేను మాత్రం ఎంత ప్రయత్నించినా మూడు రోజులకంటే ఎక్కువ సమాధిస్థితిలో ఉండలేక పోయేవాణ్ణి' అంటాడు మెస్సింగ్.

ఇలాంటి ఓ అద్భుతమైన అనుభవం, ఉల్ఫ్మెస్సింగ్‌కు, ప్రపంచ ప్రఖ్యాత సైంటిస్టు 'ఆల్‌బర్టు ఐన్‌స్టీన్'ను కలుసుకొన్నప్పుడు కూడా జరిగింది! 'నా గురించి' (About myself) అన్న తన ''ఆత్మకథ''లో మెస్సింగ్ ఆ అనుభవాన్ని గూర్చి అలా వ్రాశాడు. 'అది 1915 వ సంవత్సరం మొదటి ప్రపంచయుద్ధం ముమ్మరంగా జరుగుతున్న రోజులు. వియన్నాలో ఒక పెద్ద హాలులో నా (మెస్సింగ్) ''ఆధ్యాత్మిక శక్తుల ప్రదర్శన''కు ఏర్పాటు చేయబడింది. జనంతో హాలు కిటకిటలాడుతోంది. ఆ ప్రదర్శన చూడ్డానికి ప్రఖ్యాత శాస్త్రవేత్త 'ఐన్‌స్టీన్' కూడావచ్చారు. నా ప్రదర్శన ఆయనకెంతో నచ్చినట్లుంది. అందుకే ప్రదర్శన కాగానే పదహారేళ్ళయినా నిండని నన్ను తన బసకు రమ్మని స్వయంగా ఆహ్వానించారు. నా జీవితంలో అది మరపురాని అనుభవం. వారింటికి వెళ్ళాను. ఆ ఇంట్లో ఎక్కడ చూచినా పుస్తకాలే కనిపిస్తున్నాయి. ఆయన గదిలో నాకు పుస్తకాలు తప్ప వేరే ఏమీ కనిపించ లేదసలు. ఆసమయంలో అక్కడ ప్రపంచప్రఖ్యాతి పొందిన మనస్తత్వవేత్త ''ఫ్రాయిడ్'' (Freud) కూడా వున్నారు. 'ఐన్‌స్టీన్' నన్ను ఓ అద్భుత శక్తులు గల వ్యక్తిగా, పరిచయం చేశారు.

'ఫ్రాయిడ్' నావంక సాలోచనగా చూస్తూ, ఓ వింతపరీక్ష పెట్టాడు. నాకీనాటికీ అది స్పష్టంగా గుర్తుంది - ''ఫ్రాయిడ్ మౌనంగా మనస్సు ద్వారానే నాకొక సందేశం పంపాడు.' అదేమిటంటే - ''బాత్ రూములోకి వెళ్ళి అక్కడ అలమరలో ఉన్న చిన్నకత్తెర తీసుకురా! అది తీసుకొని తిన్నగా 'ఐన్‌స్టీన్' దగ్గరకు వెళ్ళి దుబ్బుగా పెరిగిన ఆయన మీసాలలోంచి మూడే మూడు వెంట్రుకలు కత్తిరించు'' - అదీ ఆ సందేశం యొక్క సారాంశం. ఆ సందేశాన్ని మనసుద్వారానే అందుకొన్న నేను బాత్‌రూములోకి వెళ్ళి కత్తెర తీసుకువచ్చాను. తిన్నగా ''ఐన్‌స్టీన్'' దగ్గరకువెళ్ళి, ఫ్రాయిడ్ యొక్క సందేశం వినయంగా తెలిపాను. నవ్వుతూ తన మీసాలనందించాడు 'ఐన్‌స్టీన్'. సరిగ్గా మూడేమూడు మీసాలు కత్తిరించి తీసుకువచ్చాను. అది చూచి అంతగొప్ప మనస్తత్వవేత్త అయిన 'ఫ్రాయిడ్' నిర్ఘాంతపోయాడు. ఆశ్చర్యాన్నుంచి తేరుకున్న ఫ్రాయిడ్, 'నాజీవితాన్ని రెండోసారి బ్రతకడానికి ఛాన్సిస్తే, దాన్ని పూర్తిగా ఈ మానసిక శక్తుల పరిశోధనకే అంకితం చేస్తాను' అన్నాడు ఆవేశ పూరితుడై, నీళ్ళు నిండినకళ్ళతో.

ఇంకా అనేక అద్భుతాలు చేసి చూపాడు మెస్సింగ్ ప్రపంచంలోని అనేక నగరాలలో, అవన్నీ వ్రాయాలంటే అది మళ్లీ ఆయన 'ఆత్మకథ' అంతవుతుంది. ముఖ్యంగా చెప్పాలంటే ఎవ్వరూ నమ్మశక్యంకాని అద్భుత మహిమలు ప్రదర్శించాడు. 'ఉల్ఫ్ మెస్సింగ్' అన్నింటిలోనూ కొట్టవచ్చేటట్టు కనిపించే ప్రత్యేకత ఒక్కటే - అది ఊహకందని అతని అపార మానసిక సంకల్పశక్తి! మనస్సుతో సాధించరాని దేదీలేదనే సత్యాన్ని తన అద్భుత ప్రదర్శనలద్వారా నిరూపించాడు, 'ఉల్ఫ్‌మెస్సింగ్'. ఒక్కసారికాదు వందసార్లు! వేలసార్లు!! రహస్యంగాకాదు. బహిరంగంగా! అనేకవేల ప్రేక్షకుల ముందు అనేక ప్రదర్శనలలో, అనేక మంది శాస్త్రవేత్తలచేత నిశితంగా పరీక్షించబడి,

* 'Mind Readers' - Sputnik No.1 (1966) రహస్య ప్రచురణ

* చూడు:- 'About Myself'- By "Wolf Messing" Science & Religion Nos: 7&8 (1965)

మేధావులందరికీ తృప్తి కలిగించేలా ఆ పరీక్షలన్నిటిలోనూ జయించి, తన అపార 'మానసిక ఆధ్యాత్మికశక్తి'ని ఋజువుచేసి చూపించాడు! ఇదే ఉల్ఫ్‌మెస్సింగ్ - ప్రత్యేకత. ఇతని ప్రదర్శనలతో సోవియట్ రష్యాలోనే ఒక విప్లవం ప్రారంభమయింది. అది బోల్షివిక్కులు రక్తపాతంతో సాధించిన రాజకీయ విప్లవం లాంటిదికాదు. మెస్సింగ్ సాధించిన ఈ విప్లవం, ఒక క్రొత్త యుగానికే నాంది పలికింది. సోవియట్ రష్యా చరిత్రలోనే - కాదు! మానవ చరిత్రలోనే! మెస్సింగ్ లేవదీసిన ఈ నూతన విప్లవం ప్రారంభమైంది రోడ్లమీద నినాదాలు చేస్తూకాదు - మనుష్యుల మనస్సుల్లోనే! ఇది ఒక గొప్ప మానసిక విప్లవం (Mental Revoluction) కమ్యూనిజం తీసుకువచ్చిన విప్లవంకంటే ఈ 'మానవసిక విప్లవం' ఇంకా నిగూఢమైనది కూడా! నిశ్శబ్దమైన ఈ మానసిక విప్లవం ఒక పెద్ద ఆధ్యాత్మిక తరంగాన్ని అంటే తుఫాను సమయంలో సముద్రకెరటం లాంటి ఓ ఉప్పెననే లేవదీసింది. ఈ ఉప్పెన సృష్టించింది. ఓ ప్రచండ ప్రభంజనాన్ని! ఓ సుడిగాలిని! అది భౌతికవాదం (Meterialism), కమ్యూనిజం, నాస్తికవాద పునాదులనే కూకటి వేళ్ళతో పెళ్ళగించివేసే సుడిగాలి!!!

తుఫానుకుముందు ఉండే ప్రశాంతత లాంటిదే, ఇప్పుడు రష్యాలో రాజుకొంటున్న - 'మానసిక విప్లవానికి' ముందుండే ప్రశాంతత!



3

# "లెనిన్" ఆత్మతో మాట్లాడిన స్త్రీ

అది 1961-వ సంవత్సరం! మాస్కోలో కమ్యూనిస్టుపార్టీ 20-వ కాంగ్రెస్ మహాసభలు జరుగుతున్న రోజులవి.

సభలో సోవియట్ కమ్యూనిష్టుపార్టీ కార్యదర్శి "నికితాకృశ్చేవ్" (Nikita Kruchev) లేచి, "స్టాలిన్ గురించీ, స్టాలిన్ పరిపాలనలో జరిగిన రాజకీయ తప్పిదాల గురించీ, ఆయన నియంతృత్వ ధోరణి, తిరోగమనవైఖరిని గురించీ, ఎంతో బహిరంగంగా విమర్శించాడు. ఆ ఉపన్యాసం ప్రపంచ, వార్తాపత్రిక లన్నిటిలోనూ పెద్దపెద్ద హెడ్డింగుల (Head Lines)తో ప్రచురించబడింది. 'స్టాలిన్'కు వ్యతిరేకంగా ఒక పెద్దగాలిదుమారం లేవదీశాడు 'కృశ్చేవ్'. ఆ సభలోనే జరిగిన ఇంకో అద్భుతం* ప్రపంచచరిత్రనే మార్చగలిగినంత ప్రభావము కలది. అది చాలామందికి తెలియదు. ఎందుకంటే దాన్ని గురించిన వార్తలు రష్యాదాటిబైట ఎక్కడా ప్రచురణకానియ్యలేదు.

---

* Twentieth Congress of the Communist party (Moscow) 1961 Speech of Darya Lazurkina

'చూ:- Russia Explores Inner spara (Tomorrow-Winter 1962.)

వయసు మళ్ళినా, నాజూకుగా కనబడే ఒక స్త్రీ 'డెలిగేట్' (Deligete) ఆ జనరల్ అసెంబ్లీని ఉద్దేశించి ప్రసంగించడానికి సభలో లేచి నిలబడి వేదికపైకి వెళ్ళింది. ఆమె పేరు ''దార్యా-లాజుర్కినా''. ఆమె రష్యన్ విప్లవంలో పనిచేసి చిన్నతనంలోనే గొప్పపేరు సంపాదించుకొన్నది, కమ్యూనిష్టుపార్టీ వర్గాలలోనే.

ఆమె చిన్నతనంలో, అంటే ఆమె తొలియవ్వనంలో వుండగానే 'లెనిన్'ను కలుసుకోవటం తటస్థించింది. మొదటి సమావేశంలోనే ఆయన ప్రభావానికి ఆకర్షితురాలై, కమ్యూనిష్టు పార్టీ సభ్యురాలైంది. ఆ తర్వాత 1917 విప్లవంలో ప్రాణాలకు కూడా లెఖ్కచెయ్యకుండా పనిచేసింది త్వరలోనే కమ్యూనిష్టుపార్టీలో గొప్ప నిస్వార్ధ వ్యక్తిగా పార్టీ సిద్ధాంతాలను మనస్ఫూర్తిగా అనుసరించే ఆదర్శవాదినిగా మంచి పేరుపొందింది. కాలక్రమేణా రష్యాలోకూడా మార్పులు రాసాగాయి. 1937 ప్రాంతంలో 'లెనిన్' ప్రభావంతో పనిచేసిన కమ్యూనిష్టు పార్టీలోని మొదటి వర్కర్లందరూ 'క్రమశిక్షణ చర్య'ల పేరిట అరెస్టు చేయబడటం జరిగింది. వేలాదిమంది కమ్యూనిష్టు కార్యకర్తల్లాగే, ఆదర్శవాదినీ, లెనిన్ శిష్యురాలూ అయిన 'దార్యా-లాజుర్కినా' కూడా కఠిన కారాగారశిక్షతో 'లేబార్ క్యాంపు'లో నిర్బంధానికి గురై దీర్ఘకాలం శిక్షలనుభవించింది.

అమెలాగే బంధించబడ్డ వేలాది యితర రాజకీయఖైదీలతో పాటే 'దార్యా'కు కూడా 19 సంవత్సరాల కఠినశిక్ష విధించబడింది. మరొక రెవరైనా అయితే ఆ శిక్షల్తో అంతకాలం (1961 వరకూ) ఓర్చుకొని, చెక్కుచెదరకుండా బయటపడగలిగేవారు కాదు. ఇది ఆమెకెలా సాధ్యమైందో, ఆమెను ధైర్యంగా నిలబెట్టిన విచిత్ర ఆధ్యాత్మికానుభూతులేమిటో ఆ సభలో అందరి ముందూ, మొదటిసారిగా వెల్లడించింది. ఆ కఠోరమైన ''నేరస్తుల-క్యాంపు'' (Concentration Camp)లో ఆమె కష్టాలు అనుభవించే రోజుల్లో 'అదృశ్య సహాయము', 'మానసిక బలం'. ఆమెకు నిత్యం 'లెనిన్ ఆత్మ' వద్దనుంచి ఎలా లభించాయో ఆమే మాటలతోనే విందాము. ఆమె శిక్షలను అనుభవించే నాటికి 'లెనిన్' మరణించి చాలాకాలం అయింది. ఆ కారాగారవాసంలో ఆమెకు కలిగిన వింత అనుభవాలను యిలా వివరించిందామె.

'ఆదారుణ శిక్ష ఎలా భరించగలిగానంటే, 'లెనిన్' ఎప్పుడు నాకు కనిపిస్తుండేవాడు. అలా ఆయన తరచూ కనిపించి నన్ను ఓదార్చేవాడు. నాకు ఎన్నో సలహాలిచ్చేవాడు. అంతేకాదు. ఆ అసహాయ స్థితిలో దిగులుపడివున్న నాకు, ఎంతో మనోబలాన్ని, ధైర్యాన్ని ఆయన ప్రసాదించేవాడు'- ఇక్కడ ఆయన అంటే చనిపోయిన 'లెనిన్ ఆత్మ' అన్నమాట! అంతేకాదు మరో ఆశ్చర్యకరమైన అనుభవాన్ని ఆ సభలోనే ఈ విధంగా తెలిపింది. 'దార్యా లాజుర్కినా' - 'సరిగ్గా నిన్న ఇదే సమయానికి నేను 'లెనిన్'ను స్పష్టంగా చూశాను! ఆయన ప్రత్యక్షంగా నా ముందుకు వచ్చాడు. ఆయన జీవించివుండగా ఎలా ఉండేవాడో సరిగ్గా అలాగే కనిపించాడు. ఆయనతో మాట్లాడాను కూడా! మరో విషయం కూడా చెప్పాడు లెనిన్నాతో - నాకిక్కడ దుర్భరంగా వున్నది. అందులోనూ ఈ ప్రదేశంలో 'స్టాలిన్' సమాధి ప్రక్కనేనా సమాధి ఉండటంవల్ల నాకెంతో ఇబ్బందిగా వుంది! 'స్టాలిన్' దేశానికెంతో అపకారం చేశాడు. అతడి ప్రక్కనే నేనుండటం నాకేమాత్రం ఇష్టం లేదు!!'- అన్నాడు లెనిన్! అంటూ తన వింత అనుభవాలు, అందరినీ ఆశ్చర్య చకితుల్ని చేస్తూ వెల్లడించింది. 'దార్యాలాజుర్కినా'

ఆమె చెప్పిన అనుభవాన్ని సోవియట్ పత్రిక ''ఇజ్వెస్తియా'' (Izvestia) కూడా ప్రచురించింది. కాని అందులో, ''దార్యాలాజుర్కినా'' ఉపన్యాసం విన్న సభలోని వారంతా పిడుగులు పడుతున్నాయా అన్నట్లు సంతోషంతో చప్పట్లు చరిచి హర్షధ్వానాలు చేశారని మాత్రమే ప్రకటించారు. కాని పార్టీ కారణాల వల్ల దార్యా ప్రసంగంలోని 'లెనిన్ఆత్మ'ను గురించిన వివరాలు మాత్రం జాగ్రత్తగా సెన్సారు చేయబడ్డాయి. ప్రపంచ పత్రికలలో వెయ్యకుండా.

కాని అదే మహాసభ గురించిన వార్తలను ప్రచురించిన 'టైమ్'(Time) పత్రిక మాత్రం - 20వ కమ్యూనిష్టు మహాసభలో చివరిలో జరిగిన ప్రసంగాలు, విచిత్రమైన ఆధ్యాత్మిక విషయాలతో, మేజిక్ (Magic) వంటి అపూర్వమైన అనుభవాలతో నిండి వున్నాయి' అని మాత్రమే ప్రచురించింది.

అయినా ఆరోజు ఆ సభలో ''దార్యాలూజుర్కినా'' చెప్పిన 'లెనిన్‌ఆత్మతో' తన అనుభవాలను ప్రత్యక్షంగా విన్న కమ్యూనిష్టు కార్యకర్తలు చాలామంది వున్నారు. అంతేకాదు ఇంకోవింత ఏమిటంటే. ఇది జరిగిన కొద్దిరోజులకే ''రెడ్‌స్క్వేర్'' (Red Swaure)లో ఉన్న స్టాలిన్ సమాధి పెళ్ళగించి వేయబడింది. లెనిన్‌సమాధి ప్రక్కనే వున్న స్టాలిన్ సమాధిదూరంగా వేరేచోటికి తరలించబడింది. ఈ విషయాన్ని 'మే బోన్' (Mabone) వ్రాసిన 'రష్యాలోని అంతరంగిక పరిశోధన' అన్న వ్యాసంలో 1962వ సంవత్సరం చివరిలో ప్రకటించబడింది.

నాస్తికులైన కమ్యూనిస్టుల నాయకులు కూడా 'లెనిన్‌ఆత్మ' 'దార్యా'కు చెప్పిన సందేశం పాటించక తప్పలేదు. లెనిన్ సమాధి ప్రక్కనే ఉన్న 'స్టాలిన్' సమాధిని ఇన్నేళ్ళ తర్వాత తొలగించటానికి వేరే కారణం ఇంకేముంటుంది! ఆత్మ, దేవుడు, ఆధ్యాత్మిక అనుభూతులు, అన్నీ అబద్ధం అని వాదించే ''కమ్యూనిష్టు పార్టీ'' సభ్యురాలైన 'దార్యా' ఈ విషయాన్నెలా నమ్మింది! మతంలోని దివ్యానుభూతులను నిజం కావని విమర్శించే కమ్యూనిష్టులు అత్యంత ప్రధానమైన తమ 20వ కాంగ్రెస్ మహాసభలోనే, ''దార్యా''ను ఈ విషయాలపై ఎలా ప్రసంగం చెయ్యనిచ్చారు?

అంటే అప్పటికే రష్యాలో మార్పు ఆరంభమైంది! సైంటిస్టులు చేసిన - చేస్తున్న ఆధ్యాత్మిక పరిశోధనలే దీనికి కారణం! అందులోను ముఖ్యంగా 'జోసెఫ్ కిర్లియన్' (Joseph Kirlian) కనిపెట్టిన కొత్తరకం ఫొటోగ్రఫీ ద్వారా, మానవ 'ఆత్మ' సత్యమని ఋజువు చేసే ఫొటోలే ఈ మార్పుని తెచ్చాయా? దీనికి సరైన సమాధానం కావాలంటే, ఆ 'కిర్లియన్ ఫొటోగ్రఫీ' ఏమిటో దానిద్వారా మానవుడి ఆత్మను ఎలా ఫొటోగ్రాఫ్ చేస్తారన్న విషయం తెలియాలి!

అది వచ్చే అధ్యాయంలో తెలుసుకుందాం!!



# రెండవ - శరీరం

**4**

''విప్పారుతూ కనివిని ఎరుగని ఒక క్రొత్త ప్రపంచం నాకళ్ళముందే ప్రత్యక్షమైనట్లయింది. రంగురంగుల వెలుగులతో మిరిమిట్లు గొలిపేలాగ వెలుగుతూ ఆరుతూ జిగేలుమంటూ ఆకాశంలోని నక్షత్ర లోకాల్లాగ ఏవేవో రంగురంగుల పొగమంచులాంటి వెలుగులు. అది వర్ణించడానికి అలవిగాని దృశ్యం కొన్నిలైట్లు తళతళ మెరుస్తున్నాయి. ఇంకా కొన్ని ఆకాశంలోని నక్షత్రాల్లాగ మినుకుమినుకు మంటున్నాయి. ఇంకొన్ని చీకటిరాత్రి ఆకాశంలో పరుగెత్తే 'ఉల్క'ల్లాగ దూసుకుపోతున్నాయి. మనస్సు ఉర్రూతలూగించే అద్భుతమైన రంగురంగుల ప్రపంచం అది. జిగేలుమనే నీలం, వెండిలా మెరిసే ఆకుపచ్చ, కెంపులాంటి ఎరుపు, నెమలి ఫించెములాంటి నీలం, గులాబీ వన్నెలతో కలసిన బంగారు రంగు, పొగమంచులో దూరాన్నుంచి కనిపించే నగరంలోని లైట్లలాగ వెలిగే వెలుతురు మబ్బు అది. మెరుపులూ - ధ్వనిలేని పిడుగులూ ఊహకందని అందాలుచిందే - రంగురంగుల మరో ప్రపంచం''.

ఏమిటి వీళ్ళు చూస్తున్నది? పంచరంగుల టి.వి. (T.V.) చిత్రాన్ని లేక ఊహాలోకంలో విహరించే రంగురంగుల పగటికలా! లేక ఆకాశంలో వెలిగే నక్షత్రమండలాలను టెలిస్కోపులో పెద్దవిగాచూసే రంగుల దృశ్యమూ! కాదు, ఇదేదీకాదు- ఈ రష్యన్ సైంటిస్టులు వర్ణిస్తున్నది. కవిత్వం కాదు - ఊహ చిత్రమూకాదు - వాళ్ళు చూస్తున్నది. మానవ శరీరంచుట్టూ వ్యాపించివుంది తేజస్సులా వెలిగే 'కాంతి చక్రాన్ని', క్రొత్తరకం కెమేరా ద్వారా ఫోటోలు తీసి అవి స్క్రీనుమీద సినిమాలాగ చూపెడుతూంటే ఎలా వుంటుందో అవి చూస్తున్న వాళ్ళు చేసే వర్ణనఇది.

అవును. మనిషికి అంతరాత్మ అనేది ఒకటి ఉంటుందని హిందువుల విశ్వాసం. ప్రాచీనకాలంనుంచీ యోగులూ, ఆధ్యాత్మిక శక్తులు కలిగిన దివ్యపురుషుడూ వర్ణించిన తేజోమయ శరీరం లేక ఒక అంతరాత్మ. ఈ నివసించే

స్థూలశరీరంలోపలే ఉంటుందనీ- అది దివ్యదృష్టితోగాని - అతీంద్రియశక్తులు కలిగిన యోగ సాధకులకుగాని, కనబడుతుందని యోగుల అనుభవం. భారతదేశంలోనూ, టిబెట్టులోనూ, రోము, గ్రీసుల్లోనూ అనాదిగా అవతార పురుషుల బొమ్మలు వేసినప్పుడల్లా వాళ్ళ తలచుట్టూ ఒక దివ్యమైన తేజశ్చక్రాన్ని చిత్రాల్లో చూపించటం ఈనాటికీ వున్న అలవాటు. దీనికి ఆధారం కేవలం ఊహాలేక కవుల వర్ణనాకాదు. ఆధ్యాత్మిక సాధనచేసి, యోగాభ్యాసం చేసిన పవిత్రమైన సాధకులు మాత్రమే చూడగలిగే, మానవ శరీరంచుట్టూ వెలిగే, ఈ దివ్య 'తేజస్సు'ను దానివల్ల ఏర్పడే రంగురంగుల 'కాంతిచక్రాన్ని' (Aura) ఈనాడు సైన్సు సహాయంతో సోవియట్ రష్యాలో ఫోటోగ్రాఫ్ చేశారు. దీనిపేరు 'కిర్లియన్ ఫొటోగ్రఫీ' (Kirlian Photography). ఆ ఫొటోగ్రాఫును తెరమీద చూపినపుడు అది చూచేవారికి కనిపించే రంగురంగుల దృశ్యాన్ని వారు చూస్తూ వర్ణించిన అనుభవమే, పైన వర్ణించిన రంగుల దృశ్యం!

ఇదంతా ఎలా ఆరంభమయిందో అదొక పెద్దకథ. సైన్సులో కంటికి కనిపించని ఎక్స్‌రే () ఫోటోలు కనిపెట్టినప్పుడు ఆ రోజుల్లో దాన్నే నమ్మటం కష్టమయింది అప్పటి సైంటిస్టులకు, కంటికి కనిపించని 'కాంతి' ఎలా వుంటుందీ! అని. అందులోనూ శరీరం లోపలి ఎముకలూ, నరాలూ, నాడులూ కనిపించేలాగ ఫొటో తియ్యడం ఎలా సాధ్యం అన్నది. భౌతికదృష్టితో కంటికి కనిపించే పదార్థాన్నే నమ్మే ఆనాటి 'సైన్సు'కు ఊహకందని విషయం! అంతకంటే అసాధ్యమైన ఆశ్చర్యం, ఈనాడు సోవియట్ రష్యాలో 'జోసఫ్ కిర్లియన్' కనిపెట్టిన – ఈ 'కిర్లియన్ ఫొటోగ్రఫీ'.

అది 1939వ సంవత్సరము. దక్షిణరష్యాలో నల్లసముద్రం దగ్గర ఉండే 'కుబాన్' (Kuban)కు ముఖ్యపట్టణమైన ''క్రాస్‌నోడర్'' (Krasnodar) పట్నంలో చెడిపోయిన తన ఎలక్ట్రికల్ పనిముట్లను రిపేరు చేయించాలని చూస్తున్నాడో యువత సైంటిస్టు. అతనికా పరికరాలు తన రీసెర్చిలో అర్జంటుగా అవసరమయ్యాయి. 'కిర్లియన్' అయితే బాగా రిపేరుచేసి యిస్తాడన్నారెవరో.

ఆ ఎలక్ట్రికల్ పనిముట్లు రిపేరుకొరకై వచ్చిన 'కిర్లియన్' అక్కడొక వింతచూశాడు - అదేమిటంటే అక్కడొక రోగి ''ఎలక్ట్రిసిటీ''తో చికిత్స పొందుతున్నాడు. యంత్రంలో అమర్చిన 'ఎలక్ట్రోడ్స్' సహాయంతో, ఎక్కువ స్పందన కలిగిన కరెంటుతో (High frequency electro-Therapy) చికిత్స జరుగుతున్నది. అకస్మాత్తుగా రోగిచర్మానికీ, ఆ ఎలక్ట్రోడుకూ మధ్య నిప్పురవ్వలవంటి సన్నని వెలుగు జిగేలుమని మెరవటం చూశాడు కిర్లియన్. చురుకైన అతని మెదలో ఒక ఆలోచన వచ్చింది. ఆ వెలుగు వచ్చినచోట, అంటే రోగి చర్మం ప్రక్కనే ఒక ఫోటో ఫిలిం ఉంచితే, ఆ వెలుగు ఫోటోలో పడుతుందా? అని''

కాని ఆ ఎలక్ట్రోడులోంచి వచ్చేకాంతివల్ల ఫిల్మ్‌నల్లబడి మాడిపోవచ్చును. అందుచేత 'కిర్లియన్'గాజు ఎలక్ట్రోడు స్థానంలో, దాని బదులు లోహపు ఎలక్ట్రోడు పెట్టి దాని క్రింద తన చేతిని చాపివుంచాడు!

చేతి అడుగున- ఫొటోఫిల్మ్ పెట్టాడు. చేతికి కరెంటుషాక్ కొట్టుందేమోనని అనుమానమొచ్చింది. అయినా సైన్సులో నూతన ప్రయోగం గనుక, దానికోసం ఆ మాత్రం త్యాగం చెయ్యాలికదా! ఏం జరుగుతుందో చూద్దామనుకొని, ఆ కరెంటు మిషన్‌స్విచ్ ఆన్‌చేసి వెంటనే చటుక్కన ఆఫ్ చేశాడు తక్షణమే. ఆశ్చర్యం తన చేతి ఆకారం అచ్చులాగ ఎక్కడయితే ఫొటోలో ప్రింటుచేసి చూశాడు. అవును, స్పష్టంగా కనిపిస్తున్నది - నల్లటిమబ్బు వెనకాల, సూర్యకిరణాలు వెనుకనుంచి ఫోకస్ చేసినట్లు (సూర్యోదయ సూర్యాస్తమయ సమయాలలో) కనిపిస్తాయే, అలాగే కాంతికిరణాలు చేతికి అన్నివైపులా 'తేజస్సు'లా వ్యాపించివున్నట్లుగా ఫొటోలో పడ్డాయి. పరమాద్భుతం! సైన్సులో ఒక నూతనాధ్యాయం!! ఓ ఘన విజయం ఎవరూ యింతవరకు సాధించని అపూర్వ విజయాన్ని సాధించాడు 'కిర్లియన్'. ఆనాడే జన్మించింది సైన్సులో ఒక నూతన శకం. అలా ప్రారంభమైంది - ''కిర్లియన్ ఫొటోగ్రఫీ'' రష్యాలో!

'కిర్లియన్' హడావుడిగా 'వేలంటీనా' (Valentina) దగ్గరకు ఉత్సాహంతో పరిగెత్తాడు, 14 రకాల మార్పులతో తీసిన ఆ ''కిర్లియన్ ఫొటోగ్రాఫు'' కాపీలు

పట్టుకుని, వాటిలో స్పష్టంగా కనబడుతున్నాది. మానవ శరీరంచుట్టూ వెలుగుతూ వుండే 'దివ్యతేజస్సు'. 'వేలంటీనా' అతని భార్య. ఆమె రష్యాలో టీచర్‌గానూ, జర్నలిష్టుగానూ, పనిచేస్తున్నది. తన భర్త సాధించిన అపూర్వ విజయానికి తన సూచనలతో కొన్ని మెరుగులుపెట్టి ఇంకొంచెం వెలికితీసింది. ఇద్దరూకలిసి ఒక కొత్తయంత్రాన్ని తయారుచేశారు. దానికి ఒక 'జనరేటరు'ను అమర్చి ప్రక్కన ఒక "మైక్రోస్కోపు" లేక సూక్ష్మదర్శిని (Micro Scope) అమర్చి 'లెన్సు'ల సహాయంతో మనిషి చేతిమీదగాని, కరెంటు స్పందనలను ప్రసారంచేసి దాని ఫోటోగ్రాఫ్ తీయవచ్చు, క్రమేణా 'రీసెర్చి'వల్ల అభివృద్ధిచేసిన 'కిర్లియన్ ఫొటోగ్రాఫులు' తీసేయంత్రంతో సెకండుకు 75వేల స్పందనల నుంచీ 2,00,000 కరెంటు స్పందనలు వచ్చేదాకా హెచ్చు స్పందనల కరెంటును (High Frequency Oscillator) తయారుచేశాడు. 'కిర్లియన్' దీనిసహాయంతో అనేక రకాల ఫొటోలు తీశాడు. అన్నిటిలోనూ ఋజువైంది ఒక్కటే ప్రాణం కలిగిన ఏవస్తువైనా తనచుట్టురా 'తేజస్సు'వంటి ఒక కాంతిచక్రాన్ని కలిగి ఉంటుందని - దాన్ని స్పష్టంగా ఫోటోగ్రాఫులో తీయవచ్చుని! ఈ ప్రత్యేకమైన ఫొటోగ్రాఫు పద్ధతికి 'కిర్లియన్ ఫొటోగ్రాఫు' అని పేరు స్థిరపడి పోయింది. 1939 తర్వాత దాదాపు 40 సంవత్సరాలుగా జరిగిన సైన్సు పురోగతిలో అంచెలంచెలుగా పెరిగి పోయింది. కిర్లియన్ ఫొటోగ్రాఫీ విధానం. అనుభవం గడించిన కొద్దీ ఆనాటి మొరటుయంత్రాలను మరింత సున్నితంగానూ, మరింతతేలికగానూ, సైన్సు దృష్టాయ నిర్దుష్టంగానూ ఫొటోలు తీయగల్గిన ప్రత్యేకమైన కెమేరాలను రష్యాలో సాధించారు. దీని సహాయంతో అనేక వస్తువుల ఫొటోలు తీయడం జరిగింది.

ఒక క్యాబేజి ఆకును ఫొటోతీశారు. స్పష్టంగా ఆకులో ఈనెలు ఆకు ఆకారం ఫొటోలో కనబడడమేకాక, ఆకుచుట్టు ఒక వెలుగు మబ్బులాగ 'తేజస్సు'. గ్రహణం సమయంలో సూర్యుడిచుట్టు కనిపించే కాంతి చక్రంలాంటిది. అతిస్పష్టంగా ఫొటోలో కనబడింది. కనుక ఈ కాంతి లేక

తేజస్సు మనుషులకేకాక చెట్లకికూడా ఉన్నదన్న విషయం బోధపడింది. కిర్లియన్ ఫొటోద్వారా, మనిషి శరీరంలో ఈ కాంతి ఎలా బయటికి వస్తుందో స్పష్టంగా పరిశీలించేలాగ ఫొటోలు తీయాలని సంకల్పించాడు. కిర్లియన్. ఫలితంగా చర్మం పెద్దదిగా ''మైక్రోస్కోపు'' కింద ప్రదర్శించి తీసిన ఫొటోలో - ఆశ్చర్యం! ప్రతిరోమకూపంలోంచి బయటికి చిమ్ముతున్న తేజస్సు కిరణాలు చీపురు కట్టల్లాగా వెలుగుతూ పడినాయి ''కిర్లియన్ ఫొటో''లో నల్లటి చర్మం మీద పెద్దసారంగాల్లాగ గుండ్రని చిల్లులు. దానిలోంచి అగ్నిపర్వతంలోంచి వెలగ్రక్కే మంటలాగ బయటికి చిమ్మేతేజస్సు. మైక్రోస్కోపు కిందచూస్తే మన రోమకూపాల దృశ్యం అలా ఉన్నది! ఆరోగ్యంగా వున్నప్పుడూ రోగం వచ్చినప్పుడూ లేక వ్యక్తి చనిపోతున్నప్పుడూ ఇలాగ అనేక దశలలో తేలిన విషయం పరమాశ్చర్యం! ఆరోగ్యంగా వున్నవాడికి చర్మంలోంచి బయటికి చిమ్మేకాంతి చాలాదూరం వ్యాపించిన కిరణాలుగా గొంగళిపురుగు చుట్టూ వున్న నూగులాగ శరీరం చుట్టూవ్యాపించి వున్నది. అనారోగ్యంగా వున్నప్పుడు, తగ్గించిన దీపాల్లాగ తక్కువ వెలుగుతో ఉండటం మరణిస్తూవున్న వ్యక్తికి ఆ తేజస్సు చర్మం దగ్గర కుదించుకొని అస్తమించడం, ఇలాగ అనేక పరిస్థితులలో తీసిన ఫొటోలలో మానవశరీరములో ఉండే దివ్యతేజస్సును స్పష్టంగా ఫొటోలలో కెక్కించగలిగాడు - కిర్లియన్.

'కిర్లియన్' దంపతులు ఈ విజయాలతో సంతృప్తిపడలేదు. 'వాలెంటైనా' తన భర్తతో ఉత్సాహంగా పాల్గొన్నది ఈ కొత్త పరిశోధనలో, మొదట్లో తీసిన ఫొటోలు స్థిరంగా చలనం లేకుండా మామూలు ఫొటోల్లాగ అచ్చయి ఉండేవి. కాని త్వరలోనే సినిమాలో కదలికను ఫొటోతీసే 'మూవీ కెమెరా' వంటిదే కిర్లియన్ ఫొటోగ్రఫీతో కూడ తయారుచేశారు. అంతే!! ఒక క్రొత్త ప్రపంచం వాళ్ళ కళ్ళముందే విరుచుకుపడింది. రంగురంగుల జ్యోతులతో వెలుగుతూ ఆరుతూవుండే అపూర్వమైన ప్రపంచం - కళ్ళముందు సాక్షాత్కరించింది. వెలుగులతో తాండవిస్తూ ఇదే మనం మొదట చదివిన రంగురంగుల దృశ్యాల వర్ణన. ఈ రంగుల జ్యోతిర్మయ దృశ్యం బ్రతికివున్న మానవుడి ఆత్మలోని

తేజస్సు. నిత్యం కదులుతూ స్పందిస్తూ చైతన్యవంతంగా ఎలా కనబడుతోందో దాన్ని చూపించే చలనచిత్రం. కిర్లియన్ కెమేరాతో తీసిన ఈ చైతన్యం యొక్క చిత్రాలు మనిషిలోని తేజస్సు క్షణక్షణానికి ఎలా మారుతుందో - ప్రతి ఉత్సాహ సమయంలో జిగేలుమని మెరుస్తూ, ప్రతి నిరుత్సాహంలోను ఆరిపోతున్నట్లు తగ్గిపోతూ, నిమిష నిమిషానికి మారే ప్రతి ఆలోచనలవల్ల రంగురంగుల మార్పులు పొందే తేజస్సును చూపుతున్నాయి. చెరువుమీద ఏర్పడే అలలు ఎలాగైతే నీటిమీద ప్రతిఫలించే సూర్యరశ్మిని జిగేలుమంటూ ప్రతిఫలిస్తాయో అలాగే మనిషిలోని ఆలోచనలను తళుకు తళుకుమని రంగు రంగుల మెరుపులతో ప్రతిఫలింప చేస్తుంది. కిర్లియన్ ఫోటోగ్రాఫ్ సహాయంతో చేసిన ఈ కొత్త రకం సినీ కెమేరా! దీనితో కిర్లియన్ ఫోటోగ్రాఫీ చరిత్రలో నూతన అధ్యాయం ఆరంభమయింది. ఈ కిర్లియన్ పరిశోధనలు ఒక క్రొత్త ప్రపంచాన్ని ఆవిష్కరింపచేశాయి. కంటికి కనిపించని దివ్యమైన రంగులతో స్పందించే ఆధ్యాత్మిక ప్రపంచం - ఇన్నాళ్ళు యోగుల దివ్యదృష్టికే కనిపించే మానవుడి సూక్ష్మశరీరం. దాని రంగులు - సైన్సు కళ్ళకికూడా కనిపించేలాగ తెరచిన ద్వారమే ఈ కిర్లియన్ ఫొటోగ్రఫీ, దీని పర్యవసానం రష్యన్ సైన్సుమీదా భౌతికశాస్త్రం పైనా ఏ విధంగా ఉంటుందో ఊహించడం కష్టం. కాని ఒక్క విషయంమాత్రం ఋజువైంది. మానవుడి శరీరంలోపల కేవలం రసాయన ద్రవ్యాలే కాకుండా, స్థూలశరీరానికి అంతర్లీనమైన ఒకానొక ''సూక్ష్మ శరీరం'' (Subtle Body) తేజోమయశరీరం (Astral Body) ఉన్నట్లుగా ఋజువుచేసే రూఢి అయిన పరిశోధనే కిర్లియన్ ఫొటోగ్రఫీ. దీని ఫలితాలు భౌతికవాదం (Materialism)పైన, నాస్తికత్వం (Atheism)పైన ఎలా ఉంటాయో ఊహించవచ్చు. నాస్తికత్వం - భౌతికవాదం, అన్న ఈ రెండు సూత్రాల పైన ఆధారపడ్డ కమ్యూనిస్టు సిద్ధాంతం. దీనివల్ల ఏ విధంగా మార్పు చెందుతుందో అని ఆలోచిస్తే - అణువు బద్ధలైతే పదార్థం పరిస్థితి ఏమైందో - సరిగ్గా ''పదార్థ వాదమూ'' అంతే అయింది.



5

# సైన్సు పరిశోధనలో ''జీవాత్మ'' లేక ''సూక్ష్మశరీరం''

మనిషి శరీరంలో అతని వ్యక్తిత్వానికి, స్వభావానికి మానసిక లక్షణాలకూ, కారణమైనదేదో అంతర్లీనంగా ఉన్నా, పైకి మాత్రం కనిపించేది పదార్థమే. శరీరంలోపల 'తాను'గా ఉండే వ్యక్తిత్వం పేరు ''జీవాత్మ'' అని ప్రాచీన మతగ్రంథాలు, యోగశాస్త్ర గ్రంథాలు, తెలుపుతున్నాయి. కాని సోవియట్ రష్యాలో 1917లో వచ్చిన కమ్యూనిష్టు ప్రభుత్వం నాస్తికత్వం, భౌతికవాదం అన్నవి రెండూ మూలసూత్రాలుగా పెట్టుకొన్నది. అందువల్ల మతసంబంధమైన విశ్వాసాలను, మూఢనమ్మకాలుగా ఋజువుచేసి, ప్రజలకు మతంపైన, అధ్యాత్మిక విషయాలపైన ఆసక్తి లేకుండాచేసే ప్రచార కార్యక్రమం పెద్దఎత్తున చేపట్టింది. దీనిలో మొదటి భాగంగా ప్రజల మనసుల్లో, మతం అన్నా, దేవుడన్నా, సాధువులన్నా, యోగులన్నా, అవిశ్వాసం ద్వేషం రగిల్చి, ఇవన్నీ బూటకాలని నమ్మించే ఉద్యమం తారాస్థాయినందుకొన్న రోజులు, స్టాలిన్ పరిపాలనలో నడిచాయి. ఇప్పటికీ కమ్యూనిస్టుపార్టీ మనదేశంలోకూడా తరచూ దేవుళ్ళమీదా, సాధువులు సత్పురుషుల మీదా, యోగసిద్ధులు, మానవుడి అతీంద్రియశక్తులమీదా ప్రతినిత్యం దాడిచేస్తుండటం కనబడుతోంది. మనకీనాడు సినిమాలలో, ఉపన్యాసాలలో,నవలల్లో ఇలా అనేక విధాల

విద్యార్థుల మనసులలో పసివయస్సులలో వున్న పిల్లల ఆలోచనలలో, ఈ ప్రాచీన ఆధ్యాత్మిక సంస్కారాలను తుడిచి పెట్టెయ్యాలనే ప్రచారం, ఈ భౌతికవాదశక్తులు చేస్తున్నాయి. కొన్ని సంవత్సరాలుగా కాని ప్రచారం ప్రచ్ఛన్నంగా, పైకి తెలియకుండా అనేకరూపాల్లో మనదేశంలో కూడా నడుస్తున్నది! మన ప్రభుత్వాలు, అంతగా పట్టించుకోకపోవడం వల్ల ప్రభుత్వ యంత్రాంగంలోవున్న బాధ్యతగల వ్యక్తులు కూడా ఈ నాస్తికవాదానికీ, భౌతిక వాదానికీ, డబ్బుఆశతోనో, భయంతోనో కట్టుపడి ఏమీ చేయకుండా ఊరుకోవడం జరుగుతోంది. ఇలాంటి ప్రచారంలో మొదటిది. ముఖ్యమైనది - ''మనిషికి అంతరాత్మ అనేది లేదు''. అన్న నాస్తిక సిద్ధాంతం.

మనిషి కేవలం రసాయనిక వస్తువుల కలయికవల్ల ఏర్పడుతున్న సంయోగంతో నడిచే ఒక యంత్రం వంటివాడే. కాని మనిషి శరీరం తగలేసిన తరువాతకూడా, మిగిలే శాశ్వతమైన 'సత్యం, లేక 'జీవాత్మ' అనేది లేదనీ, అలాంటిది ఉండటం అసంభవం అన్న వాదమే, ఈనాడు మనదేశంలో 'రేషనలిష్టులు' లేక సత్యాన్వేషణపరులు లేక చైతన్య సంస్థలు, 'నాస్తిక ప్రచార సభలు' 'చార్వాక సమ్మేళనములు' అంటూ, అనేక రకరకాల పేర్లతో ఈరకమైన రహస్య ప్రచారాన్ని చేస్తున్నాయి. బయటదేశాల మద్దతు వున్నదన్నా మనం ఆశ్చర్యపడనక్కరలేదు. మనదేశ సాంప్రదాయాలనీ, ప్రాచీన భారతీయ సంస్కృతినీ, వేళాకోళం చేయడం, దుయ్యబట్టడం, వంటి దురభ్యాసాలు నేర్పడం. ప్రజలలో ఆధ్యాత్మిక విషయాలపైన అవిశ్వాసం, ద్వేషం, కలిగేలా చేయడమే వారి కార్యక్రమం. మన దేశంలో వున్న మానసపుత్రులకు కూడా. రష్యను కమ్యూనిష్టులకు ఆనాడు ఎప్పుడో 1917లో మూలసూత్రాలుగా వున్న అవిశ్వాసము, భౌతికవాదాలే ఆధారం - ఈనాటికీ. అందులో ముఖ్యమైనది, మనిషికి 'ఆత్మ' అంటూ ఒకటిలేదనే మూర్ఖవాదం. 30 సంవత్సరాల అవిశ్వాసం తర్వాత మనిషిలోవుండే ఈ 'జీవాత్మ' గురించి రష్యాలో జరిగిన - జరుగుతున్న పరిశోధనలు ఏం తెలుపుతున్నాయో పరిశీలిద్దాం.

కిందటి అధ్యాయంలో గమనించినట్లు 'జోసఫ్ కిర్లియన్' కనిపెట్టిన కొత్తరకం ఫొటోగ్రఫీతో మనిషి స్థూలశరీరం లోపలవుండే ఇంకొక చైతన్యవంతమైన ఒకానొక 'తేజస్సు'వంటి రెండవ శరీరాన్ని ఫొటోగ్రాఫ్ చేయడంలో అపూర్వమైన విజయాన్ని సాధించారు సోవియట్ శాస్త్రజ్ఞులు. ఈ లోపలవుండే రెండవశరీరాన్ని ఆధ్యాత్మిక పరిభాషలో 'జీవాత్మ' లేక 'సూక్ష్మశరీరం'లేక 'యోగమయ శరీరం' అంటారు. అదే మరణించిన వ్యక్తికి స్థూలశరీరం తగలబడిపోయిన తర్వాత. లోపల 'ప్రేతము' లేక 'ప్రేతాత్మ' (Ghost) అనబడే సూక్ష్మశరీరానికి (Subtle body) 'యాతనామయ శరీరం' లేక 'యోగమయశరీరం' లేక 'భూతాత్మ' అని పేరు. 'కిర్లియన్ ఫొటోగ్రఫీ' పరిశోధకులు అన్వేషించిన మొదటి ప్రశ్నలలో ఈ సూక్ష్మశరీరం దేనితో తయారవుతుంది? ఆపదార్థం యొక్క స్వభావం ఎటువంటిది? ఈ శరీరంమీద విద్యుత్తు (Electricity)కు కాని, అయస్కాంత తరంగాలకిగాని ఏమైనా ప్రభావం వుంటుందా? దీనిని స్థూలశరీరం నుంచి వేరుచేసి విడిగా చూపవచ్చా? అన్న సమస్యలు పరిశోధించబడ్డాయి.

ఇందులో మొదటిది చాలా విచిత్రమైన పరిశోధన మనిషి బ్రతికుండగానే, అతని శరీరంలోంచి ఈ అంతరాత్మను లేక సూక్ష్మ శరీరాన్ని బైటకి పంపించవచ్చా అన్నపరిశోధన! 'డోబ్రోవిచ్' అనే రష్యన్ సైంటిస్టు అనేకవిధాల పరిశోధించాడు. ఈయన కనిపెట్టిన విచిత్రమైన విషయాలను తన పరిశోధనా గ్రంథమైన 'నీ శరీరంలోంచి బయటికి వెళ్ళిపోదలచావా?' అనే గ్రంథంలో చూడవచ్చు. ★ ఈయన పరిశోధనలు సరిగ్గా పావుశతాబ్దం క్రితం ఒక ఇంగ్లీషు పరిశోధకుడూ; దివ్యశక్తులు కలిగిన "మీడియం' (Medium), గెరాల్డైమ్ కమ్మిన్స్ (Geraldime Cummins) మాటలతో సరిగ్గా సరిపోతున్నాయి. 'జ్ఞానము' అనే తన పుస్తకంలో ఇలా వ్రాయబడివుంది. 'జీవితమంతా చేసిన పరిశోధనలో ఒక్కవిషయం ధృవపడింది. అదేమిటంటే ప్రతివ్యక్తికీ, కనిపించే స్థూలశరీరం కాకుండా లోపల ఇంకో 'రెండవశరీరం'

* Dobrovitch - 'Do you Want to get away from Yourself?'
- Znanie Sila (1969)

ఉంటుందని. ఈ రెండవ శరీరం ప్రాచీనదేశాలలోని యోగవిద్యలోనూ, దివ్యజ్ఞానంలో చెప్పే రహస్యమైన ఉపదేశంలోనూ ఒక ముఖ్యమైన అంశం. ఇది ఒక అయస్కాంతశక్తి వంటి శక్తితో తయారైన శరీరం! స్థూలశరీరంతో కలిసే వుంటుంది. ఇతర బ్రహ్మాండంలో ఉన్న అనేక రకాలైన శక్తులూ, భౌతికంకాని 'అతి మానసికమైన ప్రసారము' దీనిపైన ప్రభావం కల్గివుంటాయి. నిజం చెప్పాలంటే మనచుట్టూ ఉండే గ్రహాలూ, మనచుట్టూ ఉండే భూపరిధిలోని అయస్కాంతశక్తి, వీటితో మనం తెలుసుకొనే విషయాలు మెదడులో అనుభవంగా మారి చివరికి విశ్వాసాలుగా రూపొందే చైతన్యమయ పరిణామ మంతా ఈ రెండవ శరీరంలోనే జరుగుతుంది.

'గెరాల్డైమ్ కమ్మిన్స్' చెప్పిన విషయాల్లో అద్భుతమైన విశేషం ఏమంటే 'మనస్సు' సరాసరి మన మెదడులోంచి పనిచేయదు. శరీరంలో ఒక సూక్ష్మశరీరం వంటిది కంటికి కనబడని మనస్సునూ, కంటికి కనిపించే మెదడులోని జీవకణాలనూ, కలిపి పనిచేసేటట్లు చేస్తుంది.

.... ఈనాడు సైంటిస్టులు ఇప్పటికీ గ్రహించనంతటి సూక్ష్మమైన కణములు, ఈ సూక్ష్మశరీరంలోంచి కిరణాల్లాగా తీగల్లాగా మెదడులోకీ, శరీరంలోని కొన్ని కేంద్రాలలోకీ ప్రయాణం చేస్తాయి... ఈ కంటికి కనిపించని సూక్ష్మశరీరమే మన మనస్సుకీ, మనలోని జీవచైతన్యానికీ మధ్యన ఒక వంతెనగా ఉండి ఈ రెండింటిని పదార్థమయమైన ఈ స్థూలశరీరంతో కలిపివుంచి పని చేయిస్తుంది. *

ఆధ్యాత్మిక సాధకులు, మహాయోగులు మాత్రమే తమ యోగశక్తితో చూడగలిగిన ఈ 'జీవాత్మ'ను సైన్సుకు సరిపోయేలా ఋజువు చేసేదెలాగ? ఈ కంటికి కనిపించని సూక్ష్మశరీరాన్ని లేక పదార్థంతో తయారుకాని (స్థూల శరీరానికి అతీతమైన) తేజోమయ శరీరాన్ని, భౌతికవాదులైన (Materialists) రష్యాన్ సైంటిస్టులు ప్రత్యక్షంగా చూపించడంలో విజయం సాధించారా అన్నది

---

* Geraldime Cummins - 'Beyond Human personality' (London 1935)

సమస్య. ప్రపంచంలోని అనేక దేశాల సైంటిస్టులను కూడా కలవరపెడుతున్న సమస్య.

ఎందుకంటే డాక్టర్లు ముఖ్యంగా ఈ సూక్ష్మశరీరం మీద దృష్టి పెట్టుకుని వైద్యం చేయవచ్చు. శరీరం ఒక రసాయనశాల అయినట్లుగా ఈనాడు హాస్పిటల్‌లో చాలా మంది రోగులు ఆపరేషన్లో కాలుగాని, చేయిగాని తీసివేసిన (Amputation) తర్వాత కూడా చాలాకాలం తమకి పూర్వం ఉన్నచేయి లేక అవయవం ఇంకా గాలిలో కదులుతూ ఉన్నట్లే భావన కలగటం, చాలా మంది రోగులకు అనుభవంలోని విషయం, డాక్టర్లు ఏంచెబుతారంటే - ఇది కేవలం మనస్సుయొక్క భ్రాంతి అని. అందులోనూ నాస్తికవాదులైన మనదేశపు వైజ్ఞానికులలో కొందరు తమకు తెలియని (ఆ విషయంలో ప్రత్యేక పరిశోధనేమీ చేయకున్నా) విషయాలేవీ లేవని రూఢిగా చెప్పగలరు. అంతేగాక, నిజానికి విరుద్ధంగా 'మానసికభ్రాంతి' లేక 'గ్రంధుల లోపం' అని సరిపుచ్చి సైన్సు యొక్క లోటును వీరి ఊహతో పూరిస్తారు.

కాని రష్యన్ సైంటిస్టులు అలా చేయలేదు. వీరు సొంత అభిప్రాయాలను ఒక ప్రక్కన వుంచి, తమ విశ్వాసాలతో సంబంధం లేకుండా పరిశోధనలను కేవలం నిజాన్ని తెలుసుకొనే దృష్టితోనే చేశారు. ఈ పరిశోధనల ఫలితంగానే - 'స్థూలశరీరంతో సంబంధంలేని' (స్థూలశరీరం నుంచి విడిగా) ఒక సూక్ష్మశరీరం ఉన్నట్లు స్పష్టంగా ఋజువయింది.

చాలామంది కిర్లియన్ ఫొటోగ్రఫీ గురించి ఒక సందేహాన్ని లేవదీశారు. ''కిర్లియన్'' ఫొటోలో మనిషి శరీరంచుట్టూ కనిపించే 'తేజస్సు' ఆధ్యాత్మిక తేజస్సేమీకాదనీ, అది 'సూక్ష్మశరీరం'గాని 'అంతరాత్మ'గాని కాదనీ, అది కేవలం ప్రతి వస్తువుచుట్టు ఉండే అయస్కాంత కిరణాల (Electro Magnetic Radiation) వంటి శక్తి తరంగాలే కాని మరేమీ కాదంటారు. దీనికి వీళ్ళు చెప్పే వాదమేమంటే 'కిర్లియన్ ఫొటోగ్రఫీ'తో లోహాలు ఇంకా ఇతర వస్తువుల వంటివి- 'ఫొటోతీసినా వాటిచుట్టూ ఇలాంటి తేజస్సులా కనిపించే ఆవరణం

ఉంటుందనీ, నిర్జీవమైన వస్తువుకి కూడా ఈ తేజస్సు ఉంటుంది కాబట్టి. ఈ తేజస్సుకు 'అంతరాత్మ' లేక 'జీవాత్మ' అని పేరు పెట్టడానికి వీల్లేదని వీరివాదం. అంతేకాదు అసలీ తేజస్సును విడిగా పదార్థమయ శరీరం నుంచి వేరుచేసిగాని, లేక పదార్థమయ శరీరం ఆధారం లేకుండాగాని ఈ సూక్ష్మశరీరాన్ని చూపించడం సాధ్యంకాదనీ ఈ భౌతిక వాదులైన నాస్తికుల మూఢనమ్మకం, కానివ్వండి. ఈ వాదాన్నికూడా పరిశోధించడంలో తప్పులేదు గదా!

రష్యన్ సైంటిస్టుల పరిశోధనలు కేవలం వాదంమీద ఆధారపడినవికావు. ఇవి యదార్థమైన సైన్సు పరిశోధనలో ప్రత్యక్ష ప్రమాణంగా ఋజువులతో సహా పరిశీలించబడినాయి. ఎందుకంటే సత్యాన్వేషణలో సైన్సులోకూడా, తర్కంమీద ఆధారపడిన వాదంకంటే ప్రత్యక్షమైన రీసెర్చిలో కనబడే సాక్ష్యాలకే విలువ ఎక్కువ. తర్కం సైంటిస్టు యొక్క విశ్వాసాన్ని బలపరచవచ్చు. కానీ, పరిశోధనా ఫలితం అతని సిద్ధాంతాన్ని బలపరుస్తుంది. రష్యన్ సైంటిస్టుల విషయంలో కూడా సరిగ్గా ఇదే జరిగింది.

రష్యాలో 1960లో జంతువులలో కనిపించే వెలుతుర్ని (మిణుగురు పురుగుల కాంతి వంటిది) గురించి కొన్ని పరిశోధనలు చేయబడినాయి. ఇందులో కిర్లియన్ ఫొటోగ్రఫీ తీసే కెమెరాతో రకరకాల చెట్లను, ఆకులను, అనేక విధాలుగా ఫొటోగ్రాఫ్ తీయడం జరిగింది. అందులో సూక్ష్మశరీరం కేవలం తేజస్సు మాత్రమే. కాని పదార్థమైన వస్తువు ఆధారం లేకుండా విడిగా చూపడం సాధ్యం అవుతుందా? అని ప్రశ్నవేయడం జరిగింది. దానికి సమాధానంగా యువకుడైన ఒక సోవియట్ సైంటిస్టు ''కజక్‌స్థాన్''లోని ప్రభుత్వ యూనివర్శిటీలో పనిచేస్తున్న సైంటిస్టు - 'ఇదిగో ఇవి చూడండి' అని ఈ ప్రశ్నకు సమాధానంగా, తన సూట్‌కేసులోంచి కొన్ని ఫొటోగ్రాపుల కట్టల్ని బయటకు తీశాడు. అందులోంచి ఒక ఫొటో తీసిచూపెట్టాడు. అది ఒక ఆకుఫొటోగ్రాపు - 'కిర్లియన్ ఫొటోగ్రాపు' తీసిన ఫొటోలాగే అన్ని వైపులా నిప్పురవ్వలవంటి కాంతిమెరపులతో తళతళలాడే స్పష్టమైన తేజస్సు

అందులదుట్లు కనిపిస్తూ ఉన్నది. ఇందులో ఒక ఆకును 'కిర్లియన్ ఫోటోగ్రాఫ్ తీసారని గుర్తించగలిగారు. ప్రశ్న వేసిన వారు. అతను అలాంటిదే మరో ఫోటోగ్రాఫు. తీసి చూపెట్టారు - దాని మధ్యలో ఒక సరాసరి గీతవంటిది ఏర్పడి ఉంది. దానికి అటూఇటూ ఆకు ఆకారం కాంతివంతంగా మెరుస్తూ, అందులో ఆకులోని ఈనెలు, పొగమంచులాగా ఆకుయొక్క నేత (Texture) కనపడుతోంది.

ఆ రష్యన్ సైంటిస్టు అన్నాడు. - ''ఇది ఇందాకటి ఆకుయొక్క ఫోటోనే - కాని మొదటి ఫోటోగ్రఫీ తీశాక ఆకు సగభాగం కత్తిరించాం. అయినా కాని కత్తిరించి తీసేసిన ఆకుభాగం కూడా పూర్తిగా కిర్లియన్ ఫోటోగ్రాఫులో కనబడుతోంది చూడండి!''

అంటే ఏమిటంటే నిజానికి వారు చూస్తున్నది రెండవ ఫోటోగ్రాఫులోని ఆకుయొక్క ''ప్రేతాత్మ'' (Ghost) లేక 'జీవాత్మ' అన్న మాట. ఇది సరిగ్గా పూర్తి ఆకు 'స్థూల శరీరాన్ని' పోలి వున్నది. అంటే ఈ సూక్ష్మశరీరం, స్థూలశరీరం కవలల్లాగ ఉన్నాయన్నమాట. 'మరైతే ఈ ప్రేతాత్మ దేనితో తయారయి ఉంటుంది?' ఆ ఫోటోను చూస్తున్న సైంటిస్టు అడిగాడు. ఆ యువకుడైన సోవియట్ సైంటిస్టు కత్తిరించి వేసిన ఆకుకి తీసిన 'కిర్లియన్ ఫోటోగ్రాఫ్'ను చూపిస్తూ, ఉత్సాహంగా సమాధానమిచ్చాడు - వారి సంభాషణ ఇలా సాగింది.

''అది ఒక రకమైన 'చైతన్యం' లేక 'శక్తి'గాని, పదార్థంకాదు. దీన్ని ఇంకా పరిశోధన చేస్తున్నాం. ఈ చైతన్యం ఎక్కడనుంచి వస్తున్నదా! అని. ఈ చైతన్యశక్తి ఒక రకమైన విద్యుత్ అయస్కాంత వలయం (Electro Magnetic Field) వంటిదని చెప్పవచ్చు. కాని ఈ సూక్ష్మశరీరంలోని శక్తి మాత్రం విద్యుత్ (కరెంటు) కాదు అయస్కాంత శక్తీకాదు: లేక మనకి ఇప్పటివరకు సైన్సుద్వారా తెలిసిన ఏ రకం శక్తీకాదు. దీనికి సైన్సులో ఒక క్రొత్తపేరు పెట్టాము 'ప్లాస్మా' (Plasma) భౌతికశాస్త్రం (Physics)లో పదార్థం యొక్క నాల్గవదశ ఈ మధ్యనే క్రొత్తగా అణుశాస్త్రజ్ఞుల చేత కనిపెట్టబడింది అంటే పదార్థం అణువులుగా, పరమాణు

వులుగా, ఎలక్ట్రానులుగా కాకుండా 'ప్లాస్మా' రూపంలో కూడా (అణువుల క్రింద కాకుండా ఉంటుందని కనుక్కొన్నారు).

'ఆ ఆకు సగంకంటే ఎక్కువ కత్తిరిస్తే అప్పుడే విధంగా వస్తుంది. 'కిర్లియన్ ఫోటోగ్రాఫు?' 'అప్పుడా ఆకు చచ్చిపోతుంది. దానితో పాటు దాని 'తేజోమయ శరీరం'లేక 'జీవాత్మ' కూడా వెళ్ళిపోతుంది.

''ఒక మనిషి వేలుగాని, కాలుగాని, చేయిగాని ఆపరేషన్‌చేసి తీసివేస్తే ఆ అవయవం తీసివేసిన తర్వాత కూడా ఆ స్థూలశరీరం లోపల వుండే సూక్ష్మశరీరంలోని కాలుగాని, చేయిగాని అలానే వుంటుందా?''

'అవును ఉంటుంది'.

ఇలాంటి అనేక చర్చలు, సమావేశాలు, సెమినారుల ద్వారా రష్యన్ సైంటిస్టులు సూక్ష్మశరీరం మీద చేసిన పరిశోధనల సారాంశంలోని ముఖ్య విషయాలను తెలుపడం మాత్రమే ఇక్కడ సాధ్యపడుతుంది. పరిశోధన వివరాలు కావాలంటే ఈ క్రింద చూపిన రీసెర్చి వ్యాసాలను తెప్పించి చదువుకుంటే పూర్తి వివరాలు చూడవచ్చు. ఈ అధ్యాయం ఉద్దేశ్యం చూచాయగా అనేక రంగాల్లో రష్యన్లు కనిపెట్టిన ఆశ్చర్యకరమైన విషయాలు తెలుపడం మాత్రమే.

ఇది పరిశోధనా గ్రంథం కాదుగదా!

రష్యాలోని అంతరిక్ష పరిశోధనా కేంద్రం 'కజక్‌స్థాన్' (Kazakhsthan)లో ఉన్న ప్రభుత్వ విశ్వవిద్యాలయంలో ముఖ్యమైన జీవశాస్త్రజ్ఞులు, రసాయన శాస్త్రజ్ఞులు, ఫిజిక్సు పరిశోధకులు అంతా ఒక్కచోట కలిసి ఒక బ్రహ్మాండమైన 'ఎలక్ట్రానిక్ మైక్రోస్కోపు' చుట్టూ నిలబడి వున్నారు. ఇది 'కిర్లియన్' దంపతులు కనిపెట్టిన కెమేరా నుంచి ఎంతో పరిణామం పొందిన ఆధునిక యంత్రం. ఈ చుట్టూ చేరిన సైంటిస్టులు ఆ సూక్ష్మదర్శినిలో కన్నులుపెట్టి, అందులో పెద్దవిగా కనపడుచున్న సూక్ష్మశరీరానికి కన్నులు పెట్టి, అందులో పెద్దవిగా కనపడుచున్న సూక్ష్మశరీరానికి సంబంధించిన సినిమా వంటి కదిలే చిత్రాల్ని చూస్తున్నారు. వీళ్ళందరి పరిశోధనలోను ముఖ్యమైన గమ్యం ఒక్కటే! స్థూల శరీరానికి

జంటగావుండే ఈ సూక్ష్మశరీరం దేనితో తయారయింది? ఇది 'ప్లాస్మా'వంటి ప్రాథమిక పదార్థం. ఇంకొక సూక్ష్మశక్తితో కలిసి ఏర్పడిన పొగవంటి తేజస్సు. ఇది ఆకాశంలోని నక్షత్రాల మేఘంలాగ కనబడుతోంది. యీ సూక్ష్మశరీరం కేవలం ఎలక్ట్రానుల వంటి కణాలతో లేక రేణువులతో తయారైన ఒక స్పష్టమైన శక్తిగా ఋజువవుతోంది. అంతేకాదు, ఇది నిరాధారంగా పొగమంచులా ఏర్పడ్డ శక్తికాదు. స్పష్టంగా ఆకారంతో వున్న ఒక జీవంగానూ, పనులు నిర్వహించగల ఒక వ్యక్తిత్వాన్ని కలిగి వున్నది.

'This energy body is not just particles. It is not a Chaotic system, IT IS A WHOLE UNIFIED ORGANISM IN ITSELF. It acts as a Unit'.

కనుక మన భారతదేశంలోని మిడిమిడి జ్ఞానం కల్గిన నాస్తికవాదులు ఊహించినట్లుగా యీ సూక్ష్మశరీరం అనేది ప్రతి నిర్జీవశరీరం చుట్టూ వ్యాపించివుండే కరెంటు తరంగాల వంటి 'తేజస్సు'కాదు. ఇది ఒక స్పష్టమైన జీవం కలిగిన వ్యక్తిత్వం.

యీ విషయాన్ని స్పష్టంగా పరిశోధించిన రష్యన్ సైంటిస్టులు 1968లో వాళ్ళ సిద్ధాంతాలను ప్రచురించటం జరిగింది. వాళ్ళ 'రీసెర్చి' అంటే పరిశోధన అంతా ఒక గ్రంధంగా ప్రచురించబడింది. 'జీవుల ప్లాస్మాశరీరం' అన్న పేరుతో, యీ పరిశోధన వెనక దిగ్గండుల వంటి రష్యన్ సైంటిస్టులు* వి.ఇనైయుషీన్, వి.గ్రిశ్చంకో, ఎస్.ఒరొవేవ్, ఎస్.సోయిస్కీ, ఎన్.ఫెడొరోవో, ఎఫ్.గిబాడులిన్ మొదలైన బ్రహ్మాండమైన అనుభవజ్ఞులూ, మేధావులూ వున్నారు. వాళ్ళ పరిశోధనల సారాంశం ఒక్క ముక్కలో చెప్పవచ్చు. అన్ని ప్రాణం కలిగిన జీవులు - అంటే చెట్లు, జంతువులు, మనుష్యులు - ఒక పదార్థ శరీరం మాత్రమే కాకుండా ఒక చైతన్యంతో తయారైన 'రెండవ శరీరాన్ని' కూడా కలిగివున్నాయి. యీ పదార్థ శరీర అణువులతో పరమాణువులతో తయారైవుంటే, దానికి జతగా వున్న ప్లాస్మా శరీరం ఒకానొక చైతన్య శక్తితో తయారయివుంది.

నిశితంగా ఆలోచిస్తే ఏ మేధావికైనా తడుతుంది - పై రష్యన్ సైంటిస్టుల పరిశోధన అద్భుత ఫలితాలతో కూడుకుని వుందని, ఎందుకంటే 'కజక్స్థాన్' ప్రభుత్వ యూనివర్శిటీ 1968లో ప్రచురించిన రిసెర్చి గ్రంధం. 'అల్మా - ఆతా' (Alma- Ata)లో 'కిర్లియన్' పరిశోధనలపై ప్రముఖమైన నిర్ణయాలూ ఋజువులూ క్రోడీకరించబడి సైన్సు ప్రపంచానికి అందజేయబడ్డాయి. ఈ పరిశోధనంతా చదువుతూ వుంటే సైన్సులో వేరే ఒక క్రొత్త ప్రపంచంలోకి తీసుకువెడుతుంది మనల్ని. ఈ పరిశోధనలోని 'రిసెర్చి' వివరాలతో సామాన్యవ్యక్తిని బాధపెట్టకుండా అందులోని ముఖ్యవిషయాలనే ఇక్కడ గమనిద్దాము.

1 కొన్ని జీవులు, మిణుగురు పురుగుల వంటివి శరీరాన్ని వెలిగేలా చేయగలవు. యీ వెలిగేశక్తి 'కిర్లియన్' ఫోటోగ్రాఫుతో పరిశోధించబడింది. దీనిలో ఏమి తేలిందంటే, యీ మెరిసే సముద్రపు చేపలు, మిణుగురు పురుగులు, రకరకాల పురుగులు వాటి శరీరంలోంచి వచ్చే వెలుగును వాటి లోపలున్న సూక్ష్మశరీరంవల్లనే పుట్టిస్తున్నాయని! ఈ వెలుగు, కరెంటువల్లకాని ఇతర సైన్సుకు తెలిసిన ఏ శక్తి (Energy) వల్లా, లేక రసాయనిక మార్పులవల్లా కాదని రూఢి అయింది.

2. ఈ సూక్ష్మశరీరానికి ఒక స్పష్టమైన ఆకారం వుందని, అది ఆకాశంలో లేక రోదసీలో కొంత పరిమాణాన్ని ఆక్రమిస్తుందని తేలింది. అంటే అర్థం. అది ఒక శరీరం, దానికొక ఆకారం వున్నది. యీ శరీరంలో (సూక్ష్మశరీరంలో) కాంతి నెరసులవంటి రేణువులు నిరంతరం కదలికలో వున్నాయి. ఈ కదలికలు, అణువులతో తయారైన పదార్థంలోని రసాయనిక మార్పులకు సంబంధించినవి కావనీ తేలింది.

---

* Dr V.Inyushin, V. Grishchenko, N. Vorovev, N.Shouiski, N.Fedorovo, F. Gibadulin.

3. ఈ సూక్ష్మశరీరం వేరువేరు అవయవాలలో వివిధమైన అమరికలలో కనిపిస్తూ వుంటుందని అంటే స్థూలశరీరంలో ఎలా గయితే పదార్థం ఎముకలలోను, మాంసంలోను, రక్తంలోను, వేరువేరు రకాలుగా జీవకణాల అమరిక వుంటుందో - అలాగే సూక్ష్మశరీరములో కూడా కాంతి రేణువుల అమరిక శరీరభాగాల్లో వేరువేరుగా వుంటుంది.

4. స్థూలశరీరంలోని ఏ భాగమైనా కత్తిరించివేస్తే లేదా ఖండించివేస్తే - దానివల్ల ఆ భాగంలోని సూక్ష్మశరీరం ఏవిధమైన నష్టం పొందకుండా తన పూర్వపు ఆకారంతోనే వుంటుందని.

5. స్థూలశరీరం చనిపోగానే అంటే ప్రాణం పోయినప్పుడు దానికాధార మైన సూక్ష్మశరీరం కూడా అదృశ్యమైపోతుందని.

6. అంటే దీనిఅర్థం మరణించిన జంతువులలో, చెట్లలో, జీవులలో యీ సూక్ష్మశరీరం కనబడదు. ఇది జీవించిన వాటిలోనే వుంటుందని అర్థం.

చివరికి 'ఇనైయుషిన్', 'గ్రిశ్చంకో' కనిపెట్టిన ప్రాథమిక సూత్రం ఏమిటంటే, స్థూలశరీరం ఆకారానికీ, దాన్ని ఆధారంగా చేసుకొని వుండే యీ సూక్ష్మశరీరానికి, ఒక ప్రత్యేకమైన కొలత లేక నిష్పత్తి (Ratio) కూడా వున్నదని కనుగొన్నారు. 'కజక్' యూనివర్శిటీలో కనుగొన్న ఒక పరిశోధనలో సూక్ష్మశరీరంలోని వెలిగే పదార్థం మనం పీల్చేగాలిలోని ప్రాణశక్తితో ఎక్కువ ఉత్తేజమై శక్తివంతంగా వెలగడం జరుగుతుందని, ఇంకో ఆశ్చర్యం ఏమిటంటే, వీరు భారతందేశంలోని యోగులు కనుగొన్నట్లుగా ప్రాణం పీల్చడం వల్ల శరీరంలోని ప్రాణశక్తి వృద్ధి అయి శరీరం అంతటా వ్యాపించి వున్న ఈ సూక్ష్మశరీరం 'బ్యాటరీ ఛార్జి' చేసినట్లు ఉత్తేజం కాబడి 'చార్జి' అవుతుందని కూడా తెలుసుకొన్నారు. రష్యన్ సైంటిస్టులు చెప్పేదేమిటంటే యీ సూక్ష్మశరీరం మీద జరిగిన పరిశోధనవల్ల ఒక గొప్ప వైద్యశాస్త్ర సత్యం బయటపడిందని- అదేమిటంటే - శ్వాస ఎక్కువ పీల్చినప్పుడు యీ సూక్ష్మశరీరం ఉత్తేజమై తద్వారా శరీరంలోని రోగాలు తగ్గే ఫలితం కనబడుతుందని. అంతేకాక 'నెగిటివ్

కణాలు' కల్గిన కరెంటుశక్తితో వ్రణాల మీద స్ప్రే చేసినప్పుడు ఆ వ్రణం వెనుక సూక్ష్మశరీరం ఉత్తేజం కాబడి త్వరగా మానుతుందని.

అన్నిటికన్నా ఆశ్చర్యకరమైనవి డా॥ ఖిజేవిస్కి (Dr. Chijevsky)★ సూక్ష్మశరీరం మీద జరిపిన పరిశోధనా ఫలితాలు. దీనివల్ల సూర్యుడిలో జరిగే మార్పుకీ మానవశరీరంలో వున్న జీవాత్మకి సూక్ష్మశరీరానికి ఒక విచిత్రమైన సంబంధం వున్నట్లు తేలింది. ఈయన సూర్యుడిలోని మచ్చలు ప్రతి 11 1/ 2 సంవత్సరానికి ఒక్కసారి మారుతూ వుంటాయనీ, యీ కాలంలో జరిగే మార్పులు మనిషి శరీరంలో సూక్ష్మశరీరం ద్వారా పనిచేస్తాయని చాలా ఆశ్చర్యం కలిగించేలా ఋజువు చేశాడు. కాలంలో జరిగే మార్పుకూ సూర్యుడు ద్వారా, 'గ్రహాలద్వారా సూక్ష్మశరీరంమీద పడే అయస్కాంత కిరణాలు ప్రొటాన్ రేణువుల ప్రసారం, సూర్యునిలోని మచ్చలు చాలా ప్రభావాన్ని కలుగజేస్తాయని 'ఖిజేవిస్కీ' పరిశోధనలలో ఋజువైంది.

కొన్ని శతాబ్దాలుగా మనదేశంలో యోగులు, టిబెట్‌లోని సాధువులు తమ స్థూలశరీరం విడిచిపెట్టి బతికివుండగానే యీ సూక్ష్మశరీరంతో ప్రయాణించి పరకాయప్రవేశం చేసి ఇంకొకశరీరంలో ప్రవేశించే విద్యప్రచారంలో వున్నది.

ఆదిశంకరాచార్యుల వంటివారు తమ యోగశక్తిచేత చనిపోయిన ఒక మహారాజు శరీరంలో ప్రవేశించి మళ్ళీ తిరిగి తన జీవాత్మను అందులోంచి ఉపసంహరించినట్లు చరిత్ర చెబుతోంది. ఈ విషయం మీద కూడా కొందరు సైంటిస్టులు పరిశోధనచేసి, విచిత్రమైన అంశాలు ప్రచురించారు. అమెరికాలోని కాలిఫోర్నియాలోని యూనివర్సిటీలో ''చార్లస్ టార్ట్'' (Charles Tart) ''హెరాల్డ్‌షర్క్'' అనే, రిసెర్చి సంస్థలో పనిచేసే పరిశోధకుడూ, ఆధ్యాత్మికవ్యక్తి అయిన రచయిత అనుభవాలు కూడా కొన్ని క్రొత్త విషయాలను బయట పెట్టాయి. అందులో ముఖ్యమైంది ఈ సూక్ష్మశరీరం, కొబ్బరికాయలో కురిడీ

---

* Dr. Chijievsky - 'The gun and us' (Moscow) 1963. Michel Ganquelin - 'The Gosmie Clocks' - (New York)

వలే మన స్థూలశరీరంలోంచి బయటికి పంపించవచ్చు. అది మళ్ళీ మన శరీరంలో ప్రవేశపెట్టుకోవచ్చని. రష్యన్ పరిశోధనలో తేలిన విషయమేమిటంటే దూరదృష్టి, దూరశ్రవణంవంటి అద్భుత శక్తులూ లేక ''ఉల్ఫ్ మెస్సింగ్'' కున్నటువంటి ఇతరుల మనస్సును చదివే అద్భుతశక్తి, వాళ్ళ స్థూలశరీరంతో జరిగే పనికాదు.

''ప్లాస్మా'' శరీరం వల్లనే యివి సాధ్యపడుతున్నాయని 'డో బ్రోవిచ్' వ్రాసిన పరిశోధనా గ్రంథం ''నీ శరీరం నుంచి బయటికి వెళ్ళిపోదలచావా?'' (Do you want to get away from your self?) అన్న దానిలో చూడవచ్చు.

ఒక్క ముక్కలో చెప్పాలంటే - సోవియట్ సైంటిస్టులు 'సూక్ష్మశరీరం' (జీవాత్మ)పై జరిపిన ఈ పరిశోధనవల్ల - మానవచరిత్రలోనే ఒక నూతనశకం ప్రారంభమయింది! ఎందుకంటే యువకులైన 'కిర్లియన్' దంపతులు ''సెమియాన్ డేవిడోవిచ్ కిర్లియన్'', అతని భార్య 'వాలెంటీనా కిర్లియన్' కలసి, అందరికీ మనిషి అంతరాత్మను కొంచమైనా చూడ్డం - యంత్రాల సహాయంతో నైనా - సాధ్యపడేలాగ చేశారు. దీనివల్ల మానవుడి విజ్ఞానం ఎంతో మారిపోతుంది. జరిగినదానికంటే భవిష్యత్తులో జరగబోయే పరిశోధనల అంతరార్థమే మానవ చరిత్రనంతా మార్చివేస్తుంది.

ఎందుకంటే మానవుడికి 'మనిషి'ని గురించి వున్న ప్రస్తుతభావమే పూర్తిగా మారిపోతుంది. అంతేగాదు ఈ మార్పు ఒక్క 'సైన్స్'నే మార్చటంకాక, దాని ఆలోచనా ప్రభావం అటు వైద్యశాస్త్రం. మనస్తత్వం శాస్త్రం. వేదాంతం, కళ ఇలా అనేకరంగాల్లో మానవ స్వరూపాన్నే మార్చివేస్తుంది. మనిషికి రెండు శరీరాలున్నాయని - మానవుడిలో వున్న 'దైవశక్తులు'- లేక ఆధ్యాత్మిక శక్తులనేవి ఈ 'సూక్ష్మశరీరం'తోనే ముడిపడి వున్నాయనీ - మనిషిమీద సూర్యుడూ గ్రహాల ప్రభావం ఈ సూక్ష్మశరీరం ద్వారానే జరుగుతోందనీ - హఠయోగంలోని షట్చక్రాలూ ఈ సూక్ష్మశరీరంలోని ప్రభావాలతో గ్రహాలలోని అయస్కాంత తరంగాలకు ప్రభావం వుందనీ, స్పష్టంగా తేలింది. ఈ పరిశోధనలవల్ల.

''మేడంక్యూరి'' ఆనాడు ఎలాగైతే జడంగా వున్న లోహాలలోంచి వెలిగే 'రేడియం'ను కనిపెట్టిందో - అలాగే 'కిర్లియన్' కూడా మనిషిలోపల వెలిగే రంగురంగుల తేజోమయలోకం ఒకటి వున్నదనీ సూక్ష్మశరీరంద్వారా, ఒక వెలుగుబాటకు ద్వారం తెరిచి చూపించాడు.



6

# ''మంత్రదండం'' - భూమిలోని జల

అది కైలాసపట్నం. విశాఖపట్టణం జిల్లాలోని మన్యప్రాంతంలోని కొండల మధ్య కునికిపాట్లు పడుతున్న ఒక కుగ్రామము. ప్రకృతి ఒడిలో మైమరచి, బయట ప్రపంచముతో సంబంధము లేకుండా గిరిజన ప్రాంతంలో వున్న ఆ పల్లె ఒక ప్రాచీన ఋషి వాటికవలె కన్పిస్తుంది. ఇది 1949 నాటి మాట! ఎత్తయిన కొండలమధ్య మెలికలు మెలికలుగా ప్రవహిస్తున్న కొండవాగు. దాని కానుకుని నిటారుగా పెరిగిన పర్వతశిఖరం. ఈ రెండింటికీ మధ్యగా కొండ నడుంమీద, మొలత్రాడువలే, వంకరటింకరగా పోతున్న 'ఘాట్‌రోడ్' రోడ్డుకు కుడివైపుకు ఎత్తుగా కొండశిఖరాలు. ఎడమవైపున అగాధంలో ప్రవహించే కొండవాగు. రోడ్డు సరాసరి వెళ్ళి కైలాస పట్టణంలోని కోవెలశిఖరం ముందుగా వంపుతిరిగి మాయమవుతోంది. అది మన్య ప్రాంతమంతా పల్లెపు ప్రజల రాజకీయాలతో ''ఫారెస్టు కంట్రాక్టర్ల'' అవినీతితో ఇంకా మానభంగం కాకుండా పవిత్రంగా వున్న రోజులవి.

బొమ్మరిల్లులా వున్న చిన్న బ్రాహ్మణ అగ్రహారం. ఒకటేవీధి. వీధికి రెండువైపులా వైష్ణవాచార్యుల ఎతైన అరుగుల ఇళ్ళు. ఆసందడి చూస్తే ఏదో విచిత్రమే జరుగుతోంది ఆరోజు. ఆలయంచుట్టూ జనం రద్దీగా తిరునాళ్ళ రోజులకి మల్లే గుమిగూడి వున్నారు! జనంమధ్యలో ఖాళీస్థలంలో దేవుని విగ్రహం ధ్వజస్థంభం ముందు తళతళా మెరిసే కంచు గరుడవాహనం పైన నిలబెట్టి వున్నది. గరుడ వాహనంపై శుభ్రమైన తెల్లటినామాలతో రంగురంగుల పూలమాలలు వేసుకొన్న రాజగోపాలస్వామివారు వేంచేసివున్నారు! స్వామికి ఇరువైపులా రెండు కాగడాలు పుచ్చుకొని, నామాలు పెట్టుకొన్న ఆచార్యులు నిలబడివున్నారు. స్వామి ముందు ఆఖండదీపం వెలుగుతోంది. ప్రజల ముఖాల్లో అపూర్వమైన భక్తి, గాఢమైన ప్రేమ, కొట్టవచ్చినట్లున్నాయి. స్వామి చుట్టూవున్న వేదపండితుల కళ్ళలో నీళ్ళు నిలిచివున్నాయి. భక్తితోనో, ఆనందంతోనే తెలియదు. అంతా వేదం చదువుతున్నారు. ఆ రోజు చాలా ముఖ్యమైన సన్నివేశం. స్వామి మహిమ ప్రత్యక్షంగా చూడటానికి వేలాది ప్రజలు, కొండలూ కోనలలోని గిరిజనులుకూడా చంటి పిల్లలను సైతం ఎత్తుకొని పాలిస్తూనే అలా నిలబడి చూస్తున్నారు.

చాలాకాలంగా వర్షాలు పడలేదు. ఆ గ్రామంలో కోనేట్లో నీరు పసరెక్కి పోయింది. ఆలయం దగ్గర మంచినీళ్ళు పడేబావి తవ్వాలని ఆ గ్రామం అంతా ఎదురుచూస్తోంది. కాని ఎక్కడ తవ్వితే నీళ్ళుపడతాయో ఎవరు చెప్పగలరు? ఆ రోజుల్లో గవర్నమెంటు అప్పులూ, పంచాయితీ సొమ్మూ ఇప్పటిలాగ? మంచినీళ్ళలా దొరికేవికావు. అందుకని ఒకేచోట త్రవ్వగలరుబావి. అందులో నీళ్ళుపడితే సరేసరి ప్రజలపుణ్యం పండినట్టే! బావిలో కనక బండపడితే ఆ బండ ప్రజల్లో పడ్డట్టే! నీటికోసం గ్రామస్థులు ఎదురుచూసే ఆత్రుత సుఖంగా కొళాయిలతో బస్తీలలో బ్రతికే మనకర్థంకాదు, అందు ఆ ఆతృత, ఆమారుమూల గ్రామంలో కూడా అంత ఆరాటం! ఆ అమాయకుల కళ్ళలో ఆ ప్రార్థన! అందరూ స్వామి అనుగ్రహానికై ఎదురుచూస్తున్నారు. నీళ్ళంటే ఆ

అడవిలో దేవుడి అనుగ్రహమే! జల భూమిలో ఎక్కడ వున్నదో వెతికి పట్టుకోడానికి దైవసహాయాన్ని కోరి ఒక ప్రాచీన వేదశాస్త్ర ప్రక్రియ (జలార్గళ శాస్త్రం)ను ఆనాడు ఆలయ ప్రధానాచార్యులు చేయబోతున్నారు. ఏనాడో వేదాలలో నుంచీ యజ్ఞాలతో సహా తరతరాలుగా మనకి అందించబడిన ప్రాచీన విద్యలలో ఈ జలార్గళశాస్త్రం ఒకటి. ఆ శాస్త్రంలో చెప్పబడిన ప్రకారంగా బావిత్రవ్వే ముందు స్థలనిర్దేశానికి ఆలయ ప్రధానాచార్యులు ప్రారంభించారు.

ముందుగా నీటి ప్రబ్బలిచెట్టు కాని, లేక గన్నేరు చెట్టుకాని వెతికి మేళతాళాలతో ఆ చెట్టుకు ప్రదక్షిణంచేసి దానిముందు కొబ్బరికాయకొట్టి కర్పూరం వెలిగించారు. హారతి ఇచ్చి ఆ చెట్టుకు మొదట్లో పూలతో పూజించి ఒక లావుపాటి కర్రను జాగ్రత్తగా కోసి ఆకులూ కొమ్మలు నరికివేసి చక్కటి దండంగా తయారుచేశారు. దానికి పసుపూ, కుంకుమ, అలంకరించి అక్షతలతో పూజించి ఆలయ ప్రధానార్చకులు సమాంతరంగా తెచ్చి గుడిముందు గరుడవాహనంపై వేంచేసివున్న స్వామివారి ముందుంచారు.

పూజారి అంతా పూర్తి అయిన తర్వాత ఆ దండాన్ని భక్తి వినయాలతో చేత ధరించారు. రెండుచేతులతో రెండు కొమ్మలు అందిపుచ్చుకొని మధ్యనున్న ఆ దండాన్ని తన రొమ్మువైపుకు వచ్చేలా పుచ్చుకొని ఆలయ ప్రధానార్చకులు మంత్రాలు చదువుతూ ఆలయం చుట్టూరా ఉన్న ఖాళీస్థలంలో ప్రదక్షిణము చేయసాగారు. ముందు వేదమంత్రాలు చదువుతూ బ్రాహ్మణులు నడుస్తున్నారు. వెనుక కోలాహలంగా జనసమూహం అంతా వెనకాలే నడుస్తున్నారు. అందరికళ్ళూ ఆలయ ప్రధానాచార్యుల చేతిలో వున్న ఆ మంత్రదండంపైనేనిలబడి సూదంటురాయి లాగ చూపు త్రిప్పకుండా చూస్తున్నారు ఆశతో. వెనకాల మేళతాళాలతో భక్తులందరూ వెంటరాగా ఆలయం చుట్టూరావున్న ఖాళీజాగా అంతా వూరేగింపుగా తిరిగేరు. ఎక్కడా ఆ దండంలో చలనం కనిపించలేదు. ఉన్నట్టుండి ఆచార్యులుగారు ఒకసారి ఆగిపోయారు. వారి చేతిలోని కర్ర అకస్మాత్తుగా గడియారంలోని ముల్లులా

పైకిలేచి కదిలింది. అనుమానంగా ఆచార్యులు నాలుగడుగులు వెనక్కివేసి మళ్ళీ అదే ప్రదేశంపై నుంచి నడచి చూశారు. సందేహం లేదు. సరిగ్గా అదేస్థలంలో ఆ గన్నేరుకర్రతో చేసిన ఆ మంత్రదండం చటుక్కున వొణికి, గడియారం ముల్లులా ఇటూఅటూ చలించింది.

పెద్దపెట్టున చుట్టూవున్న భక్తులంతా ఆనందోత్సాహాలతో 'గోవిందా వెంకటరమణా!' అంటూ గంతులు వేయసాగారు భక్తితో. అర్చకులు ఆ స్థానంలో గడ్డపార దిగవేసి ఆ ప్రదేశంచుట్టూ ప్రదక్షిణం చేసి కొబ్బరికాయలు కొట్టారు.

ఇదంతా చూస్తూవున్న నాకిదేమీ అర్థంకాలేదు. మారుమూల మన్యపు అగ్రహారమైన కైలాస పట్టణంలో రాజగోపాలస్వామి ఆలయందగ్గర జరిగిన వింతకు అర్థం బోధపడలేదు. అక్కడ పండితులలో వున్న పెద్దలను ప్రశ్నించాను. వారు నా అజ్ఞానానికి తెల్లపోతూ, 'బస్తీనుంచి వచ్చినవాడివి నీకేమి అర్థమవుతుంది. మన సాంప్రదాయాలన్నీ ఇంగ్లీషు చదువులో ఇలాగే కొట్టుకు పోతున్నాయి'- అంటూ ఒక చిన్న ఉపన్యాసం యిచ్చి అసలు విషయం బయటపెట్టాడు. ఆశ్చర్యం వేసింది. అది భూగర్భజలాన్ని కనిపెట్టే ప్రాచీనవిధానం. అనాదిగా ఋషి సాంప్రదాయంతో నడుస్తున్న శాస్త్రప్రకియ.

''దానివల్ల ఎక్కడ నీళ్ళు పడతాయో ఎలా తెలుస్తుంది?'' అమాయకంగా అడిగాను.

'అదేమిటి చూడలేదూ! ఆచార్యుల చేతిలోని ఆ మంత్రదండం, దానివల్ల గుర్తిస్తారు భూమిలో జల ఎక్కడపడుతుందో', 'ఎలా గుర్తిస్తారు?' 'ఆయన నడుస్తూండగా ఏ ప్రదేశానికి వచ్చినపుడు చేతిలోని దండం చటుక్కున పైకి ఎగురుతుందో అదే స్వామి నిర్ణయించిన నీటిజల. ఇది ఎప్పటికీ తప్పిపోదు. తరతరాలుగా వస్తున్న సత్యం. భక్తిగా కళ్ళు మూసుకొని మనస్సులోనే నామం చేసుకుంటూ ముందుకు సాగిపోయారు ఆ పండితులవారు.

ఏమిటి? మంత్రదండం ఏమిటి? భూమిలోని జలాన్ని పైన నడిస్తే ఎలా తెలుపుతుంది? అది కేవలం ఒక మామూలు చెట్టుకర్ర కదా! చెట్టుకేమీ జ్ఞానం వుండదే? దీనికి సైన్సు ప్రకారం కారణాలేమిటి? ఇది సూచించినచోట నిజంగానే నీళ్ళు పడతాయా? ఈ విషయం వీళ్ళకెలా తెలిసింది. దాన్ని ప్రాచీనులు ఎలా కనుక్కున్నారు? పరిశోధనద్వారా లేక కేవలం దివ్యదృష్టితోనే కనుక్కున్నారా? ఇది ఒక శాస్త్రమా! లేక 'కనికట్టు' వంటి విద్యా! ఇలాంటి అనేక ప్రశ్నలు నా మనస్సులో ఉత్పన్నమయ్యాయి. 30ఏళ్ళనాడు కైలాస పట్టణంలో జరిగిన ఆ విచిత్ర ప్రక్రియను చూసిన నాకు - నా ప్రశ్నలకు - ఆనాటి మంచి ఈనాటికీ సమాధానాలు దొరకలేదు.

''మూఢాచారం! అది కేవలం మూఢవిశ్వాసం. ఇలాంటి మంత్రాలకు చింతకాయలు రాలవు. ఇలాంటి అర్థంలేని పూర్వాచారాల వల్లే మన దేశం రోజురోజుకు వంట్టికొట్టుకుపోతోంది. అవేం నవ్మకు. సైన్సుప్రకారం 'జియాలజిస్టు' పరిశోధిస్తే తప్ప భూమిలో ఎక్కడ నీళ్ళు పడతాయో ఎవరూ చెప్పలేరు''- ఇది నా క్లాస్‌మేట్ కామ్రెడ్ సోమేశ్వరరావు నుంచి లభించిన సమాధానం.

ఆనాటి నుంచి గత 30 సంవత్సరాలుగా అనేకసార్లు అడవి ప్రాంతాల్లో గ్రామాల్లో అనేక మంది ఈ చెట్టుకొమ్మతో భూగర్భంలోని నీళ్ళు కనిపెట్టడం కళ్లారాచూశాను. అలా అనుమానించినచోట జలఊరి సమృద్ధిగా పనిచేయడం కూడా గమనించాను. నాకాశ్చర్యం వేసింది. అనేక చోట్ల ఈవిధానం పెద్ద పూజా పునస్కారంలేకుండా క్లుప్తంగా చేశారు. కాని ఆనాడు కైలాస పట్టణంలో నేనుచూచిన దృశ్యం నా మనస్సుకు హత్తుకుపోయింది. నా మిత్రుడు కామ్రేడ్ సోమేశ్వరరావు చెప్పిన సమాధానం గ్రామస్తులకు, రైతులకు చెప్పాను. వయస్సులో పెద్దలు అనుభవంవున్న గ్రామస్థులకు చదువు లేకపోయినా సంస్కారం అనుభవంవున్న గ్రామపెద్దలతో ఎన్నిసార్లో నా మిత్రుని అభిప్రాయం వెలిబుచ్చాను. 'వాడి మొఖం వాడికేం తెలుసు. వాడీమధ్య కమ్యూనిస్టులలో

చేరాడు. అందుకని వాళ్ళు చెప్పినవన్నీ చిలక పలుకులుగా మనముందు అప్ప చెపుతాడు. వాడి బతుకెంత వాడి అనుభవమెంత - వేళాకోళంగా నవ్వారు. ఆ వేళాకోళానికి కొంచెం చిరాకు వేసింది. నా మిత్రుడు ఎం.ఎస్‌సి చదువు కున్నాడని, గొప్పతార్కికుడని, రేషనలిస్టు (Rationalist) కూడా నని, నచ్చచెప్పా లని చూశాను.

''ఏమిటి బాబూ! అన్నీ తెలిసిన మీరే ఆలా మాట్లాడతారు. నాకు 90 ఏళ్ళు వస్తున్నాయి. ఈ చుట్టుప్రక్కల జిల్లాలలో ఎక్కడ బావులు త్రవ్వాలన్నా ఇదే పద్ధతి అమలులో వుంది. ఎప్పుడూ ఈ మంత్రదండం చూపినచోట నీళ్ళు పడకపోవటం అన్నది ఎరగం! ఆ విధానం క్రమంగా చేయకపోతే లేక చేసేవానిలో శ్రద్ధ, ఏకాగ్రత లోపిస్తే చెప్పలేంకాని, నీళ్ళు మాత్రం పడటం ఖాయం''.

''ప్రజలకు కావలసిందేమిటి బాబూ! పెద్దపెద్ద చదువులు, పొగరుమోతు మాటలు, ఎందుకుబాబూ! ఇంగ్లీషు పదాలు దొర్లించటం తప్ప. రైతులు వీళ్ళమాట వింటే అడుక్కుతినాల్సిందే! ఏదో ఆనాడుపెద్దలు చూపెట్టినవిద్య వుంది కాబట్టి సరిపోయింది. లేకపోతే ఈ మన్యం ప్రజలు నీళ్ళులేక మలమల మాడి చావాల్సిందే. ఆ కామ్రేడ్ మాటలు వింటూ కూచుంటే!''

తర్వాత వారి అనుభవాన్ని అనేక విధాలుగా వివరించారు. అనుభవానికి మించిన టీచరులేరు జీవితంలో! అందుకే వాళ్ళా పద్ధతిని విడిచి పెట్టలేదు. ఎందరు ఎన్ని చెప్పినా! 'మరి దాని వెనకాల ఉన్న 'సైన్సు'గానీ కారణంగానీ మీ గ్రామములోని ఆచార్యులు చెప్పగలరా' అన్నాను. కామ్రేడ్ సోమేశ్వరరావు మాటలు అనుకరిస్తూ, దానికతడు చెప్పిన సమాధానం చెంపచెళ్ళుమన్నట్లుంది. మొరటురైతైన అతని తర్కం నిశితమయింది. ''ఏమిటిబాబూ కారణాలు చెప్పేది? ఈనాడు రేడియోలు పెట్టుకొని వింటున్నారెందరో. ప్రతిగ్రామంలోకి

---

* Victor 'Popovkin - Wizard Rod, Mith or problem?' (Moscow) 1967
- Znamic - Sila (No.11)

వచ్చేశాయి రేడియోలు చదువుకోని ఆడవాళ్ళు. లాగులేని పిల్లలుకూడ రేడియో తిప్పగలుగుతున్నారు. వీళ్ళందరికి రేడియో పనిచేస్తోంది గదా, మరి వీళ్ళందరికి అది ఎలా పనిచేస్తుందో తెలుసా? తెలీదు. దాదాపు ఎవరికీ తెలీదు, ఏ కొద్దిమందికో తప్ప. అలా తెలియకపోయినా ఆ రేడియో పనిచేస్తూనే ఉంది. అలాగే సినిమా, అలాగే టెలిఫోను, ఎన్నో సైన్సు పరికరాలు వాడుతున్నాం. అవన్నీ ఎలా పనిచేస్తున్నాయో అందరికీ తెలుసా? పూర్వుల విద్యను ఎగతాళిచేయడం తెలికే. ఇది ప్రతివాడూ చేసేపనే, ఈ రోజు చదువుకొని ఉద్యోగం చేసే పనిలేని రాయళ్ళందరికీ ఇది ఒక ఉద్యమం. ప్రజలకి కావలసింది ఫలితాలు. అవి పని చేస్తున్నాయి, ఫలితాలు ఇస్తున్నాయి. అంతే వాళ్ళకి కావలసింది'.

''మరి దాని మూలసూత్రం తెలియవద్దా''.

యీసారి అతని జవాబు యింకాస్త మొరటుగా వుంది- ''ఏమిటి బాబూ! కామ్రేడ్ సోమేశ్వరరావు ఎలా పుట్టాడో వాడికి తెలుసా! ఏంటిబాబూ తెలిసేది? సైన్సువాళ్ళకి మాత్రం అన్నీ తెలుసా! వాళ్ళే ఒప్పుకుంటున్నారే అన్నీ తెలీదని. భూగర్భ సైంటిస్టును పిలిస్తేకూడా మా ప్రక్క గ్రామ పంచాయితీలు బోలెడంత డబ్బును లింగార్పణం చేశాయి. వాళ్ళు చెప్పినచోట బావులు తీసి.''

''నీళ్ళు పడ్డాయా?''

'బండలు పడ్డాయి బాబూ!'

గబగబా అక్కడ నుంచి వచ్చేశాను. అనుభవంతో తర్కం వాదించలేక పోయింది! ప్రాచీన శాస్త్రాలముందు హేతువాదం పడిపోయింది. ఆనాడు నేను నిరుత్సాహంగా మనస్సులోనే విలపించాను. మూఢాచారాలు ఇంత వేళ్ళు పాతుకుపోయి వున్నాయే అవి - మరి ఈ మంత్రదండం మాటేమిటి? అది సత్యమా? దీనివల్ల భూమిలోని ''జల'' ఎక్కడ ఉందో కనిపెట్టడం ఎలా సాధ్యపడుతోంది? దీని వెనుక ఏదైనా సైన్సుకు తెలియని రహస్యసూత్రం ఇమిడి ఉన్నదా? నాకు సమాధానము దొరకలేదు. ఈ యోగదండం ఏమిటి?

'మూఢాచారం, గుడ్డి విశ్వాసం' ★ అన్న కామ్రేడ్ సోమేశ్వరరావు మాటలే వినిపించాయి మళ్ళీ మళ్ళీ నా చెవుల్లో ప్రతిధ్వనిస్తూ.

'నిజం! ఈ మంత్రదండం మనం ఊహించగల పనిముట్లు అన్నింటిలోకి అతి తేలికైన యంత్రం! ఇది తప్పక పనిచేస్తుంది'- అంటూ స్టాలిన్ రోజులలోనే ఈ మంత్రదండంపైన పరిశోధనచేసి భూగర్భజలాన్ని కనుక్కోవడంలోని 'సైన్సు' అంశాలపై పరిశోధన చేసిన 'డా॥ తారారామ్' అనే రష్యన్ సైంటిస్టు అన్న మాటలివి. ఈయన ఒక్కడే కాదు. మాస్కో యూనివర్సిటీలోని భూగర్భశాస్త్రం ఛైర్మన్ అయిన డా॥ ఎ.ఎ. ఓజిల్వీ (Ogilvy) సరిగ్గా ఇదే మాటలను వ్యక్తం చేశాడు- ''మంత్రదండం - మూఢాచారమా! విజ్ఞానమా?'' అన్న తన పుస్తకంలో మాస్కో యూనివర్సిటీలోని భూగర్భ పరిశోధనల్లో తేలిన విషయాలలో రష్యన్ సైన్సు చరిత్రలోనే ఒక క్రొత్త అధ్యాయం ఆరంభమైంది. ''భూగర్భజలాన్ని కనిపెట్టే ప్రాచీనవిద్య వెనకాల వున్న సైన్సు సూత్రాలను కనుగొన్నాము. ఇది ఒక శాస్త్రం''-అని. దీన్ని ఇంగ్లీషులో 'డౌజింగ్' (Dowsing) అంటారు. దీనిమూల సూత్రాలను రష్యన్ సైంటిస్టులు ఈ విధంగా వెలిబుచ్చారు.

'దీనిలో ఆశ్చర్యపడవలసిన వింత ఏమీలేదు. మనిషి శరీరంలోనే, భూమికి అడుగునవున్న లోహపుగనులుగాని లేక నీటిజలగాని కనిపెట్టే తరంగాలు వున్నాయి. అని రష్యన్ పరిశోధన అంతా మనిషి శరీరంలో వున్నసున్నితమైన కరెంటు, అయస్కాంతశక్తి వంటి ఆకర్షణశక్తి తరంగాలను ఒక సున్నితమైన యంత్రం ద్వారా ఉపయోగించడానికి వీలుగా, ఒక యంత్రాన్ని తయారు చేయడంలో నిమగ్నమయి వున్నాయి. పాతిక సంవత్సరముల పరిశోధన ఫలితమే రష్యన్ సైంటిస్టులు కనుగొన్న ఈ నిర్ణయం.

ప్రాచీన దేశాల చరిత్రచూస్తే గత 7000 సంవత్సరాలకుపైగా భూగర్భ జలాన్ని పరిశోధించడానికి మానవ శరీరంలోని జీవాత్మ పంపించే రహస్య

---

* Victor Popovkin - Wizard Rod, Mith or problem?' (1967)

---

తరంగాలు లేక స్పందనలు ఆధారంగా మంత్రదండం అనే పనిముట్టు సహాయంతో కనిపెట్టడం ప్రచారంలో వున్నట్టు చారిత్రక పరిశోధకులు తెలుపుతున్నారు. ప్రాచీనచైనా పరిపాలించిన ''యు'' చక్రవర్తి క్రీస్తు పూర్వం 200B.C కాలం నుంచి శిల్పాలలో తన చేతిలో మంత్రదండం సహాయంతో భూగర్భజలం పరిశోధిస్తున్నట్లు చిత్రించబడినవి తెలుపుతున్నాయి. వియత్నాంలో యుద్ధం చేసిన మూడవ అమెరికన్ నావికాదళం ఈ మంత్రదండం సహాయంతో జలాన్ని పరిశోధించడమేకాక - భూమిలో పాతివున్న బాంబులు, రహస్యద్వారాలు, సొరంగాలు, లేక లోతుగా తవ్వి పెట్టబడిన కరెంటు తీగలు మొదలైన యుద్ధరహస్యాలు తెలుసుకోవడానికి ఉపయోగించినట్టు సైన్సు రికార్డులవల్ల తెలుస్తున్నాయి. రష్యాలో 'అల్మాఆటా' శాఖకు చెందిన భూగర్భపరిశోధనా బృందం ఈ మంత్రదండం సహాయంతో భూమిలో వున్న ''డైనమైట్'' పేలుడును ఇతర మందుగుండు సామగ్రిని నిక్షిప్తమైనచోట పరిశోధించడానికి ఈ మంత్రదండం ఉపయోగించి కనుగొన్నారు - అవి డాక్టర్ 'వేలరీ మల్వే' (Veliry Malvery)★ ప్రకటించారు.

రష్యన్ సైంటిస్టు 'సొఖైవానోవ్' చేసిన పరిశోధనవల్ల పాతకాలపు మంత్ర దండం మరింత బాగుచేయబడింది. చెట్టుకర్రల స్థానే కాలంలో ఉక్కుతీగలతో చేసిన కొత్తరకం 'దండం' తయారు చేయబడింది. దీని సహాయంతో భూగర్భంలో వున్న జలంమాత్రమే కాకుండా అనేక వస్తువులు నేలలో పాతివున్నా కనిపెట్టవచ్చు. అంతేకాక అడుగున జలవున్నచోట ఈ చువ్వగుండ్రంగా తిరుగుతుంది. ఎన్నిసార్లు తిరుగుతుందో దాన్నిబట్టి ఎంత లోతుందో, అది శాశ్వతమైన జలఅవునోకాదో కూడా కనిపెట్టవచ్చు. ఎందుకంటే ఒక్కోసారి నగరాలు, మునిసిపాలిటీలు వృద్ధి అయిన మంత్రదండము సహాయంతో కొన్ని చిక్కులు ఏర్పడినాయి. నేలలోవున్న మురుగుకాలువ గొట్టాల్లో నీళ్ళు, లేక పంపుగొట్టాలలోని జలప్రవాహం నేల అడుగున వున్న కరెంటుతీగలు కూడా ఈ మంత్రదండాన్ని కదలికతో సూచిస్తాయి. అందువల్ల అడుగున వున్న జల

నిజంగా పెద్ద ప్రవాహమైందీ నిష్పక్షపాతంగా తెలుసుకోవడానికి అవసరపడింది. ''సాఖైవానోవ్ పరిశోధన ఫలితంగా తయారైన ఈ కొత్తరకం మంత్రదండం విరివిగా సోవియట్ రష్యాలో అన్నిచోట్లా - సైన్యంలోను జలవిద్యుచ్ఛక్తి ఇంజనీర్లు భూగర్భఖనిజాల పరిశోధనకు, పెట్రోలియం గనుల గుర్తింపుకు, వజ్రాలు, గ్రాఫైట్ వంటి విలువైన భూగర్భ నిక్షిప్త వస్తువులు గుర్తించడానికి - ఉపయోగిస్తున్నారు.

ఈ ఉక్కుతో చేసిన మంత్రదండాన్ని, ఇంకా సున్నితంగా చేసేది ఎలాగా - అని పరిశోధనలు చేయబడ్డాయి. ఈ ఉక్కు చువ్వలకు చివర ట్రాన్సిస్టర్ రేడియోలపై నుండే (Antenna) 'ఏంటెన్నా' తగిలించటంవల్ల పదిరెట్లు బలంగా పనిచేస్తూ అతిసున్నితమైన తరంగాలను కూడా గుర్తించే శక్తివంతమైన యంత్రంగా పనిచేసింది. ఈ మంత్రదండం ఉపయోగించే వ్యక్తి ఎంత త్వరగా నడచినా అది భూమిలోగల వస్తువులు గుర్తించడంలో సామర్థ్యం, శక్తి ఏ మాత్రం తగ్గదు - అంటాడు 'సాఖైవానోవ్'.

సూదంటురాళ్ళు లేక 'అయస్కాంతం' జోడించితే యీ మంత్రదండం యింకా ఎక్కువ బాగా పనిచేస్తుందా, అని అనేక రకాల పరిశోధనలు చేశారు. ఈ దండాన్ని ఉపయోగించే వ్యక్తికి దగ్గరలో ఏదైనా అయస్కాంతం ఉన్నట్లయితే ఆ చువ్వ తిరిగే చుట్లు తగ్గినాయి. అంతేకాక ఈ చువ్వ భూమిలోని అయస్కాంతం వైపు తిరగటం కూడా కనిపించింది. హాలెండు పరిశోధకుడైన డా॥ ఎస్. ట్రాంప్ (Tramp) అయస్కాంత శక్తివల్ల మంత్రదండాన్ని ఉపయోగించే వ్యక్తి శరీరంలో కూడా కొన్ని మార్పులు కల్గుతాయని తేల్చాడు. ఈ అయస్కాంతశక్తిని కొలిచే ''మేగ్నటో మీటరు''లో 0.001 గ్రాస్ ప్రమాణంలో వున్న అయస్కాంత తరంగాలను కూడా ఈ మంత్రదండంతో గుర్తించవచ్చు. 'లెనిన్‌గ్రాడ్‌లో' 'హిప్నటిజం'పై పరిశోధన చేస్తున్న డా॥ ఎ. జకారోవ్ (Dr. A.Zakarov) ఈ మంత్రదాండాన్ని ఉపయోగించే వ్యక్తులకు గాఢమైన యోగనిద్ర ''హిప్నటిజం''తో కల్పించి ఆ తరువాత మంత్రదండం వారు

ఉపయోగించినపుడు ఫలితాలు పరిశోధించాడు దానివల్ల మంత్రదండం ప్రభావం అది తిరిగిన చుట్లు మామూలుకంటె తగ్గినాయి పెరగలేదు.

అన్నిటికన్న విచిత్రమైన - పరిశోధన ఈ భూగర్భజలాన్ని గుర్తించే అద్భుతశక్తి శరీరంలో గలవ్యక్తులు. ఈ శక్తులను ఇతరులకు ప్రసాదించుటకు సాధ్యపడుతుందా? బాగా అనుభవజ్ఞుడైన 'డౌజరు' తనుపయోగించే మంత్రదండాలు ఆ శక్తిలేని రెండో వ్యక్తికి ఇచ్చి ఆ వ్యక్తి చేయిని తాకితే చాలు. ఆ తరువాత ఈ మంత్రదండం ఉపయోగించే అయస్కాంతశక్తి రెండో వ్యక్తికి సంక్రమిస్తుంది.

కాబట్టి యోగులలో వారి చేతి స్పర్శ ద్వారా యోగశక్తిని, అధ్యాత్మిక శక్తులను ఇతరులకు ధారపోసే 'హస్తదీక్ష'లో లాగే ఈ శక్తి కూడా ఒక మనిషి నుంచి ఇంకొక మనిషికి సంక్రమించ వచ్చునని తేలింది. 'విక్టర్ పాపోవ్‌కిన్' చేసిన పరిశోధనలో మంత్రదండం ఉపయోగించే వ్యక్తి భూగర్భజలం పైగా నడుస్తున్నప్పుడు అతని నాడివేగం, రక్తపుపోటు పెరగటం, గుండె కొట్టుకొనే వేగం హెచ్చుటం యంత్రాల సహాయంతో రికార్డు చేయబడింది. డా॥ ఒజిల్వీ (Dr॥ Ogilvy) చేసిన పరిశోధనల వల్ల తేలిన ఇంకొక ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే 'ప్రాణంవున్న ప్రతిజీవి (చెట్లు, జంతువులూ, మనుషులు) భూగర్భజలం సమీపంలోగాని లోహాలు, ఖనిజాలూ నిక్షిప్తమైవున్న చోటగాని వుండే ఒకానొక విచిత్రంగా అధ్యాత్మిక తరంగాలకుస్పందించడం, వాటిపట్ల విచిత్రంగా ప్రవర్తించటం జరుగుతుందని తన 'రిసెర్చి' ఫలితంగా కనిపెట్టాడు.

స్పందించడం అంటే ఏమి చేస్తాయి? ఏ రకమైన ప్రవర్తన గమనించారు రష్యన్ పరిశోధకులు ఈ జంతువుల విషయంలో? స్విట్జర్‌లాండులో పిల్లల ఆస్పత్రికి డైరక్టరు 'డా॥ ఇ.జెన్నీ' చేసిన పరిశోధనలో కొన్ని ఎలుకలని పొడుగాటి గదిలాంటిచోట పెట్టాడు. దాని లోపల సగం భూమి మామూలునేల - తక్కిన సగం అడుగున భూగర్భజలం వున్న ప్రదేశం వుండేలా అమర్చాడు. 1934-1940 వరకు జరిపిన ఈ పరిశోధనలో ఆ ఎలుకలు భూగర్భజలం

లేక గనులువున్న స్థలంలో నిద్రపోలేదు. ఉలిక్కిపడుతూ బెదురుగా ఏదో ఆందోళనతో వుండేవి. మామూలు జాగామీద మాత్రం అవి నిశ్చితంగా నిద్రపోయేవి. అలా పెట్టిన ఎలుకలలో 6434 ఎలుకలు భూగర్భజలం లేనిచోట నిశ్చితగా నిద్రించాయి. 1926 ఎలుకలు మాత్రమే భూగర్భజలం వున్న జాగాలో నిద్రించగలిగాయి ఎన్నిసార్లు ప్రయత్నించినా!

రష్యాలోని భూగర్భజలం కనిపెట్టగల వ్యక్తులలో కనిపించే విచిత్రమైన 'జలార్గళశక్తి'యే (నీరును పసిగట్టేశక్తి) 'పెన్‌రోజ్' అనేబాలిక ఆస్ట్రేలియాలో కూడ ప్రదర్శించింది. ''ఎవేలిన్ పెన్‌రోజ్''తో పాటు బ్రిటిష్, కెనడా. కొలంబియా, ప్రభుత్వాల మంత్రులు స్వయంగా హెలికాప్టర్‌లో ఎగిరి ఆమె తన అద్భుతశక్తితో, ఈ మంత్రగండం సహాయంతో పెట్రోలు గనులకు అసంఖ్యాకంగా గుర్తించడం చూసి విస్తుపోయారు.

చివరికి మాస్కోలో 31- అక్టోబరు 1966లో జరిగిన అంతరాష్ట్ర పరిశోధకుల 'సెమినార్'లో అనేక రిసెర్చి రిపోర్టులు భూగర్భజలమీద, మంత్రదండం మీద సమర్పించబడ్డాయి. ప్రఖ్యాత సైంటిస్టుల ముందు చదవటమే కాకుండా ఆ పరిశోధన చేసిన ఫిల్మును కూడ వారికి సినీప్రదర్శనగా చూపెట్టబడింది. దీనిలో పాల్గొన్న రాష్ట్రాల్లో 'ఉత్తరసైబీరియా', 'లిధువేనియా', 'యాకూత్ రిపబ్లిక్' వంటివి ముఖ్యమైనవి.

ఈ పరిశోధనలో తేలిన ఒక విచిత్రమైన విషయం గమనించ తగ్గది ఇంగ్లడు, అమెరికా, ఫ్రాన్సు, కెనడా వంటి యూరప్ దేశాల సైంటిస్టులలో ఇటువంటి ఆధ్యాత్మిక విషయాల గురించి పరిశోధించాలన్నా, ఆ పరిశోధనలో ఋజువైన సత్యాలను అంగీకరించాల్సి వచ్చినా వారు చూపే అయిష్టత వారు పడే మానసిక బాధ-ఇతర పరిశోధకులైన 'రష్యన్', 'బల్గేరియన్', 'పోలిష్' సైంటిస్టులలో కనపడలేదు. యూరప్ సైంటిస్టులలోని అర్థంలేని ఈ పట్టుదలే సోవియట్ దేశాలలో జరిగినంత ఆధ్యాత్మిక పరిశోధన యూరప్‌లో జరగక పోవడానికి కారణం, అనేకమంది అమెరికన్ శాస్త్రజ్ఞుల అంచనా - అనాదిగా

వస్తున్న ఈ ప్రాచీన శాస్త్రాలపట్ల ఆధ్యాత్మిక విషయాలపట్ల కొందరు సైంటిస్టులకున్న అర్థంలేని విద్వేషమే, రష్యాలోకంటే యూరప్‌లోని ఆధ్యాత్మిక పరిశోధన బాగా వెనకబడి వుండటానికి కారణం అని సైన్సువర్గాలలో భావించ బడుతున్నది.

ప్రమాదకరమైన స్టాలిన్ పరిపాలనలోనే తన పరిశోధనలను బహిరంగంగా జనవరి 1944లో ''జర్నల్ ఆఫ్ ఎలక్ట్రిసిటీ'' అన్న పత్రికలో ప్రచురించిన రష్యన్ సైంటిస్టులు డా॥ బొ.బొ. మొలోప్ అతని సహరుడు, నీటిపైన ఇంజనీరింగు పరిశోధనచేసిన డా॥ థావిప్ (Dr॥ Tareev), డా॥ సిమినోవ్ (Dr॥ Simonov) ఈ సైంటిస్టుల పరిశోధనల ఫలితం ఒక్కమాటలో చెప్పారు- 'జలార్గళశాస్త్రం' (లేక Dowsing) మంత్రదండం నిర్దిష్టమైన సైన్సు. అది మూఢాచారంకాదు. టెస్టుల తర్వాత టెస్టులు అంతులేకుండా చేసి 25 సంవత్సరాల తర్వాత వీరు ఈ నిర్ణయానికి వచ్చారు.

కామ్రేడ్ సోమేశ్వరరావు మాటలు ఈనాడు నాచెవిలో ప్రతిధ్వనిస్తున్నాయి. 'మూఢాచారాలు - గుడ్డివిశ్వాసం'- సోవియట్ పరిశోధన అంతా చూసిన తర్వాతపై మాటలు నా మనస్సులో కదిలాయి. 30 సంవత్సరాల తర్వాత!

ఎవరిది మూఢాచారం? ఎవరిది గుడ్డి విశ్వాసం!



7

# జలవిద్యుత్తూ - మానవశరీరంలో 'కరెంటూ'

వేగంగా ప్రవహించే నదిని చూస్తూంటే కొంతమందికి క్షణకాలం కళ్ళు తిరిగినట్లయి ముందుకీ వెనక్కీవూగటం జరుగుతుంది. రష్యన్ సైంటిస్టులు కనుగొన్న విచిత్రమైన విషయం ఏమిటంటే ఇలాగే విమానంలో ఎగిరే పైలెట్లూ, కొందరు ప్రయాణీకులూ ఒక్కొక్కసారి విమానము నదులపైగానీ, ప్రవహించే నీళ్ళపైగానీ ఎగురుతూంటే తమ శరీరంలోకూడ ఒక రకమైన 'తిప్పు' (Giddiness) వచ్చినట్టుగా, అనుభూతి పొందటం గమనించారు. అంతేకాదు, క్రింద

ప్రవహించే నీటి వేగాన్నిబట్టి, లేదా నీటి పరిమాణం ఎక్కువగావున్నా, ఈ ప్రయాణీకుల శరీరంలోని 'శక్తితరంగాలు' కూడా హెచ్చుతూ, తగ్గుతూ వుంటాయని ఈ పరిశోధనల వల్ల తేలింది.

'లెనిన్‌గ్రాడ్'లోని ప్రఖ్యాత సైంటిస్టు, ఖనిజాలూ భూగర్భశాఖలో ప్రఖ్యాత నిపుణుడూ అయిన 'డా॥ నికోలాయ్ సొఛైవానోవ్' (Dr॥ Nikolai Sochevanov) 1967లో రష్యా చైనా సరిహద్దులోని 'జబైకల్' ప్రాంతంలో భూగర్భజలాన్నీ, భూమి అడుగునవున్న ఖనిజాలనూ, తెలుసుకోడానికి ఒక పరిశోధన ప్రాజెక్టును చేపట్టటం జరిగింది. ఈ పరిశోధనలో కనుగొన్న ఒక ముఖ్యమైన వైజ్ఞానిక సత్యమే అంటారు. సైన్సు పరిభాషలో! 'స్టాలిన్' ప్రభుత్వంలో వున్న కమ్యూనిస్టు వర్గాల ఒత్తిడి తప్పించుకోడానికే 'డా॥నికోలాయ్' (Dr॥ Nikolai) 'మంత్రదండం' అనే ప్రాచీన శాస్త్రానికి, ఆ పాతకాలపు పేరును తొలగించి ఈ కొత్తపేరు సృష్టించాడు అంతే. మనిషి శరీరంలో వున్న ప్రాణశక్తికీ భూమి అడుగున ప్రవహించే నీటి ప్రవాహంవల్ల పుట్టే జల విద్యుత్తుకూ మధ్య సంయోగం ఒకటి కనబడుతుందన్న సత్యాన్ని తెలుసుకొన్నారు. అదేప్రాచీన 'జలార్గళవిద్య'లో ఉపయోగించే 'మంత్రదండాన్ని' కదల్చి, తద్వారా నీరు ఎక్కడవుందో తెలియజేస్తోందని కూడా ఈపరిశోధనల్లో తేలింది. ఇలా లేబరేటరీలో చేసిన అనేక 'టెస్టు'ల (Test) ఫలితంగా కొన్ని లోహాల కలయికవల్ల ఒక సైకిల్‌పంపువంటి 'కడ్డీ' లేక 'గొట్టం' తయారు చేశారు. ఈ లోహాలకు, ప్రాచీన రష్యాలోని యోగులూ, పల్లెటూరులోని పెద్దలూ ఉపయోగించే ''మంత్రదండం'' (Wizard Rod)కి ఉన్న శక్తి కలిగి వుండేలా చేశారు.

రష్యాలో 'డౌజింగ్' (Dowsing) లేక 'జలార్గళశాస్త్రం'లో ఉపయోగించే కర్రకూడా, నీళ్ళలో మొలిచే ఒక చెట్టుకొమ్మలనుంచే తయారుచేస్తారు. వందలాది సంవత్సరాలుగా మనభారతదేశంలో లాగే, ఈనాడు మూఢ విశ్వాసంగా భావించబడే 'జలార్గళ-శాస్త్ర' మంత్రదండం సహాయంతోనే ప్రాచీన

రష్యాలో కూడా అదే విధానం ఉపయోగించేవాళ్ళు. దీనికి 'హెజెల్ చెట్టు' గాని, 'పీచ్‌చెట్టు' గాని, 'విల్లో' చెట్టుగాని నీడను మొలిచే దానినిచూసి 'Y'-ఆకారంగా వున్న ఒక పంగలకర్రను నరికి దానితో భూగర్భంలోని జలాన్ని కనిపెట్టేవారు. ప్రయోగంలో కర్ర విరిగితే దానిలోని మంత్రశక్తి పోతుందని రష్యా వాళ్ళ నమ్మకం.

ప్రొఫెసర్ 'బోగో మలోవ్' (G.Bogomolov) చేసిన పరిశోధనల్లో, ఈ కర్రద్వారా, భూగర్భంలో వున్న జలమేగాకుండా లోహాలు, ఖనిజాలు, చివరికి పెట్రోలుకూడా ఎక్కడ దొరుకుతందో కనిపెట్టవచ్చు. సీసమూ, తుత్తునాగమూ, బంగారము మొదలైన లోహాలు కూడా ఈ విధానంద్వారా కనిపెట్టడం ఆరంభమైంది! సోవియట్ రష్యాలో, భూమికి 240- అడుగుల లోతున - ఉన్నవాటిని కూడా ఇలా వెతికి పట్టుకోవచ్చు. ఈ పద్ధతిద్వారా అని ఋజువ యింది. కొందరు పురుషులకూ, స్త్రీలకు వేరువేరుగా ఈ కర్రలు ఇచ్చి, పరిశోధనలు చేయగా పురుషులలో 20శాతము, స్త్రీలలో 40 శాతమూ ఈ భూగర్భజలాన్ని పరిశోధించే కర్రను ఉపయోగించేందుకు తగిన 'శరీర విద్యుత్తు'ను కలిగి ఉన్నారని తేలింది.

'జకోస్లోవాకియన్' భూగర్భజల శాస్త్రజ్ఞుడు. ఎస్. డోకులిల్ (S.Dokulil) 1941-లో పెట్రోలియం బావులను, నీటిబావులనూ కనుగొన్నాడు. దీని వివరాలు 'జెకోస్లోవియాలోని ఆధ్యాత్మిక పరిశోధన' అనే తరువాత పుస్తకంలో వివరిస్తారు.

ముసలి గ్రామస్తులు 'మంత్రదండం' తీసికెళ్ళినట్లే రష్యాలోని సైంటిస్టులు కొన్ని లోహాల కలయికతో తయారైన మంత్రదండం వంటికడ్డీని హెలికాప్టర్‌లో ఎక్కి గ్రామాలపై ఎగురుతూ 'జల' ఎక్కడవుందో పెట్రోలు ఎక్కడవుంటుందో తెలుసుకుంటూ ఆ స్థలాలను దేశపటం (Map)పైన పెద్దపెద్ద చుక్కలతో గుర్తింపుచేస్తూ అలా రష్యా అంతా పరిశోధించారు.

ఈ రష్యను 'సైన్సు-దండం' సైజు 59- అంగుళాల పొడుగూ 1/8 అడుగుల మందంవున్న ఉక్కుతీగతో తయారైన దానికి ముందు 8-అంగుళాల చుట్టు (Loop) మధ్యగావుండి, రెండు ప్రక్కలా 6- అంగుళాల పొడుగు ''- ఆకారంలో ఏర్పాటుచేయబడి వుంటుంది. దాని రెండు కొమ్మలకీ మధ్య 3- అంగుళాల 'జాగా' వుంటుంది. దాన్ని ఎలా అమర్చారంటే, ఇది పట్టుకొన్న 'డౌజర్' (Dowser) లేక భూగర్భజల పరిశోధకుడు, నీళ్ళుగానీ, కరెంటు తీగలుగాని, లోపల వున్న నేలపైన నడచినపుడు, ఈ ఉక్కు కడ్డీ గిరుక్కున తిరుగుతుంది! రష్యన్ సైంటిస్టు డా॥ సొఖెవానోవ్ (Dr॥ Sochevaov) చేసిన పరిశోధన బట్టి చూడగా ఈ కడ్డీ ఎన్నిసార్లు తిరుగుతుందో దాన్నిబట్టి ఎంత జలవుందో కూడా అంచనా వేయవచ్చు. రకరకాల 'డౌజింగ్' పరికరాలతో పరిశోధన జరిపి, డా॥ సొఖెవానోవ్ (Dr॥ Sochevaov) భూగర్భజలాన్ని తేలికగా కనుగొనేందుకు అనువుగా వున్న రోజులూ, నెలలూ ఎప్పుడెప్పుడు వుంటాయో కనుక్కొని, వాటిని ''క్యాలెండర్''లో గమనించాడు.

అంటే వాతావరణాన్ని బట్టి, గాలీ వెలుతురూ, సూర్యునిస్థితీ, ఇంకా ఇతర విషయాలను బట్టి 'సంవత్సరం'లో ప్రత్యేకంగా కొన్ని రోజులలో ఈ మంత్రదండం బాగా పనిచేస్తుందని తేలింది. ప్రాచీన భారతదేశంలో కూడా తాళపత్రగ్రంధాల్లో ఈ 'జలార్గళశాస్త్రం' గురించి వ్రాసివున్నది. దానిలో కూడా ఏ తిధులూ, ఏ నక్షత్రాలూ, ఏ మాసాలలో ఈ భూగర్భజలాన్ని తేలికగా గుర్తుపట్టవచ్చో, వివరించబడి వున్నది! ఇందులో గ్రంధాలు ఇంకా ప్రచురణ కావలసి వున్నది.

సరిగ్గా ఈనాడు రష్యన్ సైంటిస్టులు కూడా ఇదే రహస్యాలను పరిశోధనలవల్ల నిరూపించి అవి సత్యాలని కనుగొన్నారంటే - దీని అంతరార్థం ఏమిటి? ప్రాచీన హిందూ ఋషుల ''శాస్త్రాలు'' ఈనాడు రష్యాలో తిరిగి కనిపెట్టబడుతున్నాయా? ఏమో? ఎవరు చెప్పగలరు?



# 8

# ''నెల్యా - మిఖైలోవా''
# పదార్థంపై - మనస్సు అధికారం!

ఆరోజులలో రష్యా ఆధ్యాత్మిక విషయాలు మాట్లాడటం అంటే ప్రాణానికే ముప్పు తెచ్చుకోవడం అన్నమాట! ఎందుకంటే ప్రభుత్వం కమ్యూనిష్టుపార్టీ సిద్ధాంతాలను పూర్తి నమ్మకంతో అనుసరించి గుడ్డిగా భౌతికవాదాన్ని (Meteria-lism) అనుసరించే రోజులవి. మతం అన్నా దేవుడన్నా విషంతో సమానం.

ఇలాంటి వాతావరణంలో 'జ్యోతిషం', దివ్యశక్తులూ, ఇంకా ఏమైనా 'ఆధ్యాత్మిక' విషయాలూ కనిపించే ఏ చిన్న విషయాన్ని ప్రకటించినా, అనాటి రష్యాలో వాళ్ళకు పట్టేది దుర్గతే! 'స్టాలిన్' పరిపాలనలో ఎంతో మంది రహస్య పోలీసుల 'నిఘా'లో నరమానవుడు కనిపించినా సైబీరియాలో బంధించబడి జీవితశేషం గడపవలసి వచ్చేది. ఎందుకంటే కమ్యూనిస్టు సిద్ధాంతానికి పట్టుకొమ్మలు - ''నాస్తికవాదం'' (Atheism), ఇంకోటి 'భౌతికవాదం' అనే ఈ రెండు మూఢవిశ్వాసాలు, ఈ సిద్ధాంతాల ప్రకారము, ఈ ప్రపంచములో నిజమైనది ఒక్క 'పదార్థమే' (Material) దేవుడుకాని, ఆత్మకాని, మామూలుగా

మత సంబంధమైన విషయాలుగా భావించే ''దివ్యశక్తులు'' గానీ లేవని నమ్మటం - ఇతరులను నమ్మించటం. ఈ కమ్యూనిస్టుపార్టీ ముఖ్యవిధానం. అందుకనే మనస్సుయొక్క అతీంద్రియశక్తులూ. జరగబోయే భవిష్యత్తును చెప్పే 'జ్యోతిష్కులూ' ఇలాటి వాళ్ళని నమ్మే ప్రజలను, 'మోసగాళ్ళ' క్రిందా, నేరస్థుల క్రిందా, దేశద్రోహుల క్రిందా పరిగణించి జైలుకి పంపించడమే ఆనాటి రష్యాలో 'స్టాలిన్' పరిపాలనలో కమ్యూనిస్టు ప్రభుత్వానికి ప్రతిరోజు - దైనందిన కార్యక్రమం.

ఇవన్నీ ఎందుకు చెబుతున్నానంటే రష్యాలో ఎవరైనా దివ్య శక్తుల గురించిగాని, 'భవిష్యత్తు'ను గురించిగాని మాట్లాడినా, లేక పదార్థంమీద మనస్సుయొక్క ఆధిక్యతను చూపెట్టే 'సిద్ధులు' అనబడే అతీంద్రియ శక్తులను ప్రదర్శించారన్నా, లేక వాటిపై పరిశోధనలు జరిపారన్నా, అవి వాళ్ళు ఏ పరిస్థితిలో ఎన్ని ప్రమాదాలను ఎదుర్కొని 'సోవియట్ రష్యాలోని' ఈ ఆధ్యాత్మిక పరిశోధనలను జరిపారో ఈనాడు మనకి తెలుస్తుంది. ఇలాంటి అపూర్వమైన పరిశోధనలలో కొన్నిటిని ఇక్కడ గమనిద్దాము.

## పదార్థముపై - మనస్సు ప్రభావం:

''నెల్యా మిఖైలోవా'' (Nelyia Michilova)★ పైన జరిపిన పరిశోధనలు మనస్సుయొక్క 'అసాధారణశక్తి'ని నిరూపించటం పదార్థంతప్ప. తక్కిన ఆధ్యాత్మికశక్తులు అబద్ధం, అనే నాస్తికవాదానికి చావుదెబ్బ కొట్టిందని చెప్పవచ్చు. 'ప్రొఫెసర్ వాసిలీవ్' (Vasiliev) దృష్టితో ఈ పరిశోధనలు - 'మనశతాబ్దంలో హైడ్రోజనుబాంబులు పేల్చటంకంటే ఇవి ముఖ్యమైన పరిశోధనలుగా భావించబడుతున్నాయి! మానవ చరిత్రనే మార్చగల సిద్ధాంతపరమైన ప్రాముఖ్యత కలగిన నిజాలను నిరూపించాయి. ఈ పరిశోధనలు!' అవి ఏమిటో 'మిఖైలోవా' నుంచే తెలుసుకుందాం!

---

* మాస్కో పత్రిక 'ప్రావ్డా' (Pravda)లో ప్రచురించిన 'కొలోడ్ని' వ్యాసం 'When Apples Fall'- by Lev Kolodney 17th July - 1966, ,దీనికి ఆధారం.

అది 'లెనిన్‌గ్రాడ్'లో సరికొత్తగా ఏర్పడ్డ జిల్లా. అక్కడే కనిపిస్తోంది. ''నెల్యూమిఖైలోవా'' (Nelyia Michilova) తన గదులలో ఆమె ఒక ఇంజనీరు భార్య- భర్తతోనూ, పిల్లలతోనూ, ఆనందంగా సంసారంచేస్తూ మామూలు గృహిణిగా జీవిస్తోంది.

మాస్కో (Mascow)లో 'ప్రావ్‌డా' (Pravda) పత్రిక 42 ఏళ్ళవయస్సు గల, 'నెల్యా' పరిశోధనల గురించి పూర్తి 'రిపోర్టు' (Report)ను ప్రచురిస్తూ ఆమె ప్రదర్శించిన ''దివ్యశక్తులు''నిజమైనవనీ, ఆమెను సైంటిస్టులు ''టెస్టు'' చేసిన పరిశోధనలో ఎక్కడా ఆమెవద్ద 'దాచిన సూదంటురాళ్ళు'గానీ, 'దారాలు' గానీ మరి ఏ యితర 'మోసాలుకానీ లేవని' నిర్ధారణగా చెప్పిందంటే, ఈ కమ్యూనిష్టు పార్టీ పత్రిక రాసింది అక్షరాలా నిజమేనని ఒప్పుకోకతప్పదు. అదేమిటో చూద్దాం, ఇప్పుడు.

ఆమె ఒక పెద్ద టేబుల్‌ముందు కూర్చునివుంది. ''మిఖైలోవా'' ఎదురుగుండా కిటికీ! దానిమీద లేసుతో అల్లిన ఒక ''డోర్ కర్టెనూ!'' అంతకుముందే సోవియట్ ప్రభుత్వానికి చెందిన డాక్టర్లు 'మిఖైలోవా' శరీరాన్ని ఎన్నో పరీక్షలు చేశారు. అంతేకాదు ఆమె శరీరంలోపల అవయవాల్లో ఏమైనా ''మేగ్నెట్స్'' లేక సూదంటిరాళ్ళ వంటివి వుంచుకోకుండా ఆమెను 'X Ray ఫోటోలతో పరిశోధించారు. ఆమె అన్నివిధాలా, ఏ అనుమానాలకూ ఆస్కారం లేకుండా సోవియట్ శాస్త్రజ్ఞుల చేత పరిశోధించబడి 'ఏ అనుమానమూ లేదని' నిర్ధారించబడ్డ తర్వాతే యీ ప్రయోగం ఆరంభం అయింది. ఆ గదిలో ఆమె చుట్టూ కుర్చీలలో ''సైంటిస్టులు'' కూర్చుని వున్నారు. ఇది ఒక చరిత్రాత్మకమైన ప్రయోగం!

ఇంతలోకే వారి మధ్యలోంచి ''నావ్‌మోవ్'' (Naumov) లేచి ''నెల్యా'' ముందువున్న ఆ టేబుల్‌మీద ఒక సిగరేట్‌కేసూ, దాని ఫౌంటన్‌పెన్ యొక్క క్యాప్‌నూ, (Fountain Pen Cap) ఒక పెన్సిల్‌వంటి, లోహంతో చేసిన ''సిలెండరూ'' (Cylinder), వాటి ప్రక్కగా సిగరెట్టు వెలిగించుకొనే అగ్గిపెట్టే,

అన్నీ వరుసగా నుంచో పెట్టాడు! తెల్లటి ఆటేబుల్ మీద తళతళా మెరుసు న్నాయి. ఆ వస్తువులు శుభ్రంగా అలా టేబులుమీద పెట్టడం అయ్యాక తన స్థానంలో కూర్చున్నాడు ''నావ్‌మోవ్'' (Naumov)!

అంతా నిశ్శబ్దం! అందమైన కాటుక పెట్టుకున్నట్టు కనిపిస్తున్నాయి ''మిఖైలోవా'' సోగకన్నులు. ఆమె తనకళ్ళను సూదుల్లా చిన్నవిచేసి తీక్షణంగా చూడసాగింది. ఎదురుగుండా టేబుల్‌మీద పెట్టిన ఆ వస్తువులవంకే! తన మనస్సుయొక్క ఏకాగ్రతనంతా కూడ తీసుకొని, అంతా ఒక చోట కేంద్రీకరించి తన శక్తినంతా, ధారపోస్తుందా అన్నట్టు ఉన్నాయి. ఆమె కళ్ళు ముందుగా మిఖైలోవా దృష్టి ఎదురుగుండా వున్న ఒక ''దిక్సూచి'' లేక ''కంపాస్'' (Compass) మీద కేంద్రీకరించటం జరిగింది. ఇంతలోకే మిఖైలోవా తన సన్నటి చేతివ్రేళ్ళను జాపి, టేబుల్‌కు పైగా ఆరంగుళాల ఎత్తున కదిలించ సాగింది. గుండ్రంగా - మానసికశక్తితో ఒక సుడిగుండం సృష్టిస్తున్నదా అన్నట్టు! ఇర్వై నిముషాల గడిచాయి. ఆమె తలని కంపాస్ - నీడిల్‌కు ఒక ప్రక్కనుంచి ఇంకో ప్రక్కకి కదిలిస్తూ కళ్ళని ఇంకా చిన్నవిగా చేసి తీక్షణంగా చూడసాగింది. ఆమె చేతిని టేబుల్‌పైగా ఇంకా వేగంగా ఆడిస్తోంది. నలభై ఏళ్ళపైబడ్డ మిఖైలోవా ముఖంలోని కండరాలు శ్రమను సూచిస్తున్నాయి .కొంచెం దస్సినట్లు కనిపిస్తున్న ఆమె చెంపలపైన సొట్టలు పడ్డాయి. ఇంతలోకే చూస్తుండగానే ఎదురుగుండా ఉన్న కంపాస్‌లోని ముల్లు గిరుక్కున తిరిగి ఆమె వైపుకి మళ్ళింది!! మళ్ళీ వణికింది. కంపాస్‌లో తిరుగుతూ! లోవా తన చేతిని గుండ్రంగా ఆడిస్తోందల్లా ఆగిపోయింది. ఈసారి కంపాస్‌లోముల్లు వ్యతిరేకంగా తిరగటం మొదలు పెట్టింది. వెనక్కి తిరిగే గడియారం ముల్లులా!

చూస్తూండగానే కంపాస్‌లోని ముల్లు గిర్రుమని ఫ్యాన్ (Fan)లా తిరిగింది. టేబుల్‌చుట్టూ కూర్చున్న సైంటిస్టులు అందరూ ఆశ్చర్యంతో ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూస్తున్నారు. తమ కళ్ళను తామే నమ్మలేని ఆశ్చర్యం, బెదురూ వారి ముఖాల్లో కొట్టవచ్చినట్లు కనబడుతోంది. ఒకరు రుమ్మాలు తీసి నుదుటిపైన చమట తుడుచుకున్నారు.

'మిఖైలోవా' ముఖంలో శ్రమ ఇప్పుడు స్పష్టంగా కనబడుతోంది. నుదురుపైన ముడతలు, నేలపైబడ్డ బీటలులాగ తేలాయి. ఈసారి నెల్యా ముందున్న అగ్గిపెట్టెకూడా కంపించి, వణకసాగింది. ఆ వస్తువుపైనే 'మిఖైలోవా' తనచేతిని ఆడించసాగింది. గుండ్రంగా, అగ్గిపెట్టె కదిలి అటూఇటూ ఎగుర సాగింది. ఆశ్చర్యంగా ఉంది. మిఖైలోవా చేతిలోని ఏదో అజ్ఞానమైన ఎలక్ట్రిక్ కరెంటువంటి 'శక్తి' ఎదుట టేబుల్‌మీద వున్న వస్తువులమీదకి ప్రసరిస్తోందా, అన్న ఆశ్చర్యం కలిగింది అందరికీ! ఆ గదిలోని వాతావరణం విద్యుత్తుతో నిండిపోయినట్లనిపించింది! టేబుల్‌మీద పెట్టినచోటు నుంచి కదిలి ఆ అగ్గిపెట్టె జరుగుతూ పోయి టేబుల్ అంచుపై నుంచి దొర్లి కిందపడింది. ప్రక్కనే కూర్చున్న ''నావ్‌మోవ్'' (Navmov) లేచి గాజుపలక ఒకటి తీసి ఇంకొక అగ్గిపెట్టెపైనగా నిలబెట్టాడు. వాటికానించి లోహపు సిలెండరును నిలబెట్టాడు. ఈసారి ''నెల్యా''కళ్ళల్లోంచి శరవేగంతో ప్రవహిస్తున్న 'ఏదోశక్తి' టేబుల్‌మీదకు వ్యాపించసాగింది! ఆ వస్తువులు ఒక్కొక్కటే ఎగిరి ఒకదాని తర్వాత ఇంకొకటి గెంతుతూ పోయి టేబుల్‌మీద నుంచి ఎగిరి కిందపడసాగాయి. నెల్యా (Nelyia) చెయ్యీ చూపూ ఎటు కదిలితే ఆ టేబుల్ మీదనున్న వస్తువులు కూడా దాని ప్రకారం అటే కదలసాగాయి!

మిఖైలోవా, ఈసారి స్పష్టంగా కనబడుతోంది అలసిపోయినట్లు, ఆమె ప్రక్కనే కూర్చున్న డాక్టరు ఆమె నాడిని పరిశీలించగా నిముషానికి 250 సార్లు కొట్టుకుంటోంది!

ఇంకొక పరిశోధన మొదలు పెట్టాడు సైంటిస్టు ''నావ్‌మోవ్''(Navmov) దీని ఉద్దేశం – 'నెల్యా' శరీరంలోంచి ప్రవహించే శక్తి మామూలు విద్యుత్తువంటి శక్తి కాదని, లేదా సూదంటురాయి ఆకర్షణ వంటి అయస్కాంత శక్తికూడా కాదనీ (Magnetic Force) ఋజువు చేయడానికి ఈ ప్రయోగం ఉద్దేశించినది.

ఒక గాజుపలకను అడ్డంగా నిలబెట్టారు! దానిలోంచి సూదంటు రాయివంటి అయస్కాంతపు ఆకర్షణ తరంగాలు ప్రసరించకుండా మాగ్నెట్

(Magnet)తో ఆకర్షించబడనీ (Non Mangetci) లోహంతో చేసిన ఒక ''సిలెండరు''ను టేబుల్‌పై నిలబెట్టారు. ఈసారి కూడా మళ్ళీ అలాగే ఆమె తమశక్తినంతా ధారపోసి మనస్సును కేంద్రీకరించింది. ''నెల్యామిఖైలోవా''! చూస్తూ ఉండగానే టేబుల్ మీద నిలబెట్టిన సిలెండరు(Cylinder), గాజుపలకా ఒక్కొక్కటే కదిలిపోయి, మళ్ళీ యథాప్రకారం టేబుల్‌మీంచి గెంతి క్రిందపడసాగాయి...కాని...మధ్యలోనే ఆకస్మాత్తుగా ప్రయోగాన్ని నిలుపుదల చేయాల్సి వచ్చింది. అంత శక్తి పోయినందున ఆ శ్రమకి గుండె నీరసం వచ్చింది. నెల్యామిఖైలోవాకి నిస్సత్తవ కలిగి అలసట తీర్చుకోవలసి వచ్చింది. జరుగుతున్నదంతా ఒక ప్రక్కనుంచి సినీకెమేరాతో ఫిల్ము తీస్తున్నారు. ఈ ప్రయోగం అయ్యాక ''నావ్‌మోవ్''తక్కిన సైంటిస్టుల కవి వివరించాడు. ఈ ఆధ్యాత్మిక శక్తిని ప్రసరించడానికి నెల్యాలోనుంచి ఎంత బలం తగ్గిపోతుందో! ఆ అరగంటలోనూ, ఆమె అరపౌను బరువు తగ్గింది. అంతేకాదు ఇలాంటి ప్రదర్శనలు ఇచ్చిన తరువాత చాల రోజులదాకా ఆమెకు కాళ్ళూ, చేతులూ సలుపుతాయి. నరాలు పీకుతాయి. ఒక్కోసారి కళ్ళు తిరగటం కళ్ళు చీకట్లు కమ్మటం కూడ జరుగుతోంది. ఈ ప్రయోగాలు జరిగిన తర్వాత కొన్ని రోజులు నిద్రపట్టదు ఆమెకు!

ఈ ప్రయోగం అవగానే అక్కడి సైంటిస్టులు ఇదివరకు చేసిన ప్రయోగాల 'ఫిల్మ్' తీసిందానని చూపెట్టారు. అందులో అనేక రకాల వస్తువులతో, వేరువేరు పరిస్థితులలో 'నెల్యామిఖైలోవా'పై ఆ సైంటిస్టులు పరిశోధనలు చేసినపుడు తీసిన ఫిల్ములవి అద్భుతం! అన్ని పరీక్షలలోనూ ఆ మధ్య వయసుపై బడ్డ అందమైన 'నెల్యామిఖై లోవా' తనలోని దివ్యశక్తులను ''సైన్సుదృష్టితో ప్రయోగ పరంగా యదార్థమని ఋజువు చేసింది! ఇది చరిత్రాత్మకమైన ఘట్టం. సైన్సు చరిత్రలోనే!!

కాదు -కమ్యూనిష్టు సిద్ధాంతం చరిత్రలోనే! పదార్థవాదం. నాస్తికవాదం అనబడే (Materialims) పునాదులతో సహా కదలిపోయినవి, ఈ భూకంపం

లాంటి సైన్సు ప్రయోగంతో! దాని ప్రభావంతో సైన్సులోని అణుసిద్ధాంతం (Nuclear Physics) రేడియో తరంగాల (Electro Magnetic Waves) విషయాలలోనేకాక, జీవశాస్త్రం (Biology)లో కూడ ఒక కొత్త అధ్యాయం ఆరంభమైందని చెప్పవచ్చు. దీనిలో ఋజువైందేమిటంటే - 'మనస్సుకు' ఒక అద్భుతమైన 'శక్తి' వున్నదనీ - ఆ శక్తి 'పదార్థాన్ని కదలించగలదనీ' వస్తువులను కదపడం ప్రభావితం చేయటం సైన్సులోని, విద్యుత్తుయొక్క కరెంటులాగే దీన్ని ప్రత్యక్షంగా నిరూపించవచ్చునీకూడా నిస్సందేహంగా ఋజువైంది. అందులోనూ యీ శక్తి మానవ మేధస్సులోంచీ, మనిషి యొక్క మనస్సులోంచీ, ఆలోచన తరంగాలవల్లా, ఉద్భవిస్తుందన్న వైజ్ఞానిక సత్యం సోవియట్ శాస్త్రజ్ఞులు కనిపెట్టగలిగారు. దీనియొక్క 'ప్రభావం' కమ్యూనిష్టు పార్టీ సిద్ధాంతం మీదనేకాక మానవజాతి యొక్క చరిత్రమీద కూడా ఎంతో వుంటుంది! ఆశ్చర్యంలేదు ప్రపంచ ప్రఖ్యాతి పొందిన సోవియట్ అకాడమీషియన్, ప్రొఫెసర్ 'ఎ.మిక్యూలిన్' కూడ నావ్‌మోవ్ (Naumov) అన్న ఈ మాటలతో ఏకీభవిస్తాడు -' ఈ రోజు మనం చూసింది సైన్సులో ఇంతకు పూర్వం ఎరుగని ఒక నూతన 'శక్తి'యొక్క ప్రభావం! ఇది మనుష్యులలో వున్న ఒకానొక 'అజ్ఞాతశక్తి'! - అంటూ మాస్కోపత్రిక 'ప్రావ్‌డా' ప్రచురించిన మాటలు. సువర్ణాక్షరాలతో వ్రాయబడి వుంటాయి! నిజమే! ఒక నూతన శక్తి మానవుడిలో కనుగొనబడింది! ఈ శక్తి బహుశా ప్రపంచ చరిత్రనే మార్చివేయ వచ్చు. కాదు అణుబాంబుల ప్రేలుడువంటి ఒక భూకంపాన్ని ఇది సృష్టిస్తుంది - యుద్ధంలోనేకాదు - మానవుడి మేధస్సులోకూడా!

1945లో 'అణుశక్తి' - అణువుగుండెలు చీల్చుకుని వచ్చి పదార్థ రూపాన్నే నాశనంచేసి - భౌతిక ప్రపంచంలోని అంతర్యామిగా 'శక్తి' ప్రత్యక్షమై 'అణుయుగాని'కి నాంది పలికింది. అలానే 'నెల్యామిఖైలోవా' ద్వారా ప్రత్యక్ష మైన ఈ క్రొత్త 'శక్తి' పదార్థన్నీ భౌతిక అణుమయ ప్రపంచాన్నే ఆజ్ఞాపించగలనని ఋజువుచేసిన రష్యన్ ఫేవెల్‌నావ్ మోవ్! భౌతిక ప్రపంచానికి యజమానిగా

'మనస్సు'కు సైన్సు పీఠంపైనే రాజ్యాభిషేకం జరిగింది! ఈ నూతన ఆధ్యాత్మిక శక్తి మానవ మేధస్సులో ఒక విప్లవాన్ని సృష్టించింది.

ఈ 'విప్లవం'- 1971లో కమ్యూనిజం ద్వారా రష్యాలో పదార్థవాదం నాస్తికవాదం బైలుదేరిన 'రాజకీయ విప్లవం' కంటె అత్యంత ప్రాముఖ్యత గలిగిన విప్లవం!

ఇది సైన్సు విప్లవం! నెత్తురుతో సాధించిన రాజకీయ విప్లవంకాదు! రాజకీయాలపై సైన్సు విజయాన్ని సూచించే 'మానసిక-విప్లవం' (Mental Revolution) ఇది! రానున్న సత్యయుగం ఉదయించే బంగారు ఉషస్సుయొక్క తొలిరేఖ! కమ్యూనిజంతో ఉదయించిన నెత్తురు సూర్యోదయాన్ని కడిగివేసే బంగారు సూర్యోదయం! సత్యయుగానికి నాంది! ఇది సైన్సు యుగానికి, సత్యయుగానికి మధ్య 'సంధి' - 'యుగసంధి'!

'నెల్యా మిఖైలోవా' ఈ తొలి ఉషస్సుకే వేగుచుక్క!

ఈ రచనకు ఆధారాలు


* "Scientists speak out"- Moscow, Pravda, 17, March 1978.
* Zdenek Rejdak- "On the Third Form of Energy"- "Periscope" (Prague 1967) Czechoslovakia.
* Lev Kolodny - "When Apples Fall" - Moscow "Pravda" 17 - March 1978.
* Pavel, Naumov - "Nelyia Michilova" article in Lenin grad "Pravda" 21 Jan, -1964.




9

# కళ్ళు లేకుండా - చూపు!

గుడ్డివాడైన ధృతరాష్ట్రుడు భగవంతుడైన శ్రీకృష్ణుని అనుగ్రహంతో తన ఎదుట కనిపించే భగవత్స్వరూపాన్ని చూశాడని మహాభారతంలో వ్యాసమహర్షి వ్రాసిన సంఘటన చదువుతూ ఉంటే, ఈనాడు భౌతికవాదులు, నాస్తికులం అనుకునేవాళ్ళు నవ్వుకోటం మనకి కనబడుతూ ఉంటుంది.

ఎందుకంటే ఈ సైన్సు యుగమైన 20వ శతాబ్దంలో, పాతపురాణంలోని చింతకాయపచ్చడిని నమ్మే తెలివి తక్కువ వాజమ్మలు వున్నారని! అక్కడికి వాళ్ళకేమో తెలివి ఉన్నట్లు, నమ్మని వాళ్ళదే తెలివి, నమ్మే వాళ్ళది తెలివితక్కువ, అన్న మూఢవిశ్వాసం ఈనాటి చదువుకున్న అజ్ఞానులకూ తెలివైన వాళ్ళమనుకొని మంచిబట్టలు వేసుకొన్న పామరులకూ మామూలు అయిపోయింది. చదువుకోని మొరటు రైతురక్తంలో జీర్ణించుకున్న సంస్కారం నైతిక విలువలకు అలవాటు పడని చదువుకున్న మూర్ఖులలో లేదంటే ఆశ్చర్యం ఏముంది. ఇలా అనుకోడానికి ఒక కారణమున్నది. కళ్ళు లేకుండా చూడటం ఎలా సాధ్యం?

అందులోను పుట్టుగుడ్డివాడికి! మనకు తెలిసినంతవరకు అది అసాధ్యం, కాబట్టి అలా ఎవరైన గుడ్డివాళ్ళు చూశారంటే అది అబద్ధమైనా, బూటకమైనా అయివుండాలి. ఇదే కమ్యూనిష్టులలోని మూఢవిశ్వాసం అని ఋజువుచేసే ఆశ్చర్యకరమైన పరిశోధనలు, కమ్యూనిజానికి పుట్టినిల్లయిన రష్యాలోనించి రావడం వింతకదూ!

హాలాహలం వంటివిషం పుట్టినచోటే అమృతం పుట్టింది. అన్న పురాణసూక్తి, నాస్తికత్వం చోటే ఆధ్యాత్మిక శక్తులు ఋజువవుతూ సైన్సు రావడం రష్యా విషయంలో పూర్తిగా సరిపోయింది.

అది 1960 ప్రాంతం. 'ఊరల్ పర్వతాల'మధ్యలో వున్న ''టాగిల్'' నగరం. బజార్లలో వచ్చే పోయే జనంతో బిలబిల్లాడుతోంది. గనుల సంబంధమైన పరిశ్రమలతో పొగలు చిమ్మే ఫ్యాక్టరీల రొదలతో ప్రతిధ్వనించే 'టాగిల్' నగరం సరిగ్గా యూరప్, ఆసియా రెండూ కలిసే సరిహద్దులో ఉన్నది - ఆసియాలోని ఆధ్యాత్మికత్వం, యూరప్‌లోని సైన్సు కలిసింది అన్నట్టు, 'రోజాకులేషావా' (Rosa Kuleshpva) కల్లా కపటంలేని పరిశుద్ధమైన మనస్సు కలిగిన 22 ఏళ్ళ యువతి, నిత్యం తన ఊహాలోకంలోనే బతుకుతూ బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా అడవిలో పూసిన పువ్వులాగా పెరిగింది. పొట్టిగా బొద్దుగా ఉండే 'రోజా' తన 16వ ఏట నుంచి ఆ ఊరిలో ఉన్న గుడ్డి పిల్లలచేత పాటలు పాడిస్తూ, నాటకాలకు రిహార్సలు చేయిస్తూ కాలం వెళ్ళపోసేది. కారణం 'రోజాకులేషావా' పుట్టుకతోనే గుడ్డిపిల్ల, బయట ప్రపంచం ఎలా వుంటుందో తెలియని చీకటి బతుకు రోజాది.

ఆమె కుటుంబంలో గుడ్డిపిల్లలు మరికొందరుకూడా ఉన్నారు. గుడ్డివాళ్ళకోసం ప్రత్యేకం అచ్చువేసే ఉబ్బెత్తు అక్షరాలు కల్గిన 'బ్రెయిలి' అచ్చుపుస్తకాల సాయంతో 'రోజా'మాటలు కూడబలుక్కుంటూ విద్యావంతురాలయింది. మంచి భాషా విజ్ఞానం సంపాదించింది. చీకటిగా నడుస్తున్న రోజా బతుకులో ఒక విచిత్రం జరిగింది. ఎదుటి ప్రపంచాన్ని చూడలేని పెద్దకళ్ళతో

రోజా తన ఊహాలోకంలోని కలలే చూస్తూవుండగా అకస్మాత్తుగా ఒక ఆలోచన తట్టింది. గుడ్డివాళ్ళకు తాను కళ్ళులేకుండా రంగులను గుర్తించడం, చదవడం కూడా నేర్పేశక్తి తనకిచ్చినట్లు! ఇది ఆత్మప్రబోధమో, కేవలం ఊహాగానమో చెప్పలేను గాని 1962 వసంత ఋతువు రాగానే, అనుమానంతో రోజాను పరిశీలించిన డాక్టరు 'మోసిఫ్ గోల్డ్‌బర్గ్' ఆశ్చర్యంతో తుళ్ళిపడ్డాడు. రోజా కళ్ళకు గట్టిగా గంతలుకట్టి డాక్టరు 'గోల్డ్‌బర్గ్' ఆమెను పరీక్షించాడు - రోజా తన కుడిచేతి ఉంగరం వేలు, మధ్యవేలు సహాయంతో తన ఎదురుగుండా పెట్టినరంగు రంగుల కాగితాలను తడుపుకుంటూ ఆ రంగులు చెప్పుకు పోతోంది. 'ఆకుపచ్చ, ఎరుపు, లేతనీలం, ఆరెంజి' అంటూ! గోల్డ్‌బర్గుకు మతి పోయినట్లయింది. ఎన్నిసార్లు పరిశీలించినా పుట్టుకలో గుడ్డిదయిన రోజా తన వ్రేళ్ళతో తడిమి కాగితాలమీద రంగులను స్పష్టంగా గుర్తించేది. ఇదెలా సాధ్యం! తన కళ్ళ ఎదురుగుండా వున్న రోజా వ్రేళ్ళను నిశితంగా పరిశీలించాడు. అవి మామూలు వేళ్ళే "గోల్డ్‌బర్గు" గబగబా వెళ్ళికొన్ని పత్రికలు, మేగ్‌జైనులు కొన్ని పుస్తకాలు తెచ్చిరోజా ముందు పడేశాడు. అవలీలగా రోజా వ్రేళ్ళు ముందుకు జరుపుకుంటూ టైపు చేస్తున్న వ్యక్తిలా కాగితాలమీద ఉన్నదంతా చదివేసింది.

ఏమిటీ చిత్రం! పైకి అందరి వ్రేళ్ళలాగ కనిపిస్తున్న రోజా చేతిలో అకస్మాత్తుగా పైకి కనిపించని రెండు కళ్ళు మొలిచాయా అన్నంత ఆశ్చర్యమేసింది!!

"మొదటిసారి నేను నా వేళ్ళతో అచ్చు అక్షరాలనుల చదవగలనని తెలుసుకున్నప్పుడు నా జేబులో వున్న కాగితాల్లోని నోట్సునికూడా, తడివి చదవగలనని మా స్కూల్లో ఒక పరీక్ష రాస్తుండగా నాకు తోచింది అని నిజం ఒప్పేసుకుంది గోల్డ్‌బర్గు ఎదుట రోజాకులేషావా.

ఇందులో ఎలాంటి మోసమూ కనబడలేదు. ప్రఖ్యాతిగాంచిన నరాల స్పెషలిస్టు, పరిశోధకుడైన డా॥ గోల్డ్‌బర్గుకు ఆయన అనుమానం తీరక అనేక

విధాల రోజాకు పరీక్షలు పెట్టి చూశాడు. అనుమానం లేదు! రోజాకు కళ్ళు లేకుండానే వేళ్ళసహాయంతోనే చూడగలుగుతోందని తేలిపోయింది! ఆ ధైర్యంతోనే 'టాగిల్' నగరంలో 1962లో మానసిక మనస్తత్వవేత్తల మహాసభలు జరుగుతూంటే సైన్సు ప్రపంచానికి ప్రతినిధులైన వారిముందు 'రోజా' విచిత్ర వ్యక్తి అని ప్రకటించాడు. ఆశ్చర్యంతో వేలాది కళ్ళున్న శాస్త్రవేత్తలు నిశితంగా గుర్తించారు కళ్ళులేని రోజాను.

సభ జనంతో నిండి ఉన్నది. రోజా తలకు, కళ్ళకు, దళసరి గుడ్డ అనేకసార్లు చుట్టి గట్టిగా కట్టి ముడివేశారు. అప్పుడురోజా తనశక్తిని ప్రదర్శించ సాగింది. ఎదురుగుండా పెట్టిన ఫోటోగ్రాఫులోని వ్యక్తిని చెయ్యిజాపి తన చేతివ్రేళ్ళతోనే ఒకసారి చూసింది. వెంటనే ఆ ఫోటోలో ఉన్న మనిషి రూపాన్ని వర్ణించింది. అతను కట్టుకున్న 'టై' రంగుతో సహా చెప్పేసింది! ఆశ్చర్యంతో సభలో ఉన్నవారంతా వూపిరి స్తంభించి చూశారు!

'ఎలా చెప్పగలిగావమ్మా? అంటూ ప్రశ్నవేస్తే - ప్రాక్టీసువల్ల! అని రోజా సమాధానమిచ్చింది'. నేను ప్రతిరోజు కొన్ని గంటల పాటు ప్రాక్టీసుచేసి ఆరేళ్ళగా ఈ శక్తిని పెంచుకున్నాను అని.

ఆ సంఘటనతో- ఒక్కసారిగా 'రోజా' విచిత్ర శక్తిగురించి న్యూస్‌పేపర్లలో పెద్ద అక్షరాలతో రష్యా అంతా పాకిపోయింది. పతాక శీర్షికలతో వున్న రోజా విచిత్రశక్తులను గురించి రష్యన్లు అందరూ చదివి ఆశ్చర్యపోయారు. ఎవరినోట విన్నా ఒకటేమాట ''టాగిల్'' నగరంలోని అద్భుత బాలిక! దైవశక్తిగల పిల్ల టాగిల్‌లో, అంటూ రకరకాలుగా రోజాశక్తులను గురించిన న్యూస్ అంతటా తెలిసి పోయింది. కమ్యూనిష్టు పార్టీ పత్రికలుకూడా రోజా విచిత్రశక్తులను పెద్దఅక్షరాలతో ప్రకటించాయి. వేలాది బుర్రలలో అనుమానం తలఎత్తింది. మేధావులు కంటికి కనపడనిదాన్ని నమ్మని స్వభావం కలవారు, రోజాను పరిశోధన నిమిత్తం మాస్కో పిలిపించారు. అక్కడ 'సోవియట్‌సైన్సు అకాడమీ' పర్యవేక్షణ క్రింద లేబరేటరీలో అతినిశితమైన పరీక్షలు జరిపి రోజాను క్షుణ్ణంగా

పరిశీలించారు. ఫలితం. రోజా శక్తులు అసలైనవేనని తేలింది - అసంభవమైన రోజాయొక్క చేతివ్రేళ్ళచూపు యదార్థమని సర్టిఫికెట్ ఇచ్చారు. దివ్యశక్తుల ముందు సైన్సుతలవంచి మోకరించింది మొదటి సారిగా. ఈ శక్తికి ఏం పేరు పెట్టాలా అని కంగారుపడి పోయారు సైన్సు జీవులు-'కళ్ళులేని చూపు' 'చర్మంతో దృష్టి' అని ఇలా అనేకవిధాలుగా వర్ణించారు రోజా 'దివ్యదృష్టి'ని.

ఆ రోజునించి అనేక ప్రదర్శనలు ఇచ్చింది 'రోజా కులేషావా' వేలాదిమంది జనంతో కిక్కిరిసిన అనేక సభలముందు నిలబడి తన శక్తులను ప్రదర్శించేది. పుట్టుగుడ్డి కళ్ళకు గంతలు కట్టి రష్యనులు ఆమె చేతిని పట్టుకొని గోడకు తగిలించిన న్యూస్‌పేపర్లమీద రంగురంగుల కాగితాలపైన జరిపేవారు. రోజా మామూలుగా ప్రయత్నం లేకుండా ఎదురుగుండా వున్న పేపర్లను చదివేది. ముందున్న రంగులు చెప్పేది.

కాని మారుమూల లేబరేటరీలో కూర్చున్న 'సోవియట్ సైంటిస్టు' బుర్రవిశ్రాంతి లేకుండా పనిచేస్తోంది! రోజాలోని ఏ శక్తి చేతివేళ్ళలోంచి చూసేలాగ సహాయపడుతున్నది? అసలు చూడటం అనేది మనిషికి ఎలా జరుగుతోంది? ఇది కళ్ళతో డాక్టర్లు చెప్పినట్లు కాంతి తరంగాలవల్ల చూస్తున్నామా? లేక మనస్సుతో చూసిన బొమ్మలు గుర్తిస్తున్నామా? నిద్రలోని కలలో కనిపించే వస్తువులనెలా చూస్తున్నాము. దృష్టి అనేది భౌతికమా! అతీతమా! అన్న పెద్ద మీమాంసలో పడిపోయారు. అంతా నిద్రిస్తున్న నాస్తికవాదంలోంచి, కళ్ళు మూసుకుపోయిన భౌతికవాదంలోంచి గుడ్డి రష్యాలో, ఒక్కసారి కొత్తరకం చూపుమేల్కొన్నది.

ఒక విధంగా చూస్తే గుడ్డిపిల్ల అయిన 'రోజా'వంటిదే 'రష్యా' భౌతిక విషయాలు తప్ప అంతకంటే పై వాటిని చూడలేని గుడ్డితనం అది తన కళ్ళకు కనిపించినవన్నీ లేవని కళ్ళు మూసుకున్న గుడ్డితనం రష్యాది. అకస్మాత్తుగా ఆ రష్యాలో ఒక ఆధ్యాత్మిక చైతన్యం మేలుకోవడం - అందులోనూ చేతివేళ్ళతో చూసే దృష్టి మేలుకొన్న అద్భుతం వంటిదే, రష్యాలోని ఆధ్యాత్మిక దృష్టి -

మూడోకన్ను తెరచుకోవడం లాంటిదే. ఈ జ్ఞాననేత్రం రష్యాలో జరుగుతున్న పరిశోధనల స్వరూపాన్నే మార్చివేసింది. అనతికాలంలో భౌతికవాదాన్ని నాస్తికత్వాన్ని భస్మంచేసే మూడోకన్ను అవుతుందా ఈ పరిశోధనల సారాంశం! రాజకీయ వేత్తలయిన ఈ కమ్యూనిష్టులకి భయం పట్టుకుంది, రష్యాలోని సైన్సు పోకడలు చూస్తూ! ఆరితేరిన ఒక సైంటిస్టుల బృందం 'డా॥ షేఫర్ నాయకత్వంలో "రోజా" శక్తులతో సైన్సు జరిపే అంతిమ పోరాటంకోసం, ఆమెను మానసిక పరిశోధన చేసే 'క్లినిక్'కు 'స్వెర్డ్'లో పట్టణానికి పిలిపించారు.

అతిసాదాగా కనిపిస్తున్న "కులేషావా" శరీరంలో అసాధారణ మైన ఆధ్యాత్మికశక్తులేవైన దాగివున్నాయా! రోజా చూడకలిగేది మన కళ్ళవంటి చూపుతోనేనా? లేక మనస్సుతో చూచి చెపుతోందా! కళ్ళులేని ఆమె చూపు శరీర అవయవాలకు సంబంధించినదా! లేక ఆమెలో ఉన్నది 'ఉల్ఫ్ మెస్సింగ్' కున్నటువంటి ఆలోచన శక్తియా దేనితో చదువగలుగుతోంది?

డా॥'షేఫర్' పరిశోధనలు ఇంకా కట్టుదిట్టంగా చేయబడ్డాయి. 'రోజా' కళ్ళకు తలకు గట్టిగుడ్డను బిగించడమే కాకుండా ఆమె ఎదురుగుండా ఒక దళసరి అట్టతెరలాగ పెట్టారు. దాని కవతల రంగుకాగితాలు పెట్టి వాటిపైన గాజు పలకలు బిగించారు. ఎన్ని చేసినా 'రోజా' గాజుపలకల అడుగునవున్న కాగితాల రంగులను చెప్పగలిగిందీ, తన ఎదురుగుండా వున్న అట్టచాటున వున్న అక్షరాలు ఏమీ తప్పులేకుండా చదవగలిగింది.

ఈసారి రంగురంగుల కాగితాలపైనున్న గాజుపలకను కొన్నిటిని వేడిచేసి కొన్నిటిని చల్లగా శీతలంచేసి వాటి ఉష్ణోగ్రతలు మార్చి మార్చి వాటివెనక రంగుకాగితాలు మారుస్తూ పరిశోధనలు చేశారు. మళ్ళీ ఈసారి కూడా వాటి రంగులు స్పష్టంగా చెప్పగలిగింది. రోజా సందేహం లేకుండా ఋజువయింది. రోజా చేతివేళ్ళలోని స్పష్టమయిన చూపు!! 'కళ్ళులేని చూపు'!! సైన్సులోనే

* Papers of the International Parapsychology Seminar Moscow, August 1966.

ఎక్కడా కనీవినీ ఎరుగని వింత. ఈ పరిశోధన తర్వాత డా॥ 'అబ్రహాం నోహోమిస్కి' కూడా 'రోజా' శక్తులను తన లేబరేటరీలో పరిశీలించి చూశాడు. ఫలితం, రోజాకే విజయం. సంవత్సరాలు గడిచినకొద్దీ రోజాపై వేసిన పరిశోధనల రిపోర్టులు గుట్టలు గుట్టలుగా పెరిగిపోతూవచ్చాయి. రష్యన్ సైంటిస్టులకు అనుమానం కలగసాగింది'- రోజాది ఒక విచిత్రమైన 'జన్మ'. ఆమె శక్తి ఇతరులకు సంభవం కాదేమో!' అని రోజాలాంటి శక్తులు కలిగిన ఇతర వ్యక్తులకోసం సైంటిస్టులు పరిశోధించసాగారు. ఇంతకుముందు ఎవ్వరైనా కళ్ళు లేకుండా వస్తువులను చూడటం జరిగిందా? అన్న పరిశోధనతో ఒక విషయం వెల్లడయింది. 1950లో రష్యన్ సైకాలజిస్టు డా॥ ఎ.ఎన్.లియోన్ ట్యేవ్ (Dr॥ A.N. Leontyev) కొంతమంది వ్యక్తులకు ట్రైనింగు ఇచ్చారు. అరచేతులతో స్పర్శద్వారా రంగులను గుర్తుపట్టేవిధానం. అలాగే ఆధ్యాత్మిక పరిశోధకుడు 'లియోనార్డ వాసిలేల్' 1950 చివరిభాగంలో కళ్ళులేని చూపుకల రష్యాలోని 'పోలోట్స్' మానసిక హాస్పిటల్‌లో వున్న ఒక వ్యక్తిని కూర్చోపెట్టి 'హిప్నాటిజం' సహాయంతో యోగనిద్రలోకి పంపి, అతని చేతికి 'ప్రావ్దా' పత్రిక నిచ్చి చదవమన్నాడు. అతను పత్రికను చదవటమేకాకుండా- మధ్యన ట్రేసింగ్ కాగితం అడ్డుపెట్టిన దాని అడుగున వున్న అక్షరాలు స్పష్టంగా చదవగలిగాడు. ఇలాగే డా॥ 'నోవోమిస్కీ' 'టాగిల్'లోని రిసెర్చి కేంద్రంలో 80 మంది విద్యార్థులను పరిశోధించి ప్రతి 6వ మనిషికి, ఈ చేతులతో రంగులను గుర్తుపట్టే శక్తివుందని కనిపెట్టాడు! అంతేకాదు, స్పర్శజ్ఞానంతో రంగులను ఎలా గుర్తిస్తున్నారో తెలిసికొనే ఒక రహస్యమైన కిటుకుకూడా ఆయన కంటపడింది.

అది ఏమిటంటే కళ్ళులేకుండా చేతులతో రంగురంగుల కాగితాలను తడివినపుడు వాళ్ళచేతికి కొన్ని రంగులు వెచ్చగా కొన్నిరంగులు చల్లగా మరికొన్ని రంగులు గరుకుగా, కొన్ని జిడ్డులాగా వున్నట్లు ఇలాగ రకరకాల స్పర్శానుభూతిని కలిగిస్తాయని తెలిసింది. ఇది రంగు కాగితాలపైన వుండే గరుకుతనం

వల్లనేమో అని నునుపైన ఆర్టుపేపరుమీద ముద్రించిన రంగుకాగితాలు వాళ్ళ ముందుంచాడు. అప్పుడుకూడా కొన్ని రంగులు గరుకుగాను, కొన్ని వెచ్చగాను, కొన్ని జిగటగాను, అందరూ తెలియజేశారు. ఇది చాలక ఆ రంగు కాగితాలపైన వెడల్పాటి గాజుపలక (glass sheet) పెట్టి, దానిపైన ముట్టుకున్నా ఆ గుడ్డివాళ్ళు తమ చేతులకి అదే స్పర్శానుభూతిని పొందటం వింతగా అనిపించింది. ఇలా రంగులను తప్పులేకుండ గుర్తుపట్టగలిగే వ్యక్తులలో అతీతశక్తి గల ఒక వ్యక్తి కళ్ళకు గంతలుకట్టి ఎన్ని పరిశోధనలు చేసినా ఇదే ఫలితాలను తెలియజేశాడు. అంటే ఒక్కొక్క రంగుకు ఒక్కొక్క స్పర్శగుణం వున్నట్లు ఋజువైంది. ఈ స్పర్శగుణం చర్మంలోనిది గాజుపలక ద్వారా రంగులను ముట్టుకున్నా ఇదే అనుభూతి కలుగుతుందని తేలింది.

కనుక ఈ స్పర్శగుణం చేతిచర్మంవల్ల కాని చేతిలోని రక్తమాంసాల యొక్క గుర్తింపులోకాని తెలుసుకోవడంలేదని ఋజువయింది. మరిదేనివల్ల ఈ కళ్ళులేని చూపు, మధ్యన గాజుపలకలు, తెరలూ పెట్టినా దళసరి అట్టలు అమర్చినా వాటి వెనుక వున్నరంగులను సరిగా గుర్తించగలుగుతోంది?

ఈ పరిస్థితులలో 'కిర్లియన్ ఫోటోగ్రఫీ' యొక్క ప్రభావంతో యీ కళ్ళులేని చూపుగల 'రోజా కులేషావా' వంటి వ్యక్తులపైన పరిశోధనలు చేశారు. అనేక సంవత్సరాలుగా లెక్కలేనన్ని పరిశోధనలు చేసిన ఫలితం ఏమంటే మానసిక శరీరంలోని సూక్ష్మశరీరం లేక దివ్యశరీరం. ప్లాస్మా శరీరం వల్ల చేతి వ్రేళ్ళద్వారా ఒక వెలుగు మబ్బువంటి యీ జ్యోతిర్మయి శరీరం కిరణాల వంటి తీగలను ప్రసరించి తద్వారా ఎదుటి వస్తువులను గుర్తించడం జరుగుతోందని తేలింది. దీనివల్ల కళ్ళులేని దృష్టి లేక దివ్యదృష్టి మనిషి శరీరంలోని సూక్ష్మశరీరంతో సంబంధించి వున్నట్లు తేలింది.

డా॥ నోవోమిస్కీ చేసిన పరిశోధనలతో ఇంకా కొన్ని విచిత్రాలు తెలిశాయి. దాదాపు 60 మంది కళ్ళకు గంతలుకట్టేసి రంగులను గుర్తించమంటే అందరూ ఒకే రకమయిన అనుభూతి కలిగినట్లు చెప్పారు. ఎరుపురంగు 'చేయి

కాలుతున్నట్లు మండుతున్నది' ఆకు పచ్చరంగు 'చల్లగా నునువు వున్నది' నీలంరంగు 'మంచులాగ అతిచల్లగా తాకింది'. (Violet) రంగు 'శీతలంగాను సూదులు పొడిచినట్లు' లాలించసాగింది. పసుపుపచ్చరంగు తాకినపుడు 'గోరు వెచ్చగా' తగిలింది. నారింజ మరింత వేడిగాను, ఎర్రటిఎరుపు ''మండి పోతున్నట్లు'' అనుభూతి కలిగింది - అని.

ఈ పరిశోధనబట్టి తేలిందేమిటంటే - ప్రతి ఒక్కరంగు స్పర్శద్వారా అంతరదృష్టికి వేరేవేరే అనుభూతిని కలుగజేస్తుంది. కొన్నిరంగులు చల్లని కొన్ని వెచ్చని అనుభూతినీ ఎరుపువంటి కొన్నిరంగులు ఉద్రేకం కలిగించేలా పిండుతున్నట్లుగానూ, ఆకుపచ్చ లేత నీలం అతి సున్నితమయిన అనుభూతినీ కలిగిస్తాయని దీని ఫలితాలను చూస్తే, ప్రాచీన భారతీయ ఋషులు రంగురంగుల రత్నాలు, కెంపులు, ధరిస్తే రకరకాల వేరువేరు ఫలితాలు యిస్తాయని చెప్పే శాస్త్రానికి వెనకాల అనేక సైన్సు రహస్యాలు దాగివున్నాయని విశదమౌతుంది.

రష్యా పత్రిక ''Life''లో వ్రాస్తూ డా॥ 'రాజ్యరామ్'! - ఇదంతా సహజంగానే ప్రతివాడికి అపనమ్మకం కలిగే విషయంకాని ఈ విషయంలో నాకెటువంటి సందేహమూ కలగలేదు. వాటిపై జరిపిన యీ పరిశోధన అంత నిర్దుష్టమైంది. ఇన్ని సంవత్సరాల నా అనుభవంలో ఏ పరిశోధనలోనూ ఇంత గొప్ప ప్రభావం మానవజాతి మీద వుండే పరిశోధన ఇంకొకటిలేదు. కళ్ళు లేకుండా చూడటం - మానవజాతి చరిత్రలోనే ఒక క్రొత్త వెలుగుబాట ఏర్పడిందన్నమాట' ఇది తలచుకుంటే ఆవేశంతో రాత్రల్లా నిద్రపట్టదు!! కళ్ళులేని వారికి యీ దృష్టి నిజంగా వరప్రసాదం వంటిదికదా!' అంటాడు డా। రాజ్యరామ్.

---

SHEVALEV, A., 'From sensational uproar to Serious Research', Translation, Journal of parapsychology Vol. 7, No. 4, 1965.

---

ఇంకొక విచిత్రమైన పరిశోధన చేశాడు డా॥ నోవోమిస్కీ బడిలో చిన్నపిల్లలమీద, జరిపిన ఈ పరిశోధనలో తేలిందేమిటంటే శిక్షణ ఇచ్చినా కానీ ఈ కళ్ళులేని చూపు నేర్చుకోవడంలో చిన్నపిల్లలకు వచ్చినంత త్వరగా ముసలివాళ్ళకు రావడం లేదు. దీనికి కారణం ముసలివాళ్ళకి ధృడంగా ఏర్పడిపోయిన విశ్వాసం - మనకు చూడటం అసాధ్యం అన్న ఆలోచనే! చిన్న పిల్లలకు ఇటువంటి విశ్వాసం లేకపోవడంవల్ల క్రమక్రమంగా చేతి వేళ్ళతో చూడగలిగే శక్తిని సంపాదిస్తున్నారు. ముసలివాళ్ళు వస్తువులను నునుపు, గరుకుతనాన్నీ బట్టి అంటే చర్మంలోని స్పర్శ జ్ఞానంద్వారానే, వస్తువులు గుర్తుపడుతున్నారు. కాని, అన్ని రంగులు ఒకే రకమైననునుపయిన కాగితంమీద ముద్రిస్తే వేరువేరు రంగులు గుర్తించలేకపోతున్నారు. అంటే ళ్ళు కేవలం చర్మంలోని స్మర్శజ్ఞానాన్ని పరిశీలిస్తున్నారు కాని చేతివేళ్ళలోని వ్యశక్తికి అలవాటు చేసుకోలేకపోతున్నారు. అతికష్టంమీద కొందరికి మాత్రం సాధ్యపడింది.

''నోవోమిస్కీ'' చేసిన పరిశోధనలో కేవలం రంగులను గుర్తించడం కాకుండా స్పర్శతో పెద్దపెద్ద అంకెలు గుర్తుపట్టడం కూడా జరిగింది. అందులో 16904, 736094 వంటి పొడుగాటి సంఖ్యకూడా చేతిస్పర్శతో గుర్తుపట్టడం జరిగింది. అంతేకాకుండా గుడ్డివాళ్ళను ఎక్కువ కాంతిగల గదులలో వుంచితే ఈ దృష్టి తేలికగా పెరుగుతుందని తేలింది. అలాగే ఇంకొక గుడ్డివ్యక్తికళ్ళ నరాలను ఆపరేషన్ చేసి తీసిపారేసిన తరువాత ఆ కుర్రవాడి నుదుటికి ఎదురుగా ఒక భూతఅద్దం లేక 'లెన్స్' వుంచితే, దానిద్వారా తన ముఖంమీద పడే కాంతిని దాని రంగులను గుర్తించగలిగాడు. అంటే కనుపాపలోని 'లెన్స్'లేక పోయినా బయటి 'లెన్స్'ని ఉపయోగించి రంగులను గుర్తించగలిగినట్లు తేలింది. అన్నిటికన్న విచిత్రమేమంటే కళ్ళు లేని వాళ్ళు చూసే అక్షరాలు సరిగ్గా కనబడకపోతే వాళ్ళు నుదురుపైన కళ్ళజోడువంటి అద్దాలు బిగిస్తే ఆ ఎదురుగుండా కనిపించే అక్షరాలు ఇంకా చక్కగా కనిపించాయని ఈ పరిశోధనలవల్ల తేలింది.

వందల మంది కళ్ళులేని పిల్లలను ఈ శిక్షణద్వారా 'రోజాకులేషావా' వంటి దివ్యదృష్టిగల వ్యక్తులు అభ్యాసంలో ఈ శక్తిని వారికి కూడా అలవాటు చేయడం జరుగుతున్నది. దీని ఫలితంగా రష్యాలో గుడ్డివాళ్ళ పాఠశాలలో ఈ "కళ్ళులేని చూపు"తోనే విద్యాభ్యాసం, చదువు చెప్పడం ప్రారంభించారు. ఇది విద్యావిధానంలోనే ఒక అపూర్వమైన విప్లవాత్మకమైన మార్పు. 'బ్రెయిలీ' స్కూళ్ళలో ఉబ్బెత్తుగా అచ్చువేసిన పుస్తకాలు అవసరం లేకుండానే కళ్ళులేని ఈ దృష్టితో ఎదురుగుండా వున్న వస్తువులను 'చూడటం' 'చదవటం' సాధ్యపడుతున్నది.

ఆశ్చర్యం! అనాడు ఎక్కడో ఒక ధృతరాష్ట్రుడు పుట్టుగుడ్డి వాడైనా దివ్యదృష్టి ప్రసాదించబడిన చూపువల్ల శ్రీకృష్ణుని విశ్వరూపం దర్శించాడంటే నమ్మలేని నాస్తిక రష్యాలో ఇంటింటా ఒక ధృతరాష్ట్రుడు. ప్రతి గుడ్డివాడు ఒక దివ్యదృష్టిని సంపాదించుకోవడం ఆశ్చర్యంకదూ!

అదేనేమో కలియుగం అంతం అనడం అంటే!



10

# రష్యాలో - 'దూరశ్రవణం'

మహాభారతంలో వ్యాసమహర్షి తాను హిమాలయపర్వతాలలో కూర్చుని కళ్ళుమూసుకొని ధ్యానిస్తూ - ఎక్కడో కొన్ని వందలమైళ్ళదూరాన కురుక్షేత్రంలో జరుగుతున్న సంఘటనలను దివ్యదృష్టితో దర్శించాడని చదివినప్పుడు మన భారతీయులే వేళాకోళంగా నవ్వడం, ఈనాడు చదువుకున్నామనే కొందరు అహంకారుల తెలివితేటలకి గుర్తు. అందులోనూ నాస్తికులు. భౌతికవాదులూ ఇంకా కమ్యూనిస్టు సిద్ధాంతాలను నమ్ముతున్నామనే మూఢచారపరులకు తెలియదు - ఈనాడు సోవియట్ రష్యాలో ఇదే శక్తులు రష్యన్ సైంటిస్టుల పరిశోధనలవల్ల యదార్థమని సరిగ్గా 50 సంవత్సరాల క్రిందటే ఋజువైనాయని!

ఆశ్చర్యమా? లేక విచారమా? తాము పెద్ద కమ్యూనిస్టులమనుకొనే అనేకమంది బజార్లో తిరిగే కార్యకర్తలకు తెలియని అనేక అపూర్వ పరిశోధనలు అందులోనూ ఆధ్యాత్మిక విషయాలపై రష్యాలో రహస్యంగా స్టాలిన్ రోజుల

నుంచి జరుగుతున్నాయని తెలియదు. ఒక ప్రక్క పరదేశ మానసపుత్రులైన తొత్తులు రాజకీయంగా విదేశాలకు అమ్ముడుపోయిన ప్రచార యంత్రాలైన భారతీయులు. మన పురాణాలైన రామాయణ, మహాభారతాలను వేళాకోళం చేయటం, దూషించడం, నీచంగా మాట్లాడడమే పవిత్రకార్యమని భావించే వారకాంతలవంటి మన తెలుగు రచయితలలో చాలామందికి రష్యాలోని ఈ ఆధ్యాత్మిక పరిశోధన గురించి తెలిస్తే ఇక ముందైనా కనువిప్పు కలుగుతుందని ఈ అధ్యాయంలో పురాణాలలో వర్ణితమైన దూరదృష్టి, దూరశ్రవణాల గురించి రష్యాలో ఏం జరుగుతోందో వివరిస్తాను.

ప్రాచీన ఋషులు ఆధ్యాత్మిక సాధనవల్ల లభించే 'దూరదృష్టి' 'దూరశ్రవణం', 'దివ్యదృష్టి' అనే మూడు అంశాలు ప్రత్యేకంగా వర్ణించారు. అడుగడుగునా, 'దూరదృష్టి' అంటే తానున్న చోటు నుంచి కొన్ని మైళ్ళ దూరంలో జరిగే సంఘటనలను చూడగలగటం! అలాగే వినగలగటమే దూరశ్రవణం', జరగబోయే భవిష్యత్తును టెలివిజన్ చిత్రాలలాగా చూడగలగటం 'దివ్యదృష్టి'!

ఫిబ్రవరి 1968లో రష్యన్ సైంటిస్టు ''పేవెల్ నావ్మోవ్'' (Pavel Noumov) దూరదృష్టితో సంబంధించిన పరిశోధనా రహస్యాలు అన్న రీసెర్చి రిపోర్టు (Research Report)లో అనేక పరిశోధనలు వివరించాడు. ఇలా పరిశోధించిన విషయాల్లో తల్లిదండ్రుల యొక్క బాధ పిల్లలకు ఆధ్యాత్మికంగా కనబడ్డం గురించి పరిశోధన చేశారు. ఒక రోజున మాస్కో యూనివర్సిటీ స్థాపకుడైన 'నిఖైలోమోనోసోవ్' (Nikhil Lomonosov) ఒక విచిత్రమైన కలకన్నాడు. అది పిల్లవాడైన తన తండ్రి గురించి వచ్చిన కల, అందులో నిఖైల్ (Nikhil) వృద్ధుడైన తన తండ్రి భయంకరమైన తుఫాను గాలిలో కొట్టుకు పోతున్నట్టూ, ప్రవాహంలో మునుగుతూ తేలుతున్నట్టు చూశాడు. ఉధృతమైన కెరటాలు తన తండ్రి ఎక్కిన పడవని విసురుగా తోసుకుంటూ దూరంగా సూదుల్లాగ పొడుచుకు వచ్చిన కొండరాళ్ళవైపు పడవను తోసుకుంటూ

వెలుతోంది. అది నరమానవుడు కనిపించని నిర్మానుష్యమైన లంక - మెరుపులాగ పగిలిన పడవ! అనే ఆలోచన అతని మెదడులో దూసుకుపోయింది. తృళ్ళిపడి లేచాడు. మేలుకోగానే తన కంగారు ఆతృత సర్దుకున్నాక - ఈ కలదూరాన ఎక్కడో ఆపదలో చిక్కుకున్న తన తండ్రి మనస్సు నుంచి తనకి అందజేస్తున్న ఒక 'మానసిక తంతివార్త' (Mental Telegram) అని సైంటిస్టు 'లోమోనోసావ్'కి (Lomonosov) వెంటనే తట్టింది. ఆ సమయంలో నిఖైల్ జర్మనీనుంచి తన ఇంటికి ప్రయాణంచేస్తూవుంటే మార్గమధ్యంలో ఈకల వచ్చింది.

నిఖైల్ (Nikhil) పీటర్సు బర్గు (Peters Berg) చేరగానే సరాసరి తన సోదరుని చూడ్డానికి వెళ్ళేడు. అతడు నిఖైల్ తండ్రి పడవలో వెళ్ళిన భోగట్టా తెలిసి 4 నెలలయిందని చేప్పేడు. నిఖైల్ ఆదుర్దాగా అక్కడున్న పల్లెవాళ్ళ దగ్గరికి పరుగెత్తాడు. మారుమూల వున్న తన పల్లెకు వెళ్ళి పడవల మీద వెతకమనీ, దయచేసి తన తండ్రికి సరైన సమాధైనా జరిగేటట్టు చూడమని ప్రార్థించేడు దుఖంతో. తన తండ్రికి సహాయం అందేటప్పటికి సమయం మించిపోయి, మరణించడం జరుగుతుందేమోనని వారిని బ్రతిమాలుకున్నాడు. చివరికి ఆ పల్లెవాళ్ళు నిఖైల్ కోరినట్లే పడవలమీద వెతకగా, అతని ముసలి తండ్రి సరిగ్గా కలలో కనిపించిన లంకదగ్గర, పడవరాళ్ళను కొట్టకొని మరణించి ఉన్నాడు. ప్రపంచ ప్రఖ్యాత పండితుడైన, మాస్కో యూనివర్శిటీ స్థాపకుడు నిఖైల్ (Nikhil) తండ్రికి ఆ పల్లెవాళ్ళు యధావిధిగా సమాధి ఏర్పాటు చేశారు. దీనితో దివ్యదృష్టిపైన పరిశోధన రష్యాలో ఒక కొత్త మార్గాన్ని సృష్టించిందని చెప్పవచ్చు

దానికి కొన్ని సంవత్సరాల తర్వాత 'బెర్నార్డ్ కాజిన్స్' (Bernard Kagins) చేసిన ఆధ్యాత్మిక పరిశోధనలో - తల్లి తన శరీరంలోని రోగలక్షణాలనీ, బాధలనీ మనస్సుద్వారా దూరంగావున్న తన కుమార్తెకు ప్రసారంచేసిన పరిశోధన చెప్పేవి వున్నవి. ఒక రష్యన్ స్త్రీ గర్భవతిగావుంది. అకస్మాత్తుగా ఆమె కడుపులో విపరీతంగా పోట్లు ఆరంభం అయినాయి. చూడబోతే శరీరంలో ఈ

పోట్లుకుగాని గర్భవతిగావున్నట్లు కలిగే బాధకుగాని ఆరోగ్యరీత్యా ఏ కారణం లేదనీ తెలిసింది. తర్వాత కాజిన్స్‌కి పరిశోధనలో వెల్లడైన చిత్రం అందరినీ ఆశ్చర్యపరిచింది. ఎందుకంటె సరిగ్గా అదే సమయానికి 1400 మైళ్ళదూరంలో ఆమె కూతురు ప్రసవవేదన పడుతూవుంటే గర్భాశయంలో ఆపరేషను చేశారు. ఆ సంగతి తెలియకపోయినా కూతురు మనస్సునుంచి టెలివిజన్ తరంగాలలాగ ప్రయాణం చేసిన దివ్యదృష్టి ద్వారా తల్లికి అనుభవం అయినాయి. కాని ఆ సమయంలో తల్లికి కూతురు గురించిగాని ఆమెకు జరుగుతున్న ఆపరేషను గురించిగాని తెలియదు.

అలానే డా॥ పేవెల్‌నావ్‌మోవ్ (Pavel Nanmov) పెళ్ళీడుకు వచ్చిన యువకులు వారు ప్రేమించిన అమ్మాయితో దూరదృష్టి ప్రసారం ద్వారా ఒకరి ఆలోచనలు ఇంకొకరికి అందటం ఒకరి హృదయంలో ప్రేమ రేడియో ప్రసారంలాగ ఇంకొకరికి చేరటం గమనించేడు. ఆయన పరిశోధించిన జంటల్లో నూటికి 40 శాతం అమ్మాయిలు, పురుషులు పంపిన మానసిక తరంగాలు గుర్తించగలిగేరు. మనుష్యులమీదే కాక జంతువుల మీదకూడా కొన్ని ప్రయోగాలు చేశారు రష్యాలో ఇందులో కుందేళ్ళు తమ పిల్లల నుంచి ప్రసారం అయ్యే మానసిక తరంగాలను గ్రహించగలగటం, వాటి మెదడులో ఏర్పాటు చేసిన ఎలక్ట్రోడ్‌ల సహాయంతో ఋజువైనాయి. పేవెల్‌నావ్‌మోవ్ (Pavel Naumov) ఈ పరిశోధన గురించి చెపుతూ - 'నీళ్ళలో మునిగిన ఒక సబ్‌మెరీన్ లేక జలాంతర్గామిలో కొన్ని కుందేలు పిల్లలను వుంచటం జరిగింది. వాటి తల్లి కుందేలును చాలదూరంలో ఒక లేబరేటరీలో పెట్టి దాని మెదడులోని సున్నితమైన ఎలక్ట్రోడ్‌లు దూర్చి కరెంటు సూచించే యంత్రానికి కలిపేరు. ఆ తర్వాత జలాంతర్గమి నీటిలో మునిగిన తర్వాత కుందేలుపిల్లలు ఒక్కొక్కటే చంపివేయబడ్డయి. తల్లికుందేలుకు దూరాన తన పిల్లలకు ఏం జరుగుతోందో

---

* 'On the Question of wordless Transmission of Information'. (Annotated Reports: 24th All Union Scientific Session- Moscow1968)

తల్లికుందేలు గమనించలేదు. అయినప్పటికీ మహాశ్చర్యం ఏమిటంటే - సరిగ్గా ఏ సెకండులో ఒక్కొక్క కుందేలుపిల్లే చంపబడిందో సరిగ్గా అదే సెకండులో తల్లికుందేలు మెదడులో తరంగాలు రికార్డు చేయబడినాయి. నిశ్చయంగా తల్లికుందేలుకి తన పిల్లల మెదడునుంచి భావతరంగాలు ప్రసారం చేయ బడటం సుస్పష్టంగా ఋజువైంది'- అంటాడు. డా॥పేవెల్ నావ్‌మోవ్ (Pavel Naumov).

సోవియట్ సైంటిస్టులు ఆలోచనల ప్రసారం గురించి చేసిన ఇలాంటి పరిశోధనలు డజన్లకొద్దీ వున్నాయి. ఒక్కొక్కటి రాస్తూపోతే అదే ఒక గ్రంథం అవుతుంది. అక్కడ జరుగుతున్న దాంట్లో ముఖ్యపరిశోధనల్లోని ముఖ్యమైన పంథాలు సూచించడమే మన ఉద్దేశ్యం.

రష్యాలో పరిశోధనల్లో ఋజువైన విషయాల్లో దూరదృష్టి దూరశ్రవణమే కాకుండా ఇంకా చిత్రమైన విషయాలుకూడ ఋజువైనాయి. ఒక వ్యక్తి మనస్సు నుంచి దూరానవున్న మరో వ్యక్తి మనస్సుకు ప్రసారంచేసే ఆలోచనాతరంగాలు బుద్ధిపూర్వకంగా ఆకలిలేనట్లు చేయటంకూడా సాధ్యమని ''ఉల్ఫ్‌మెస్సింగ్'' అద్భుతశక్తుల ప్రదర్శనలోనే కాకుండా, ఇతర పరిశోధనవల్లకూడా ఋజువైంది. మాస్కో నుంచి ఆలోచనలను లెనిన్‌గ్రాండ్ పంపవచ్చునా? అన్న పరిశోధనల్లో ఆరితేరిన ఇద్దరు ప్రత్యేకమైన శక్తికల్గిన వ్యక్తులు - కామెన్‌స్కీ, ఎలక్స్‌మోనెన్ పాల్గొన్నారు. ఒకరు మనస్సును ఆదుర్దా భయంవేసే ఆలోచనల మీద కేంద్రీకరించారు. తనకు ఊపిరాడని ఉబ్బసం వచ్చినట్లు, ఊపిరి సలపక తన కళ్ళు తిరిగి పోతున్నట్లూ, ఆలోచనలు కేంద్రీకరించాడు సరిగ్గా అవతలప్రక్క కామెన్‌స్కీకూడా అలాంటి ఫలితాలనే తన మనస్సు, శరీరంమీద పొందాడు. అంతేకాక అతని తలమీద దిమ్మెరపొయ్యే చావుదెబ్బకొట్టినట్లు అనిపించింది. కామెన్‌స్కీ ముక్కుతాను నిలిపివేసినట్లు తన ఊహాచిత్రాలు ప్రసారం చేశాడు. ఇలా పంపించిన ఆలోచనా తరంగాలను 9 సార్లు ఆగి ఆగి ప్రసారం చేశాడు. ఎన్నో మైళ్ళదూరంలో ఎటువంటి సంబంధంలేని కామెన్‌స్కీ స్పష్టంగా ఇవే ఉద్రేకభావాలు పొందాడు సోవియట్ సైంటిస్టుల కథనం ప్రకారం నూటికి

80 సార్లు★ ఈ ప్రసారము చేయబడ్డ ఆలోచనలు ఏ మార్పులేకుండా గ్రహించడం జరిగింది. మాస్కో నుంచి లెనిన్‌గ్రాడ్‌కి అనేక ఆలోచనలని కామెన్‌స్కీ నికోలాకి అందించితే అతడు సరిగ్గా వాటిని గ్రహించాడని ఈ పరిశోధనలవల్ల వెల్లడైంది. ఉత్త ఆలోచనల కంటే ఉద్రేకంతో ఆవేశంతో పంపిన భావతరంగాలను ఇంకా స్పష్టంగా గ్రహించగలిగాడని ఈ పరిశోధనలలో ఋజువైంది.



* Milan Ryzl - Researchin Telepathy in Soviet Russia' (Journal in para psychology Vol 25 No.2 (1961).

** Repetsky - Biotelegraph (Leningrad Banner April 1962)

11

# అంతరిక్షనౌకలో - 'అవతారమూర్తి'

''యూరీ....గగారిన్'' అంతరిక్షంలోకి అడుగుపెట్టిన మొదటి రష్యన్! అతడు తొలిసారిగా రష్యన్ ఉపగ్రహంలో అంతరిక్షయానం చేసివచ్చినప్పుడు రష్యన్ 'సైన్సు' సంపాదించిన చరిత్రాత్మకమైన విజయం అని ప్రపంచం అంతా జేజేలు పలికింది.

ఒక్కసారిగా మనుష్యుల ఆశలన్నీ అంతరిక్షంవైపు అర్రులు చాచాయి. కాని రష్యాలో రహస్యంగా జరుగుతున్న విచిత్రమైన పరిశోధనల్లో నూరోవంతు విజయమైనా అది ఈ 'గగారిన్' విజయాన్ని అతిచిన్నవిషయం క్రింద నిరూపించగలదు. ఈ విచిత్రమైన పరిశోధనలు ఎలాంటివో నిగూఢమైన రష్యన్ సైంటిస్టుల పరిశోధనల వెనుక దాగియున్న అగాధమైన అర్థం ఏమిటో ఇక్కడ కొంచెం పరిశీలిద్దాము.

రష్యన్ అంతరిక్ష పరిశోధకుడు ''సిమోల్కొవ్స్కి'' (K.E. Tsiolkousky) ఈ కనపడే విశాలవిశ్వంలో మన భూమియే కాకుండా ఇతర గ్రహాలమీదకూడా 'బుద్ధిజీవులు' వున్నారని ధృడంగా నమ్ముతున్నాడు. ఎందుకంటే ఆయన

పరిశోధనల్లో విచిత్రమైన వస్తువులు, ఇంకా విచిత్రమైన అనుభవాలు అంతరిక్షంలో దర్శించినవి - రష్యన్ ప్రభుత్వపు అధికార ప్రకటనలో లేని వస్తువుల క్రింద జమచేయబడ్డాయి. అంటే ఏమిటి, ఏం జరిగిందో చూద్దామా?

టైము రాత్రి 9.30 గంటలయింది. తేదీ జూలై 3, 1965! రష్యన్ అంతరిక్ష పరిశోధకులు ఆకాశంవంకచూస్తూ ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు. 'లాట్వియా' (Latvia) ప్రాంతంలో కనబడుతున్న 'వెలిగే మేఘాల'ను యంత్రసహాయంతో పరిశీలిస్తున్నారు. ఇంతలో ఉత్తరంగా ఆకాశంలో ఒక విచిత్రం కనబడింది వారికి. మిరుమిట్లు గొలిపేకాంతితో ఒక నక్షత్రం లాంటిది. నెమ్మదిగా కదులుతూ పడమటివైపుకు ప్రయాణం చేస్తున్నది. అది ఏమిటో పరిశీలిద్దామని కళ్ళకు 'బైనాక్యులర్స్' (Binoculars) పెట్టుకొని చూశారు. ఒక నక్షత్రంలాగ కనబడింది. వెంటనే దానిపై టెలిస్కోపును గురిపెట్టి బాగా పరిశీలించగా సుమారు 325 అడుగులు వెడల్పు కలిగిన ఒక 'పళ్ళెం' లాంటిది తిరుగుతూ కనిపించింది! ఆశ్చర్యపోయారు! దాని మధ్య ఒక గుండ్రని గోళంలాంటి ఎత్తయిన బొడిపె గుండ్రంగా తిరుగుతూ కనిపించింది. 'టెలిస్కోపు' బాగా గురిచేసి పరిశీలించేరు. దాని చుట్టూ గుండ్రని గోళంలాంటి ఎత్తయిన బొడిపే గుండ్రంగా తిరుగుతూ కనిపించింది. 'టెలిస్కోపు' బాగా గురిచేసి పరిశీలించేరు. దాని చుట్టూ గుండ్రని గోళాలు మూడు, ఆ పళ్లెంచుట్టూ తిరుగుతున్నాయి! చూస్తుండగానే 'ముత్యంరంగు - ఆకుపచ్చ' కాంతిలో వెలుగుతూ భూమినుంచి దూరంగా పోతూ క్రమంగా చిన్నదిగా కనబడసాగింది. ఇలా 20-నిముషాలు పరిశీలించిన తర్వాత దానిలోవున్న గోళాలు విడిపోయి వేరే మార్గాల్లో ఎగిరిపోయాయి. రాత్రి 10 గంటలు అయ్యేసరికల్లా అన్నీ పూర్తిగా అదృశ్యమైపోయాయి. వాళ్ళు కొలచిన కొలతలూ లెక్కలనుబట్టి చూడగా ఆ విచిత్రమైన 'ఆకుపచ్చరంగు గోళాలు' భూమికి 165- మైళ్ళ ఎత్తున ఎగురుతున్నట్లు తేలింది. 'టుగారినోవ్' (Tugarinov)

---

* Unidentsfied Flying Objects-by Felix Ziegel (Soviet Life - Feb. 1968)

అంటాడు - ఆ ఎగిరేపళ్ళాలు తిరిగే వేగాన్నిబట్టి చూడగా, అవి ఆకాశంలో నిలిచి, కదలిక లేకుండా తిరుగుతున్నాయి! అరగంటలో మాకు కనిపించిన కదలిక చూస్తే చివరికి అది మన భూమి యొక్క తిరగటంవల్ల యేర్పడ్డ చలనమేనని తెలింది.

ఏమిటీ వింతవస్తువులు? ఎక్కడినుంచి వస్తున్నాయి? ఇవి అంతరిక్ష నౌకలా? ఇతర గ్రహాల నుంచి పంపబడి భూమిమీద జీవుల గురించి పరిశోధన చేయడానికి వచ్చిన యంత్రాలా? ఇలాంటి దృశ్యాలు అమెరికాలోనూ, ఇంగ్లండు, ఆస్ట్రేలియాలోను మరికొందరు చూడటం తటస్థించింది. కొద్దిపాటి తేడాతో అందరు వర్ణించినవీ ఒకే తీరుగా ఉన్నాయి - దూరాన వెలిగే నక్షత్రాలలాగ ఆరంభమై నెమ్మదిగా అవి కదులుతూ దగ్గరగా రాగానే రివ్వున విష్ణుచక్రంలా తిరిగే ఒక ''ఎగిరే పళ్ళెమూ'' దాని మధ్య ఒక గుండ్రని గోళాకారమూ తిరుగుతున్నట్లుగా రంగురంగులకాంతులతో ఎరువు, నీలం, ఆకుపచ్చ రంగులు చిమ్ముతూ ఆకాశంలో అరక్షణంలో రివ్వున దూసుకుపోయి కనిపించకుండా పోతాయి. ప్రపంచంలోని ప్రభుత్వాలు అనేకసార్లు పత్రికలలో చేసిన అధికార ప్రకటనలు చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది! అలాంటి ఎగిరే పళ్ళాలు యేమీలేవని- ఉండవనీ! అవి బహుశా చూసేవాళ్ళ భ్రమ అని కూడా!! ఆకాశంలో వెలిగే వెలుతురు చూచేవాడి భ్రాంతి అంటూ ఎన్నో ప్రకటనలు చేస్తున్నారు. రోజురోజుకీ ఎగిరే వస్తువులను-వాటిపేరు గుర్తు తెలియని వస్తువులు U.F.O. * (Un Identified Flying Objects) అని మరికొందరూ వాటిని ''ఎగిరే పళ్ళాలు'' (Flying - Saucers) అని ఇంకొందరూ వర్ణించడం నానాటికీ ఎక్కువ అవుతున్నది. ఇవి చూచిన వాళ్ళు ఎక్కువ అయినకొద్దీ ఈ విషయాలను రహస్యంగా వుంచాలనే తాపత్రయంతో 'అలాంటివేమీ లేవని' చేసే ప్రకటనలు కూడా ఎక్కువ అవుతూ వచ్చాయి!

ఆ రోజు రాత్రి 11- గంటలవుతుంది! తేదీ ఆగస్టు 16,1960 'లెనిన్‌గ్రాడ్' పట్టణం దగ్గర క్యాంపువేసిన ఎనిమిది మంది 'జియోఫిజికల్

సైంటిస్టులు' (Geophysical Sientists) జట్టుగా 'కజక్‌స్థాన్' (Kazakhstan) పర్వతాలలో నడుస్తున్నారు మాట్లాడుతూ, దూరాన కొండ శిఖరాలపైన వెలిగే లైటులా మిరుమిట్లు గొలిపే ఆరంజిరంగు కాంతిగల వస్తువేదో కనిపించింది. అది రెండువైపులా ఉబ్బెత్తుగా నున్న భూతద్ధం లేక 'లెన్సు' (Lens) ఆకారంలో వుంది, అది రివ్వుమని కొండలపైగా ఎగిరిపోతోంది. ఆ జట్టుకు నాయకుడైన 'డా॥ నికోలాయి సోఖెవాసొ' (Dr॥ Nicholoy Sochevasov) ఆ వస్తువును పరిశీలించి ఆ విచిత్రమైన ఎగిరే, వెలుతురు చిమ్మే ఆకారం చంద్రునికంటె రెండురెట్లు పెద్దసైజులో వుందని - హెచ్చు తగ్గులు లేని ఒకే స్పీడుతో అది ఉత్తరంగా ఎగిరిపోతోందని గమనించాడు. ఇంతలోకే చూస్తుండ గానే ఆరంజిరంగు కాంతులతో ఆ పళ్ళెం కనిపించి చటుక్కున దక్షిణంగా క్రిందవైపు మళ్ళీ కుడివైపుగా అర్ధచంద్రాకారంగా పల్టీకొట్టి కొండల వెనుక అదృశ్యమయిపోతుంది. 'తిరిగే ఆ పళ్లెం అంచులు చీకట్లో కాంతితో వెలుగుతున్నట్లు కనిపించేయి' అని 'ఫెలిగ్స్ జీగెల్' వ్రాశాడు.

కాక్‌సస్ (Caucaces) పర్వాతాల్లో ప్రయాణిస్తున్న వేరే కొందరు సైంటిస్టులు, ఒక జట్టుగా పోతూ ఆకాశంలో ఒక వెలిగే వస్తువు ఎగురుతూ ఆరెంజిరంగు కాంతితో వెలుగుతూ పోవటం గమనించారు. ఆ జట్టు నాయకుడు డా॥ V.G. క్రైలో (Dr॥ V.G.Kryloe), ఆ ఎగిరే వస్తువు ప్రయాణం చేసే తీరు, చుట్టలు చుట్టలుగా ఒక స్ప్రింగులాగ ప్రయాణిస్తూన్న దాని పళ్ళెం రంగు ఆరంజి - ఎరుపునుంచి లేత నీలం, ఆకుపచ్చగా వెలుగుతూ, ఎక్కువగా వెలిగే లేత నీలితెలుపు లైటులాగ కనిపించిందని వ్రాశాడు. ఇంతమంది సైంటిస్టులు చూసిన వస్తువులు అసత్యం ఎలా అవుతాయి? ప్రభుత్వాలు మటుకు 'U.F.O' లనేవి లేనేలేవని ఎంతో గట్టిగా నొక్కి ప్రకటనలు చేస్తున్నాయి. ఇందులో సోవియట్ ప్రభుత్వం అమెరికా ప్రభుత్వము అనుసరిస్తున్న వైఖరి ఒక్కటే, ఎందుకీ రహస్యం? యేమిటీ ఎగిరేపళ్ళాలు? అవి చూచేవారి భ్రాంతియేనా? లేక ఆకాశంలోంచి ఎగురుతూ ఇతర గ్రహాల

నుంచి బయలుదేరిన అంతరిక్షనౌకలా? అందులోని వాళ్ళు మనలాంటి మనుష్యులేనా? లేక మనకంటే ఎంతో అభివృద్ధి చెందిన సైంటిస్టులా? ఎవరేమి చెప్పినా ఎన్ని ప్రభుత్వాలు కాదంటున్నా ఇవి కనబడుతూనే ఉన్నాయి.

అన్నిటికంటె వింత అయిన అనుభవం ఒక రష్యన్ విమానంలో ప్రయాణించే వైమానికులకు తారసపడింది! అది 1964వ సంవత్సరం. లెనిన్‌గ్రాడ్ నుంచి మాస్కో వెళుతున్న ఆ విమానంలో నిండుగా కిటకిటలాడుతూ ప్రయాణం చేస్తున్నారు. ఆ విమానం నెంబరు 'Tu-104A' అని రెక్కలపైన వ్రాసివుంది. ప్రయాణీకుల్లో ప్రఖ్యాత రష్యన్ పరిశోధకుడు, ఎగిరే పళ్ళాల గురించిన సైంటిస్టు నిపుణుడు అయిన 'జైట్సేవ్' (Zaitesev) కూడా ప్రయాణిస్తున్నాడు. విమానం కిటికీలోంచి చూస్తున్న వారిలో ఒకరు అకస్మాత్తుగా వెలుతున్న వస్తువేదో విమానం ప్రక్కగా ఎగురుతూ పోవటం చూశారు! అందరూ అటే తిరిగి చూశారు. అది వెలుగుతూ రాసాగింది. శరవేగంతో తిరుగుతున్న ఒక పళ్ళెం నీలికాంతితో వెలుగుతోంది. దాని మధ్య ఒక గుండ్రని ముత్యంలాంటి గోళాకారం, తన చుట్టూ తాను తిరుగుతోంది! ఇది చాలా సేపు విమానాన్ని తరిమి, దానికూడా వెంటబడి ప్రయాణించి, చూస్తూండగానే గెంతి గుండ్రంగా తిరిగి తిరిగి అదృశ్యమయింది! ఇటు వంటిదే 'గ్రీన్‌ల్యాండ్'లో పేరుకుపోయిన మంచుత్రవ్వుతూ అక్కడ పనిచేస్తున్న ముఖ్య అంతరిక్ష నావికుడూ రష్యన్‌పైలట్ అయిన 'వేలంటిన్ ఆక్కురాటోవ్' 1956లో చూడడం! అలానే ''డా॥ ల్యూడ్మిలా'' కూడా 1965లో స్పష్టంగా చూశారు. వీరు ఒక్క విషయాన్ని ధృవపరచారు. ఈ ఎగిరే పళ్ళాలు లేక గుర్తుతెలియని ఎగిరే వస్తువులు ఊహించరాని వేగంతో దూసుకుపోయేవి. మానవుడికి తెలిసినంతవరకు ఏ విమానమూ లేక అంతరిక్షనౌక అంతటి అసాధ్యమైన వేగంతో పోలేదు.

ఇలాంటి అనుభవాలెన్నో కలబోసుకొని అనేక మంది సైంటిస్టులు రష్యాలో ఒక అగ్రస్థాయి సమావేశాన్ని 1967లో ఏర్పరచారు. దానిలక్ష్యం

''అంతరిక్షంలోని ఇతర ప్రాణులు'' అన్న అంశంపై చర్చలు జరిగేయి. అందరిలోనూ అగ్రనాయకుడైన 'విక్టర్ అంబర్ట్సుమియమ్' (Dr॥ Victor Ambartsumyam) ఈ సమావేశం సారాంశాన్ని ఇలా వ్యక్తం చేశాడు - మన భూమ్మీద వున్న ప్రాణులవంటి తెలివిగల జీవులే అంతరిక్షంలో దూరానవున్న గ్రహమండలాలలో వున్నట్లు నిశ్చయంగా ఋజువైనట్లు భావించగల ఆధారాలు కనబడుతున్నాయి. ఈ జీవులు టెలిస్కోపులో దూరంగా కనబడే 'పాలపుంత' (Milky way) సమీపంలోని 'గెలాక్సీ' (Galaxy)లో వుండవచ్చు. ఈ జీవులకు సంబంధించిన అనేక సమస్యలు సైంటిఫిక్ విషయాలు సాంకేతిక వివరాల గురించి అతి త్వరలోనే, వెంటనే పరిశోధనలు జరగాలి. ఈపాటికి అలాంటి పరిశోధన ఆరంభించాలి' - అని.

ఆరంభించనే ఆరంభించింది నిజంగానే! అది మొదలుపెట్టిన రష్యన్ పరిశోధకులలో మొదటిపేరు డా॥ ఫెలిక్స్ జీగెల్ (Dr॥ Felix Zioegel)ది! ఆయన 1967లో ప్రచురించిన 'రీసెర్చి వ్యాసం - ''గుర్తు తెలియని ఎగిరే వస్తువులు (UFO's)- అవి ఏమిటి? అన్న పేరుతోనే రష్యాలో సంచలనం కలిగించింది. దీని తర్వాత ఇంకా వివరాలతో ''గుర్తుతెలియని ఎగిరే వస్తువులు'' అనే తర్వాత రీసెర్చివ్యాసం డా॥ జీగెల్ తన పరిశోధనలను 'సోవియట్ లైఫ్' (Soviet Life) అన్న పత్రికలో ఫిబ్రవరి 1968లో ప్రచురించాడు.

డాక్టర్ 'ఫెలిక్స్ జీగెల్' కేవలం అకాశంలో ఎగిరే ఈ వింతవస్తువుల గురించి పరిశోధించటంతో ఆగలేదు. దాంట్లో వున్న జీవులు భూమ్మీది మానవులు కాదనీ, ఇతర గ్రహమండలాలనుంచో మరో విశ్వంనుంచో వచ్చిన సంస్కృతికి సంబంధించిన సైన్సుయుగం నిపుణులు పంపిన అంతరిక్ష నౌకలే ఈ 'ఎగిరేపళ్ళేలు' (Flying Saucers), అని భావించటమేగాక ఆ జీవులతో సన్నిహిత సంబంధం పెట్టుకోటానికి 'అతి మానసిక శక్తులూ' 'ఆధ్యాత్మిక శక్తులూ' ఉపయోగించవచ్చుననీ, వివరిస్తూ ఆయన 1967 మార్చి 13న మాస్కో (Mascow)లో ఏర్పాటు చేయబడిన ఇంజనీర్ల ఇన్స్టిట్యూట్

ఆధ్వర్యంలోని సెమినార్‌లో తన రీసెర్చి వ్యాసాన్ని చదివాడు. 'మానవుడిలోని దివ్యశక్తుల గురించి అప్పటికే రష్యాలో పరిశోధనల ద్వారా బలపడిన ఆలోచనలను చదివేశక్తిని - ఈ అంతరిక్ష నౌకలలో వచ్చే జీవులతో 'మానసిక-సంభాషణ' చేయువచ్చునని తెలిపే తన అద్భుతమైన సిద్ధాంత వ్యాసం (Thesis)ను చదివాడు డాక్టర్ 'ఫెలిక్స్ జీగెల్'.*

డా॥'జీగెల్' చేసిన ఆశ్చర్యకరమైన పరిశోధనలు అమెరికాలోని సైంటిస్టులను నిజంగానే కంగారు పెట్టేశాయి. అమెరికాలోని అంతరిక్ష పరిశోధకుడూ, UFO-లపై నిపుణుడూఐన డాక్టర్ 'ఎల్లెన్ హైనెక్' (అమెరికా అంతరిక్షశాఖ ఛైర్మన్), రష్యనులు చేస్తున్న తీవ్రమైన ఈ 'గుర్తుతెలియని వస్తువుల'పైని పరిశోధన గురించిరాస్తూ, ఇలా అంటాడు. రష్యన్లు UFOల రహస్యాన్ని భేదించారు అన్న తన రిసెర్చి వ్యాసంలో - 'ఏదో ఒకరోజున అకస్మాత్తుగా మనం 'న్యూస్'లో వింటాం. రష్యను సైంటిస్టులు ఈ 'గుర్తుతెలీని ఎగిరే వస్తువుల' గురించిన రహస్యం తెలుసుకున్నారని! అంతేకాదు వారు దూరానవున్న గ్రహమండలాలలోని జీవులతో కూడా సంబంధం పెట్టుకున్నారనీ, ఆ ఇతర గ్రహాలలో వుండే జీవులతో కూడా సంబంధం పెట్టుకున్నారనీ, ఆ ఇతర గ్రహాలలో వుండే జీవులు మన భూమిచుట్టూ అంతరిక్షంలో గస్తీ తిరుగుతూ వున్నారని కూడా బైటపడవచ్చు.

ఒకవేళ ఇలాంటి అత్యాశ్చర్యమైన వార్త గనుక పేపర్లో పడితే దాన్ని ఆశ్చర్యం అంతా ఇంతాకాదంటాడు, డా॥ ఎల్లెన్! దానితో పోలిస్తే 1957లో రష్యన్లు 'స్పుట్నిక్' ఉపగ్రహాన్ని ప్రయోగించిన నాటి చారిత్రాత్మక విజయం కూడా, రష్యాలో గోధుమలు హెచ్చుపంట పండిందనే వార్తకంటే ఏమంత

* ZIEGEL, Felix, 'On Possible Exchange of information with Extra Terrestrial Civilizations' Paper presented: Seminar on Parapsychology and Higher Civilization, held by Technical Parapsychology Section affiliated All Union Engineering Institute, Moscow, March 13 '1967.

విలువైందికానంత చిన్నదయిపోతుంది - ఈ అంతరిక్ష విజయం ముందు!' అంటాడు తన రీసెర్చి వ్యాసంలో!

ఇలా ఎల్లెన్ ఇంత ఆశ్చర్యపడటానికి కొంత కారణం లేకపోలేదు! ఎందుకంటే, ఇంతవరకూ జరిగిన అంతరిక్ష పరిశోధనలలో ఎక్కడా కూడా మానవుడిలోని దివ్యశక్తులూ అతీంద్రియశక్తుల (ESP)వంటివి, ఉపయోగించటం జరుగలేదు! కాని రష్యలో ఈ మధ్య విపరీతంగా పెరుగుతున్న ఈ దివ్యశక్తులున్న సైంటిస్టులూ 'ఉల్ఫ్‌మెస్సింగ్', 'మిఖైలోవా' వంటి అతీంద్రిత శక్తులు కలవాళ్ళెందరో-ఈ అతి రహస్యంగా రష్యాలో జరిగే అంతరిక్ష పరిశోధనలలో ప్రత్యేకించి ఈ 'అతీంద్రియశక్తులూ' 'దివ్యశక్తుల'నే ఉపయోగి న్నారు గనుక! ఇందులో మనకి తెలిసిందానికన్నా తెలియనిదే జాస్తి! ంతేకాదు- ఆకాశంలో ఎగిరే ఈ గుర్తుతెలియని వస్తువుల గురించి భుత్వాలు చాలా రహస్యంగా వుంచడంలో అర్థం ఇదేనా? సమాధానం 'జీగెల్' (Ziegel) వంటి వాళ్ళూ 'జైట్సేవ్' (Zaitsev) వంటి పరిశోధకులే ఇవ్వాలి!

ఇచ్చారుకూడా! డాక్టర్ జీగెల్ చెప్పినదానిని బట్టి చూస్తే రష్యాలో ఇప్పటికే - అంతరిక్షంలో 'ఎగిరే ఈ పళ్ళేలను' ఫొటో తీయడానికి వేరే ప్రత్యేకం, కెమేరాలు కూడా కనిపెట్టారు!! ఉపయోగిస్తున్నారు కూడా! అంతేకాదు ఈ పరిశోధన కేవలం యంత్రాల పరిశోధనతో తేలేది కాదంటాడు డా॥జీగెల్. ఇందులో దివ్యశక్తులను ఉపయోగించి, ఇతర ఆలోచనలను చదవగలిగే శిక్షణ పొందిన ప్రత్యేక వ్యక్తులను ప్రయోగించి ఇతర గ్రహాలనుంచి వచ్చే ఆ జీవుల ఆలోచనలూ వారి ప్రణాళికను పసిగట్టాలి - వారితో మనస్సుతోనే ఆలోచన ద్వారానే మాట్లాడాలి అంటాడాయన! అమెరికన్ సైంటిస్టు 'ఎల్లెన్' ఆదుర్దాలోని అంతర్యం ఇదే!

అలాంటి 'మనస్సుల కలయిక' సాధించగానే పైగ్రహాల జీవులతో ఏం మాట్లాడాలో తన ప్రసంగాన్ని కూడా సిద్ధం చేసుకున్నాడు. డా॥ జైట్సేవ్.

ఇదేగాక డా॥ జైట్సేవ్స్ అంతరిక్షనౌకల మీద జరిపిన పరిశోధన ఇంకా వింతగా వుంటుంది. గతంలో ఎప్పుడైనా ఇలాంటి 'ఎగిరే పళ్ళాలు' (Flying Saucers) లేక 'గుర్తుతెలియని ఎగిరే వస్తువులూ' (UFO's) భూమికి దిగినట్టు సాక్ష్యాలు చరిత్రలోగాని ప్రాచీనకాలంలో వారి అనుభవాన్నిచ్చే గ్రంధాలు ఏం చెబుతాయో నిగ్గు తేల్చుకొని వాటి సాయంతో ఇప్పటి ఈ ఎగిరే అంతరిక్ష వస్తువులతో సంబంధం పెట్టుకోవాలన్న ఈ పంథాలో నడిచింది 'జైట్సేవ్ ప్రయోగాల పరిశోధనంతా'.

ప్రాచీన గోపురాలూ, గుడి, మసీదు, చర్చి వంటి కట్టడాల పైకప్పుయొక్క పనితనం అంతా ఈ అంతరిక్షనౌకల నిర్మాణానికి ముతకా చేసిన రూపకల్పన అన్న నిర్ధారణకొచ్చాడు. 'జైట్సేవ్' తన 'దేవాలయాలు - అంతరిక్షనౌకలు అన్న బృహత్తర పరిశోధనా గ్రంధంలో.

అందులో ఆశ్చర్యకరమైన విషయం. బహుశా ''జైట్సేవ్'' కూడా ఊహించని విశేషం ఏమిటంటే సంస్కృతంలో గోపురాలలాగ గుడిపైన వుండేదానికి (ఆలయ విమానం) అనే పేరు- ఆకాశంలో ఎగిరే 'విమానం'కు గూడా అదే పేరు వుండటం (పుష్పక విమానం) అతని వాదానికి మరింత బలాన్ని చేకూర్చుతున్నది.

'జైట్సేవ్ (Zaitsev) తన రిసెర్చి గ్రంథమైన ''Temples and Spaches'' అన్న గ్రంథంలో - 'ఆకాశంలోంచి దేవతలు' (Gods from Sky) అన్న సిద్ధాంతానికి ఋజువుగా ప్రతిదేశంలోని ప్రాచీన గ్రంథాలలోచూసినా, ఈ దేవతలు నక్షత్రాలలోంచి దిగివచ్చినట్టే వుందంటాడు. హిందువుల విష్ణువు రెక్కలతో ఎగిరే గరుడునితో - బ్రహ్మదేవుడు (సృష్టికర్త) హంసమీదనూ - గ్రీకుల దేవత 'జీయుస్' (Zeus) మేఘాలమీద వచ్చినట్టూ అందరూ అంతరిక్షనౌకల మీదనే వచ్చిన దేవుళ్ళు. (అంటే అసాధారణ విజ్ఞానం సైన్సుయొక్క అస్త్రాలూ కలిగిన బుద్ధిజీవులు) అన్న సిద్ధాంతం రష్యాలో బాగా పాతుకుపోయింది. అసలు ఈ భూమిమీద మనకీనాడు కనబడేదంతా విజ్ఞానం,

గణితం, ఖగోళం, నగర నిర్మాణం, వ్యవసాయం, యుద్ధం - అంతా యీ ఇతర గ్రహమండలాల్నుంచి వచ్చిన 'దేవుళ్ళ'దే. జైట్సేవ్ పరిశోధన ప్రకారం బైటగ్రహాల నుంచి ఈ బుద్ధిజీవులు భూమిమీదకు ఇదివరకు కనీసం రెండుసార్లన్నా వచ్చి వుండాలి. ఈ దృష్టితో భూమిమీద మానవుడి చరిత్ర జాగ్రత్తగా పరిశోధిస్తే కొన్ని ''క్లూ'' (Clues)లు ఈ అంతరిక్షనౌక భూమికి వచ్చిన సాక్ష్యాలు దొరకవచ్చు. ప్రాచీన శిథిలాలూ, మెక్సికో, ఈజిప్టు, బాబిలోనియా, చైనా, భారతదేశం, టిబెట్టు వంటి దేశాలలో అతి పురాతనమైన త్రవ్వకాలలోనూ ప్రాచీన సంస్కృతినాటి గ్రంథాలలోని పురాతన చరిత్రలోనూ దీనికి సంబంధించిన ఆధారాలు దొరకవచ్చునం- కాదు తప్పక దొరుకుతాయంటాడు, రష్యన్ సైంటిస్టు 'జైట్సేవ్'.

'వెలికోవ్స్కీ' (Velikovsky) ప్రకారం రామాయణకాలం నాటి ప్రపంచం ఈనాటి మన అణుయుగం కన్న ఎంతగానో సైన్సును వృద్ధిచేసిన కాలం. రామాయణంలో 'పుష్పకవిమానం' గుండ్రంగా, పుష్పంలాగా వర్ణించడం చూస్తే ఇది అంతరిక్షంలో ప్రయాణించేసే వ్యోమనౌక అని తెలుస్తుంది. ఇలా గుండ్రంగా 'ఎగిరే పళ్ళెల' (Plying Saucers)ను ఇటీవల అనేకులు ఆకాశంలో రష్యా, అమెరికాలలో ఫొటోలు తీశారు. ఇవి అణుశక్తి నౌకలు' ఎర్రని కాంతితో మెరుస్తున్నాయి. రామాయణంలో 'పుష్పకం'కూడా గుండ్రంగా ఉదయిస్తున్న సూర్యుడిలా వున్నదని వర్ణించబడింది. చంద్రమండలంలో మనిషి కాలుపెట్టిన ఈనాటి అణువిజ్ఞానంతో చూసి మన పురాణాలలోని మానవ చరిత్రంతా తిరిగి వ్రాయాలి. ఇలా వ్రాసిన రష్యన్ విజ్ఞానవేత్త - 'వెలికోవ్స్కీ' (Velikovsky) ఈయన ఇంకా ఒక అద్భుతమైన విషయాన్ని కూడా బైటపెట్టాడు. ఇది భూమియొక్క అతిపురాతన చరిత్ర - అంటే భూమిపుట్టడం- మానవజాతి ఈ భూమ్మీద అడుగుపెట్టడం - అదంతా ఎలాగ జరిగిందో ముప్పైయేళ్ళ తన పరిశోధనల ఆధారంగా వ్రాసాడు ఆయన.

వేలాది సంవత్సరాల క్రితం ఒకానొక ''అంతరిక్ష నౌక'' అనంతమైన నీలాకాశంలో ప్రయాణం చేస్తూ భూమ్మీదకొచ్చి దిగిపోయింది. అందులోని 'అతి-మానవులు' (Super Men) ఒక ప్రయోగం కోసం భూమిమీద వదలివేసిన మొదటి జంటనుంచే మన ఈ మానవజాతి ప్రారంభమయింది. ఇది వెలికోవ్స్కీ వాదం. ఆయన బాబిలోనియా, మెక్సికో, ఈజిప్టు వంటి ప్రాచీన దేశాలలోని మత గ్రంథాలలోని వర్ణనలు భారత, రామాయణాలతో పోల్చిచూసి ఇలాగ ఇంకా అనేక విషయాలను కూడ బైటకి తీశాడు.

ఇంతేకాదు. ఇవే విషయాలు సరిగ్గా 'Erish Daniken' అనే జర్మను రచయిత అనేక దేశాలకు పోయి, ఈజిప్టు, ఆఫ్రికా, మెసోపొటేనియా, మెక్సికో వంటి ప్రాచీనదేశాలలోని త్రవ్వకాలు చూసి, అక్కడ దొరికిన రాతిశాసనాలూ, లోహపు డిజైనునూ, విగ్రహాలూ, ఎన్నో సంపాదించారు. వాటిలో చాలాభాగం ఈనాటి 'అంతరిక్ష నౌక' లోపలిభాగాలు ప్లానులు. దొరకడం-ఈవాదాన్ని బలపరుస్తున్నది. ఇంకో ఆశ్చర్యం అందులో దొరికిన కొన్ని భూఖండాల 'మాప్' (Map) దేశపటం ఆకాశంలోంచే చూస్తే కనిపించినట్టుగా గుండ్రంగా వ్రాయబడి వుండటం ఇంకా ఆశ్చర్యకరమైన విషయం.

ఇదంతా చూస్తే మన పురాణాలలో వర్ణించిన మానవచరిత్ర - కొన్ని లక్షల సంవత్సరాల వెనుక జరిగిన మన చరిత్ర 'కృతయుగం'తో ప్రారంభించటం చూస్తే, ఆనాటి అణుయుగం నుంచి ప్రారంభించిన మానవజాతిలో, క్రమేపి విజ్ఞానం నశించిపోయి - చివరికి కర్రలూ, బాణాలు ఉపయోగించే 'అధముల' చరిత్రగా - అంటే విజ్ఞానం తగ్గిపోతూ వచ్చి 'కలియుగం'గా పరిణమించిందని తెలుతోంది. 'వెలికోవ్స్కీ' పరిశోధనల దృష్ట్యా చూస్తే అవి రూఢి ఔతున్నాయి.

'Erich Daniken' అన్న పరిశోధకుడు తన గ్రంథంలో ఇలాంటి అనేక అద్భుత విషయాలు ప్రకటించారు. రామాయణంలోని పుష్పకం. భాగవతంలోని ''కర్దమ ప్రజాపతి'' ప్రయాణం చేసిన అంతరిక్షనౌక, భారతంలో వర్ణించబడ్డ

అణ్వాయుధాలూ - ఈ అన్నీ కూడా ప్రాచీన భారతీయుల చరిత్రలో గడచిపోయిన ''అణుయుగం'' (Atomic Age) అని, ఆయన ఆయా ప్రదేశాలలో తీసిన ఫోటోలతో సహా నిరూపించాడు. ''వెలికోవ్స్కీ'' పరిశోధన - సరిగ్గా ఇతర సైంటిస్టులు 'జైట్సేవ్', 'నావ్మోవ్', 'రజ్దాక్' వంటి వారి పరిశోధనలతో సరిపోతున్నది!!

అంటే దీని అర్ధమేమిటి?- ఒకనాడు ఈ భూగోళమంతా వ్యాపించిన ప్రాచీన సంస్కృతే ఈనాటి మన హిందూ విజ్ఞానానికి, హిందూమతానికి, మన శాస్త్రాలకూ ఆధారం! అదే ఈ గడచిపోయిన 'సత్యయుగం' (Age of Truth)గా లేక ''కృతయుగం'' (Age of Sience)గా పురాణాలలో వర్ణించబడ్డది. ఒక అపూర్వ ''వైజ్ఞానిక యుగం''లేక అంతరిక్షయుగం. అణుయుగం. ఆనాటి తయుగానికి, ఇప్పుడీ ''కలియుగం'' అంతమై రాబోయే ''సత్యయుగా''నికీ గట్టి పోలికలూ, ఆధారాలు అనేకం కనిపించాయి! అందులో ఒకటి గర్భంలో దొరికిన విష్ణు, గణేశ, శివ, లక్ష్మీ, సరస్వతి మొదలైన దేవతలు, త్యక్షంగా పురాతన వస్తువులను ప్రదర్శించే మ్యూజియంలో ఈనాటికీ చూడవచ్చు. చైనీస్ తుర్కిస్తాన్‌లో గణేశుడూ, ఇంకా దాదాపు నూరుకుపైగా సంస్కృత గ్రంథాలు లభించాయి. అందులో ఎన్నో ఆయుర్వేద గ్రంథాలున్నాయి. ప్రాచీన 'సైబీరియా' (Siberia)లో సంస్కృత మంత్రాలు ఇప్పటికీ 'బుర్యాత్' (Buryat)లోని పురావస్తు ప్రదర్శనలో చూడవచ్చు. ఇలాగే జపాన్‌లోని తాంత్రిక గ్రంథాలు, బీజాక్షరాలు, మంత్రాల గురించి తెలిపే సాహిత్యం. శిల్పాలు, కుడ్య చిత్రాలు కొల్లలు.

ఇదంతా చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. ఆ రష్యను పరిశోధనంతా మనల్ని ఎక్కడికి తీసుకుపోతోందో? ఆకాశంలో మినుకు మినుకు మంటూ వెలిగే నక్షత్రాలలో అనేక రంగురంగుల లోకాలు ఉన్నాయా? ఆ నక్షత్రలోకాల (లేక 'గెలాక్సీ'- Galaxy)కి అవతలుండే 'జీవులు' - లేక 'మానవులు' (వీరి ఆకారం ఎలావుంటుందో) భూమ్మీద మనుషులతో సంబంధాలు పెట్టుకోడానికి ప్రయత్నాలు చేస్తున్నారా?

ఈ ఆకాశంలో, ఎందరో రష్యన్ సైంటిస్టులూ విమాన ప్రయాణీకులూ తరచూ చూసే ''గుర్తు తెలియని ఎగిరే వస్తువులకు'' అర్థం ఏమిటి? ఆ ఎగిరేపళ్ళేలు మన విమానాలను ఎందుకు తరిమి వెంటబడుతున్నాయి? రంగురంగుల ఆరంజి, నీలి-ఆకుపచ్చ ముత్యం రంగుతో రివ్వున దూసుకు వెళ్ళే ఆ అంతరిక్ష నౌకలు మన భూమ్మీద పరిస్థితులను కనుగొనటానికి ఇతర లోకాలనుంచీ వేరే గ్రహాలనుంచీ పంపబడ్డ ''గూఢాచారి'' సైంటిస్టులవా?

ఇతర గ్రహమండలాలలోని వాళ్ళు భూమితో సంబంధం పెట్టుకోటానికి చూస్తున్నారో లేదో ఆసంగతి ఏమోగాని - రష్యన్ సైంటిస్టులు మాత్రం ఇతర గ్రహమండలాలతో సంబంధాలు పెట్టుకోవాలని విశ్వప్రయత్నం చేస్తున్న మాట మాత్రం నిజం!! వీరు అమెరికన్ సైంటిస్టు ''ఎల్లెన్'' అన్నట్లు ఒకానొక రోజున అకస్మాత్తుగా బైటలోకాల్నుంచి వచ్చిన ఆ ఎగిరేపళ్ళేల రహస్యాన్ని బేధించినట్టు వార్తలు మనం చదువుతామా? లేక ఇప్పటికీ రష్యన్లు దివ్యశక్తులున్న ''ఉల్ఫ్ మెస్సింగ్' వంటి వారి సహాయంతో వీటిలోని జీవుల ఆలోచనతో టెలిఫోన్‌లో మాట్లాడినట్టు మాట్లాడుతున్నారా? ఈ అర్థశతాబ్దంలో రష్యాలో అకస్మాత్తుగా పెరిగిపోయిన ఆధ్యాత్మిక పరిశోధన వెనుక - ఈ ''గుర్తు తెలియని ఎగిరేపళ్ళేలూ'' వాటిలోని ఇతర గ్రహాల ''జీవుల'' మానసిక సహాయం వున్నదా?

ఇవి ఎన్నటికీ చల్లారని ప్రశ్నలు!



రష్యాలో జరుగుతున్న పరిశోధనలూ ప్రకటించిన అనేక ఆశ్చర్యకరమైన వింతలూ చదువుతూవుంటే ఒక విషయం మాత్రం స్పష్టంగా తేలుతోంది- ఒక నూతన 'అంతరిక్షయుగం' ఆరంభమైందని! ఎంత వద్దనుకున్నా వేలాదిసంఖ్యలో కనబడుతున్న 'అంతరిక్షనౌకల' అనుభవాలూ వీటిని ప్రత్యక్షంగా చూచిన అనేకుల అనుభవాలూ అన్నీ చదువుతూవుండే ఎవరికైనా తోస్తుంది. మానవజాతినే పూర్తిగా మార్చివేయగల సత్యకాలం (Age of Truth) ఎంతో దగ్గరలో వుందని!

రష్యన్ పరిశోధకులు 'జైట్సేవ్' (Zaitsev) 'జీగెల్' (Ziegel), 'నావ్‌మోవ్' (Naumov) యొక్క రహస్య పరిశోధనల అంతరార్థం పూర్తిగా గ్రహించాలంటే అనేకచోట్ల జరుగుతున్న ఈ విచిత్ర పరిశోధనలను కలిపిచూస్తేకాని బోధపడదు.

టిబెట్టు (Tibet)లో కమ్యూనిస్టు చైనా సైన్యాలు ప్రవేశించినపుడు అక్కడ ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. దాన్ని సరిపోల్చిచూస్తే అంతరిక్షనౌకలపైన రష్యాలో జరుగుతున్న పరిశోధనల అంతరార్థం కొంచెం బోధపడుతుంది. టిబెట్టులో ప్రవేశించిన చైనా సేనలు అక్కడి ప్రజలను అనేకవిధాల హింసలు పెట్టినట్లు 'దలైలామా' (Dalai Lama)కు చేరుతున్న వివరాలవల్ల తెలుస్తోంది. అక్కడ అనేక మంది మహాయోగులు మంచుకొండలపైన గుహలలో ఏకాంతంగా తపస్సు చేసుకుంటూ ఉన్నారు. శతాబ్దాల తరబడి ప్రశాంతంగా వారి ఆశ్రమాలలో అనేక వేల సంవత్సరాలనుంచీ దాచబడిన మానవజాతియొక్క అతిప్రాచీన చరిత్రకు సంబంధించిన తాటాకు గ్రంథాలు ఎన్నో ధ్వంసంచేసి తగులబెట్టారు. ఈ కమ్యూనిస్టు చైనా సేనలు. 'మతం' అంటే కమ్యూనిజానికి విరోధం, జ్యోతిషం, ఆధ్యాత్మికశక్తులన్నా లేక ప్రాచీన శాస్త్రాలన్నా, దేవుడు అన్నా, వాటిని ప్రజలలో అణచివేయాలన్న 'చైనా కమ్యూనిస్టు పార్టీ' మూర్ఖత్వమే ఈ అమాయకం తపస్సు చేసుకునే టిబెట్‌లోని 'లామా' (Lama)లకూ సాధువులకూ లేనిపోని కడగండ్లు తెచ్చి పెట్టింది. అప్పుడు జరిగిందో వింత సంఘటన!!

టిబెట్టులో అది ఒక మారుమూలవున్న పర్వతాశ్రమం. ఆరోజున అన్ని ఆశ్రమాల్లాగ అక్కడా జొరబడి చైనా సైనికులు అంతానాశనం చేస్తూ గుహలో తపస్సు చేసుకుంటున్న 90 ఏళ్ళ ముసలి 'లామా' (Lama)ను నిర్దాక్షిణ్యంగా గ్రుడ్డుపీకి, నానా చిత్రహింసలూ పెట్టారు. బట్టలు చింపేసి, ఒళ్ళంతా హూనంచేసి వదిలేశారు ఆ ముసలి 'లామా'ను. అలా గుహలోంచి బయటికి లాగబడి, కొనవూపిరితో, అలాగే మంచు మీద విలవిలా తన్నుకుంటున్న ఆ ముసలి సాధువును. అతనలాగే గింజుకొని చచ్చిపోవాలని ఆ మంచుకొండ

శిఖరం ప్రక్కగావున్న అగాధం అంచునే వదలేసి వెళ్ళిపోయారు చైనా సైనికులు. అకలికీ, చలికీ, వాళ్ళు పెట్టిన హింసలకూ, కొద్దిసేపట్లోనే మరణించి వుండేవాడు ఆ ముసలిలామా - ఓ వింత జరగకపోయినట్లయితే!

ఇంతలో ఆకాశంలో దూరంగా ఒక నక్షత్రం★ మెరిసింది! అది చూస్తూవుండగానే వెలుగుతో పెద్దదై, ఆ నక్షత్రం చంద్రుడికంటే ఎక్కువకాంతితో చిత్రమైన లేత నారింజరంగు 'పళ్లెం' లాంటిది గుండ్రంగా తిరుగుతూవుంది. దానిమధ్యవున్న నీలిఆకుపచ్చరంగు గోళంతో, ఆ తెల్లనిమంచు శిఖరాలమీద రంగురంగుల కాంతిపడి వెలుగుతూవుండగా అలా ఆ శిఖరంపైగా ఎగురుతూ పోయింది. కళ్ళు కనిపించకుండా మంచు శిఖరం ప్రక్కన శవంలా పడివున్న ఆ 'ముసలి లామా' శరీరం మీద దాని వెచ్చని రేడియో ధార్మికకాంతిపడి కొద్దిగా చైతన్యం కలిగి - అటూ ఇటూమెదలి నెమ్మదిగా మూలిగాడు. ఇంతలోనే మళ్ళీ వెనుకకు తిరిగిన అదే 'అంతరిక్షనౌక' అక్కడే ఆకాశంలో నిలబడి కిందికి దిగకుండా పైనే చక్కర్లు కొట్టసాగింది తూనీగలాగా! భూమికి అది చాలా ఎత్తున నిలబడి ఆగివుంది. దాని మధ్య గుండ్రంగా వున్న 'గోళం' పాదరసంలాగ వెండిరంగుతో తళతళా మెరుస్తూ కుడివైపుకు తిరుగుతోంది! అలా కొంతసేపు నిలిచివుండి దానిలోంచి ఇంకొక చిన్నగోళం వంటిది, హెలికాప్టర్ లాగ బయటికివచ్చి ముసలి 'లామా'పడివున్న ఆ మంచులోయపైగా ఎగురుతూ దగ్గరగా రాసాగింది. అది క్షణకాలం ఆగివంద అడుగులు ఎత్తున మంచుకుపైగా నిలబడి గిర్రున బొంగరంలా తిరుగుతూ కిందికి మంచుపైకి దిగింది! దాని వేగానికి దుమ్ములేచినట్లు తెల్లని దూళి ఎగిరిపడింది. అందులోంచి నిచ్చెన లాంటిదేదో బయటికి వచ్చింది. దానిమీంచి కాళ్ళూ చేతులూ కదులుతూ, వింత యంత్రాలవంటి మనుష్యులు (లేక మనుష్యుల వంటి యంత్రాలా?) దిగివచ్చి ఆ మంచులోపడివున్న టిబెట్టుయోగిని పరిశీలించ నారంభించారు. అతను జీవించియున్నాడని తెలుసుకొని యంత్రాల సహాయంతో

---

* V. ZAITSEV, 'Visitors from Outer Space' Sputnik Jan.67.

చిన్న 'స్ట్రెచ్చర్'(Stretcher) వంటి పడకమీద పడుకోబెట్టి, పైకెత్తి హెలికాప్టర్ వంటి ఆ అంతరిక్ష విమానంలోకి తీసుకెళ్ళారు. వారుకూడా నిచ్చెనమీంచి ఎక్కి, ద్వారంగుండా లోపలికివెళ్ళి ఆ నిచ్చెనను లాగేసుకున్న తరువాత తలుపు మూతపడింది. ఆ అంతరిక్షనౌక రివ్వున పైకిలేచి, దూరాన ఆకాశంలో ఎగురుతున్న 'ఎగిరేపళ్లెం' వంటి ఆ వింత వస్తువు దగ్గరగాపోయి చివరికి దాని వెలుగులో కలిసిపోయిది!!

ఆ అంతరిక్షనౌకలో, కొనవూపిరితో వున్న టిబెట్టు 'లామా'కు చికిత్సలు జరిపారు. కళ్ళుపీకివేయబడి, చెవులు బద్దలు చేయబడి వుండటం చేత అతనితో ఎలా సంభాషించాలో, అతనికి ఏమి చూపించాలోకూడా వారికి బోధపడలేదు. ఏదో రసాయన ద్రవ్యాలు కలిపిన వేడివేడి ద్రావకాలతో స్నానం చేయించారు. ంతో కొంత చైతన్యం కలిగిందతనికి. రక్తంలోకి విటమినులవంటి పదార్థాలున్న దో ద్రావకాన్ని ఎక్కించారు. దాంతో అతనికి సత్తువ వచ్చింది. అతని మెదడును ''ఎలక్ట్రానిక్'' పరికరాల ద్వారా పరిశోధించారు. తలకుపైన సన్నని కరెంటుతీగలు అమర్చిన 'ఎలక్ట్రోడు' (Electrode)ల సహాయంతో అతని ఆలోచనలు బొమ్మలుగాచూసి, భాష అవసరం లేకుండానే అతనిభావాలను గ్రహించారు. అంతేగాక అతడికి జరిగిన హింసలకూ, యమయాతనలనూ గ్రహించారు. దాంతోపాటు ఎవరో 'విచిత్రజీవుల' చేతిలోచిక్కి, ఏమౌతానో అని భయపడుతున్న అతని భయాందోళననుకూడా గ్రహించారు. ఎన్నోరకాల భాషలతో రకరకాలుగా అతనికి శాంతిని కలిగించడానికీ, భయంలేదని తెలపాలనీ ప్రయత్నించారు. కాని అతని కళ్ళు పీకివేయబడినందున టెలివిజన్ తెరమీదచూపిన చిత్రాలుకూడా చూసే అవకాశం లేకపోయింది. దానితో అతనికి విచిత్రమైన 'ఆపరేషన్' ఒకటి చేయవలసి వచ్చింది.

గంటల తరబడి హాస్పటలులాగవున్న ఆ అంతరిక్షనౌక లోపల వారేర్పాటు చేసిన రకరకాల ప్రక్రియల సారాంశం ఇది - అతని కంటి నరాలకూ, చెవికింద నరాలకు సన్ననికరెంటు 'తీగలు' అమర్చి వాటిని ఒక

పెద్ద 'ఎలక్ట్రానిక్' యంత్రంలో కలిపివుంచారు. అతని మనస్సులోని ఆలోచనలు ఎదురుగుండా తెరమీద కనబడేలాగ - అతనికి వారు పంపే సందేశాలను శబ్దతరంగాలుగాను, కాంతి తరంగాలుగాను మార్చి, ఆ సన్నని కరెంటు తీగలద్వారా ఆ ముసలివాని నరాలలో ప్రయాణించి, అతని మెదడుకు సరాసరి ప్రయాణం చేసేలాగ కనెక్షన్ ఏర్పాటు చేశారు.

ఆకస్మాత్తుగా ముసలియోగికి 'కనిపించ' సాగాయి - రకరకాలు చిత్రాలూ - కళ్ళులేకపోయినా - తన మెదడులోనే చిత్రాల రూపాలను చూశాడు. వారు పంపే ఆలోచనా చిత్రాలవంటివి, అతని మనస్సులో కనబడసాగాయి - కలవచ్చినప్పుడు కనిపించే దృశ్యాల్లాగా! వారుపంపే శబ్ధధ్వనులు తరంగాలుగా సినిమాలోని 'ఫిలిమ్'కు ప్రక్కనే రికార్డ్ చేసిన ధ్వనిలాగ. అతనికి కనిపించే చిత్రాలకు సంబంధించిన అవసరమైన మాటలు శబ్దాలూ, అతనికి వినిపించసాగాయి. ఈ ఆపరేషన్ తరువాత!! అధునాతనమైన 'ఎలక్ట్రానిక్' పరికరాల సహాయంతో, వారు భూమ్మీద మానవజాతికి పంపించదలచుకొన్న 'సందేశాన్ని' ఈ ముసలి యోగి మెదడులోకి ఎక్కించారు టేపురికార్డరులాగ! టేపుచేసిన విషయాలను రికార్డుచేసిన టేపులాగే మెదడులోని ఈ సందేహంతో అతన్ని తయారుచేసి, తిరిగి అతనిని ఒక సురక్షితమైన ప్రాంతానికి చేర్చారు. అతడి మనస్సులోకి - 'ఈ సందేశాన్ని మీ వాళ్ళకు చెప్పకుండా నువ్వు చనిపోరాదు! ఇది చాలా అత్యవసరమైన సందేశం. అర్జెంటుగా మీ భూలోకవాసులకి మేము అందించవలసినవార్త. దీన్ని మీవాళ్ళందరికీ ప్రసారం చెయ్యాలి!' అని ముసలియోగి మెదడులోకి ఎక్కించారు ఆలోచనలద్వారా.

---

* టెలివిజనులో ఎలానైతే చిత్రాలను ''కాంతితరంగాల''లాగా దూరానికి ప్రసారం చేస్తారో, ''రేడియో''లో శబ్ధతరంగాలను ఎలా ప్రసారం చేస్తారో - అలానే ''ఆలోచనలను'' అయస్కాంత తరంగాలు ( Magnetic - Waves) గా పంపవచ్చునని రష్యాలోని పరిశోధనలో వెల్లడి అయింది!

'అదెలా సాధ్యం? నాకు కళ్ళులేవు. చెవులు వినబడవు. నేను 95 ఏళ్ళు పైబడ్డ ముసలివాణ్ణి! నేనుండే ఈ మానవ సంచారంలేని మంచు ఎడారి 'టిబెట్టు'లోని నా ఆశ్రమంలోంచి మానవజాతికి మీ సందేశాన్ని ఎలా ప్రసారం చేయడం? ఆయన ఆందోళన తరంగాలను వారువిన్నారు, ఆ టెలివిజను వంటి కనెక్షన్ ద్వారా.

భయపడకు! మా యంత్ర సహాయంతో అన్ని ఏర్పాట్లూ చేస్తాం! మా ఆలోచన 'తరంగాలు' అయస్కాంత కిరణాలుగా పంపి, ఎదుటి వ్యక్తికి, నీవు చూచిందీ, నీవు విన్నదీ, ఎలా విన్నదీ, నీకు జరిగిందంతా తెలియజెప్పు. అతని ద్వారా మా "సందేశం" ప్రసారమవుతుంది. ఇది అంతా ఎలా సాధ్యమో నీకు ఇప్పుడు చెప్పినా అర్థం అవదు. సైన్సు జ్ఞానం చాలదు. మీ భూలోకవాసులు మాకన్నా పదిలక్షల సంవత్సరాలు సైన్సులో వెనుకవున్నారు. మేము చెప్పినది బాగా గుర్తుంచుకో - అతడికి అన్నీ వివరంగా తెలియజెప్పు! అలా చెప్పిన తర్వాత నీవు కావాలనుకుంటే మరణించవచ్చు. అంతవరకూ నీకు ఆహారంగా మేము సన్నటి గోళీలు - అంతరిక్ష నావికులకు ఇచ్చే ఆహారపు మాత్రల వంటివి ఏర్పాటు చేస్తున్నాము!! అవి నీ నోటికి దగ్గరలోనే వుండి 24 గంటలకు ఓ గోళీనోట్లో పడి, అలా నీ ప్రాణం నిలుపుతుంది. ఈలోగా అతను నీ దగ్గరికి చేరుకుంటాడు"- ఇలా ఆ ముసలి "లామా" (Lama)కు అంతిమ సందేశం అతని మెదడులోనే వినిపించేలా ప్రసారం చెయ్యబడింది.

ఈ అంతరిక్షనౌక, ఆ మారుమూల 'టిబెట్టు'లో మంచులోపడి వున్న ముసలి లామా ద్వారా ఏ సందేశాన్ని మానవజాతికి అందించిందో విశదంగా చెప్పాలంటే అదంతా వేరే ఒక గ్రంథం అవుతుంది. దాన్ని నా తర్వాత గ్రంథం 'అంతరిక్షనౌక సందేశం'లో- ప్రాచీన మానవజాతి చరిత్ర, అన్న అంశంగా ఇవ్వబడుతుంది. ఇక్కడ ఈ పుస్తకంలో అదంతా అనవసరం. మనకు ఇక్కడ కావలసిందల్లా ఒక్కటే! రష్యాలో 'సైంటిస్టులూ' అంతరిక్ష పరిశోధకులూ చూసిన "ఎగిరే పళ్ళాలు" (Flying Saubers) లేక "గుర్తుతెలియని ఎగిరే

వస్తువులు'' (Un-ident-ifted Flying Objects- UFO's) అన్నవి అసత్యం కాదని! అంతేకాదు, రష్యాలోని సైంటిస్టులు వర్ణించిన వాటి రూపురేఖలు అటు అమెరికాలో వేరే దేశస్థులు అనేకసార్లు రాత్రిళ్ళు చూసి వర్ణించిన నక్షత్రం వంటి అంతరిక్షనౌక వర్ణనతో సరిపోవడమేకాక - మారుమూలవున్న టిబెట్‌తో ఆనాటి చైనా దండయాత్ర సమయంలో 1964లో జరిగిన ఈ ముసలి లామా యొక్క ఈ అనుభవం. అతడు వర్ణించిన అంతరిక్షనౌక రూపురేఖలతో అతికినట్లు సరిపోవడం చాలా ఆశ్చర్యం! ఆనాడు ఆ ముసలి లామాకు రష్యన్ పరిశోధకుల వర్ణనలుగానీ, రష్యాలో జరుగుతున్న ఆధ్యాత్మిక పరిశోధనల గురించిగానీ, ఇవేమీ తెలియకపోయినా అతడు ఈ అంతరిక్షనౌకల వివరాలన్నీ ఎలా చెప్పగలిగాడు? ఇదంతా కల్పితకథ అందామా? లేక నవల అందామా? అలా అయితే ప్రఖ్యాత పరిశోధకులు 'జైట్సేవ్' (Zaitsev), నావ్‌మోవ్ (Naumov)ల వంటి శాస్త్రాజ్ఞులు టిబెట్‌లోని ముసలి లామాతో కూడబలుక్కొని రెండు సరిపోయేలాగ ఇదంతా అతికించారని అందామా?

ఏది ఏమైనా ఈనాడు భూమ్మీద ఒక 'అంతరిక్షయుగం' (Space Age) అడుగు పెడుతోంది. ఎవరికీ తెలియకుండా! ఇది ఎవరూ కాదనలేని సత్యం. సైన్సుకు కూడా కనబడే ప్రత్యక్ష నిదర్శనం!

ప్రాచీన మతగ్రంథాలపైన రష్యన్ పరిశోధకుడు 'జైట్సేవ్' (Zaitsev) కనుగొన్న 'అంతరిక్షయానం' గురించి అపూర్వ విషయాలేమిటి? అంతరిక్ష యానంలో ఎగిరే విమానాలకూ పురాతన దేవాలయ శిఖరాలపై మలిచిన 'ఆలయ విమానాల'కూ సంబంధం ఏమిటి? ముస్లిముల మసీదులపై గోళాకారంగావుండే తాజ్‌మహల్ వంటి ఆకారాలకు అర్థం ఏమిటి? హిందువుల గుడిపైనకూడా, కొద్దిపాటి తేడాతో సూదిగా మొనతేలిన కొనకల్గిన ఈ గోళాకారాలు ఎందుకున్నాయి? 'ఈజిప్టు'లోని 'పిరమిడ్'ల ఆకారంకూడా బోర్లించిన ఆలయశిఖరంలాగ ఉండటం, ఈనాడు నిలబెట్టిన రాకెట్ల శిఖరంపైన

---

* Ziegel, Felix "U F O's What are they?" Smena. April, 7,1967

కొనతేలివుండే 'ఆకారమా' ఇది? తాజ్‌మహల్ చుట్టూరా నిలబెట్టివున్న స్తంభాలు - ప్రతి మసీదు చుట్టూ నిలచివుండే 'మినార్'(Minar)లూ - అంతస్తులు అంతస్తులుగా కిటికీలతో భవంతులను నిర్మించే ఆలోచన ఆ పురాతనకాలంలో ఆదిమానవుడికి ఎవరిచ్చారు? లేక ఇవన్నీ కేవలం కల్పనతో కళాకారులూ, శిల్పులూ ఎవరి బుద్ధికి తోచినట్లు వారు చెక్కినవా! అలా అయితే ఒక మతానికి ఇంకోమతం విరోధం కల్గిన హిందువులూ, ముస్లిములూ కట్టిన కట్టడాలలో పై పోలికలు ఎలా సాధ్యం?

అంతే కాకుండా ఆలయాలు కట్టే పద్ధతి శిల్పియొక్క ఊహలకు వదలివేయలేదు. అనాదికాలం నుంచీ నిర్ధారణచేసి విధించబడివున్నాయి. ఈజిప్టులోని పిరమిడ్‌ల కొలతలు కూడా ఇలానే ఎంతో నిర్దుష్టంగా, ఖచ్చితంగా, కొలచి వేయబడ్డాయి. అన్ని మతాల్లోనూ దాదాపు ఏదో ఒక శాస్త్రం - పూర్వం నుంచీ వస్తున్నది - నిర్ణయించిన పథకం ప్రకారమే వీటి 'కొలతలు' వేయబడివున్నాయి.

ఇదంతా ఒక సైన్సువంటి సాంకేతికమైన గణితమా? అంతరిక్ష నౌకల రహస్య సందేశానికి అన్నిమతాలలోని దేవళాల ఆకృతిలో కనిపించే ఈ పోలికలకీ మధ్యన ఏదో ఒక నిగూఢమైన ''రహస్యం''వుందని భావించాడు రష్యన్ అంతరిక్ష పరిశోధకుడు సైంటిస్టు జైట్సేవ్ (Zaitsev). 'ఆలయాలూ - అంతరిక్ష నౌకలూ' (Temples and Space Ship) అన్న ఈయన రీసెర్చి రిపోర్టులోని, పై విషయాలన్నీ ఇక్కడ నిరూపించడం సాధ్యంకాదు. అలా చేస్తే అదే ఒక గ్రంథంగా తయారవుతుంది! కావలసిన వాళ్ళు 'జైట్సేవ్' (Zaitsev) వ్రాసిన గ్రంధాన్నే చదువుకోవచ్చు, ఆయన కనిపెట్టిన ఈ ''ఆలయాల'' కట్టడాల వెనుక వున్న రహస్యసందేశం ఒక్కటే. అదేమిటంటే-

అతి ప్రాచీనకాలంలో భూమ్మీద ఎప్పుడో ఒకనాడు - మానవ చరిత్ర ప్రారంభించక మునుపు, ఒక 'అంతరిక్షనౌక' భూగోళంపైన దిగిందంటాడు.

---

* Dr. Vyacheslas Zaitsev- 'Temples and Space-Ship (Sputnik-January, 1968.)

సోవియట్ సైంటిస్టు 'జైట్సేవ్' (Zaitsev). ఈయన నిర్ణయాలతో దాదాపు రష్యన్ పరిశోధకులంతా ఏకీభవిస్తున్నారు!

ఈ మధ్యనే ఒక జర్మన్ ప్రొఫెసరు 'ఎరిక్‌వాన్ డానికిన్' () ప్రపంచంలోని అనేక ప్రాచీన శిథిలాల ఫోటోలుతీసి అతిపురాతనమైన మరికొన్ని శిథిలాలను రేడియోధార్మిక పరిశోధనద్వారా చూసి, ఒక నిర్ణయానికి వచ్చాడు. దాని సారాంశం ఏమిటంటే - ఈనాడు మతగ్రంథాల్లో అన్ని దేశాల్లోనూ అన్ని భాషల్లోనూ వర్ణించబడిన 'దేవతలు' అనబడే వాళ్ళు - ప్రాచీనకాలంలో భూమ్మీదకి అపారమైన విజ్ఞానంతో 'సైన్సు పరికరాల'తో దిగినవాళ్ళు, వీరు బయటి గ్రహమండలాల్లో అపారమైన పురోగతిని సాధించిన జీవులే, వీళ్ళు అనేకసార్లు భూమ్మీదకి తమ 'అంతరిక్షనౌకల' ద్వారా రావటం జరిగింది మానవుడికి, మొట్టమొదటి విజ్ఞానం, గణితం, ఖగోళం, ఆరోగ్యసూత్రాలూ, ఆచారాలూ నేర్పినది అంతరిక్షనౌకల నుండి దిగివచ్చిన 'దేవతలే!' దీనికి సాక్ష్యాలుగా ప్రొఫెసర్ 'డానికిన్' (Daniken) - రామాయణంలోని పుష్పకవిమానం యొక్క వర్ణన. యీనాటి అంతరిక్షనౌకలు చూసి వర్ణించిన వాటి ఆకారంతో సరిగ్గా సరిపోవడమే'- అంటాడు, తెలియకుండానే అటు జర్మను రచయిత 'డానికిన్' (Daniken), ఇటు రష్యను సైంటిస్టు 'జైట్సేవ్' (Zaitsev) ఒకే నిర్ణయానికి రావటం జరిగింది!

ఇంతేగాక దీనికి ఇంకో సాక్ష్యం కూడా వుంది! ప్రాచీన మతగ్రంథాల్లో వర్ణించిన 'సృష్టిక్రమం' మానవజాతి యొక్క పుట్టుక. పరిణామం తెలిపే కథలలో కూడా మానవజాతి దేవతల నుంచి సృష్టించబడిందని తెలిపే గాథల వెనుక ఒకానొక రహస్య సంకేతాన్ని సైన్సు ద్వారా తెలియజేస్తుంది అంటాడు 'డానికిన్' (Daniken).

మహాభారతంలో వర్ణించిన ''ఉరుములతో, పిడుగులతో గర్జిస్తూ ఆకాశంలోకి ఎగిరే దేవతల రథాలు'' - భీముడు ఇంద్రలోకం వెళ్ళిన వర్ణనా. అర్జునుడు ఇంద్రుని దర్శించిన కథ. అశ్వత్థామ ప్రయోగించిన 'బ్రహ్మ

శిరోనాయక' అస్త్రం ప్రేలుడు యొక్క భయంకర వర్ణన అంతా సరిగ్గా ఈనాటి అణుబాంబులు, రాకెట్లూ చూసినవాళ్ళు వర్ణించిన దానితో ఖచ్చితంగా సరిపోవడం, ఈ సత్యాన్నే ఇంకా గట్టిగా ఋజువు చేస్తుందంటాడు. 'డానికిన్' (Daniken) ఇంకో విచిత్రం కూడా వ్రాశాడు ఈ జర్మన్ సైంటిస్టు.

భూమ్మీద బ్రతికి ఉండాలంటే ఇతర గ్రహాల నుంచి వచ్చిన అంతరిక్ష వైమానికుల (దేవతల) శరీరాలు ఈ భూమ్మీది వాతావరణంలో తట్టుకొని జీవించడం కష్టం! అందుకని ఈ భూమ్మీద జంతువులలో ఎక్కువ తెలివిగల్గిన చింపాంజీ, గొరిల్లా వంటి పెద్ద కోతుల శరీరంలో జీవకణాలలో జరిపిన 'కృత్రిమ సంపర్కం' (Artificial Fertilization) ద్వారా అటు జంతువులకీ, ఇటు దేవతలకీ మధ్యస్థాయిలో వున్న 'మానవ'జాతిని, ఒక జీవశాస్త్ర ప్రయోగం ద్వారా ఆ 'అంతరిక్షజీవులు' సృష్టించడం జరిగిందంటాడు 'డానికిన్' (Daniken). దీనికి ఎన్నో సైన్సుల నుంచి సాక్ష్యాలూ, ఆధారాలూ... జీవకణంలోని న్యూక్లియన్‌లో వుండే (Chromesome Number) సంఖ్యవంటివి అనేక సాక్ష్యాలు కూడా ఇచ్చాడు తన గ్రంథంలో!

హిందువుల పురాణాల్లో కూడా మానవజాతిని భూమ్మీద సృష్టి చేసినవారు 'ప్రజాపతులు'! ప్రజాపతి అనగా ప్రజలకు- 'పతి' తండ్రి(లేక భర్త) అని అర్థం. ఇలాగే అంతరిక్షంలోని నక్షత్రాల నుంచీ ఇతర గ్రహమండలాలనుంచీ, సూర్యుడినుంచీ దిగివచ్చిన ''దివ్యపురుషులు'' ద్వారా మానవులు కృత్రిమ సంపర్కం ద్వారా సంతానాన్ని పొందినట్లు కథలున్నాయన్న జర్మను సైంటిస్టు వాదనకు ఆధారంగా కనబడుతున్నాయి - కుంతికి సూర్యునివల్ల కర్ణుడూ. అంజనాదేవికి వాయుదేవునివల్ల ఆంజనేయుడూ జన్మించటం ఇలాంటివేనేమో?

ఏది ఏమైనా ఈనాడు రష్యన్ సైంటిస్టుల పరిశోధనలవల్ల ఒక విషయం రూఢీగా వెల్లడయింది. ఈవిశాల విశ్వంలో 'తెలివి కలిగిన'జీవులు, మానవుల వంటివారు. అంతకంటే ఎంతో ఎక్కువ పురోగతి పరిణామం చెందిన జీవులూ, భూమ్మీదలాగే ఇంకా ఇతర సూర్యమండలాలలో, దూరానవున్న నక్షత్ర

లోకాలలో కూడా వుండటం, అసంభవం కాదు! అలాగే ఆ జీవులు అంతరిక్షయానం చేసే యంత్రాలను 'సైన్సు' ప్రకారం సాధించి - ''యూరీ గగారిన్'' చంద్రమండలం మీదికి వెళ్ళినట్టుగానే ఇతర గ్రహాల నుంచి వారూ యీ భూమ్మీదికి దిగడం అసంభవం ఏమీ కాదు? అలా ప్రాచీనకాలంలో ఎప్పుడో ఒక అంతరిక్షనౌక ఆకాశంలో ఎగురుతూ వచ్చి, ఆ 'జీవులు' మానవజాతి అప్పుడు ఆటవికదశలో వున్నప్పుడు కూడా ఈ భూగోళంమీద దిగి, ఆనాటి మానవజాతితో సంబంధాలు పెట్టుకొని వారికి ప్రాచీన సైన్సునూ (అప్పటి మనిషి అర్థం చేసుకోగలిగినంత) వ్యవసాయం, నిప్పు వినియోగం, కాలం కొలత, దూరంకొలత, అంకెలూ ఎక్కాలవంటి ప్రాథమిక విజ్ఞానం అందించటం అసంభవమేమీ కాదు.

ఇందులో అసాధ్యమైన మూఢనమ్మకాలు నమ్మక్కరలేకుండా - కేవలం సైన్సుతోనే తార్కికపద్ధతి ద్వారా ఈనాటి అంతరిక్షయానం మానవ చరిత్రలో ఋజువు చేయగల్గిన ఆధారాలే సేకరించారు. రష్యన్ పరిశోధకులు! ఆనాటి మానవుడు తనకు సహాయంచేసి, ప్రాచీన విజ్ఞానం ఇచ్చి తన ఊహకు అందిన సైన్సు వింతలు చూపిన, ఆ అంతరిక్షజీవులను 'దేవతలు'గా ఆరాధించటంలోనూ ఆశ్చర్యం ఏమీలేదు. ఎందుకంటే కృతజ్ఞత ఈనాటికీ ఆదిమానవుడి లక్షణం కనుక!

'డానికిన్' (Daniken) ఇలా రామాయణ, మహాభారతాల్లోని అంతరిక్ష విమానాల వర్ణనా, అణుశక్తి ఆయుధాల వివరాలనూ ఈనాటి సైన్సు దృష్టితో పరిశీలించడమేగాక, బైబిల్‌లోని 'డేనియల్' గ్రంథం (Book of Daniel), 'ఇజెకల్' గ్రంథం (Book of Ezekiel) వంటి అనేక మత గ్రంథాల్లో కనిపించే ''విమానాల''వర్ణనను .''దేవతల-రథాలు''గా నిరూపించాడు, తన గ్రంథంలో. ఈయన రాసిన ఈ అద్భుత సైన్సు గ్రంథం పేరు 'Chariots of the Gods?' (దేవతల రథాలు). ఈ పుస్తకం దాదాపు కోటికాపీలు అమ్ముడు పోయాయి అనేక దేశాల్లో. అంతరిక్ష పరిశోధన యొక్క ప్రభావం మతగ్రంథాలమీద,

ఈనాటి మానవుడి ఆలోచనలమీదా రానురాను ఎక్కువగా పడుతున్నదనడానికి ఇంతకన్న పెద్ద నిదర్శనమేం కావాలి?

ఇదంతా చూస్తుంటే, మనం చివరకో విషయం మరచిపోకూడదు! టిబెట్టులోని ఆ మంచుఎడారిలో కళ్ళు పీకివేయబడ్డ ఆ లామా యొక్క అనుభవాలూ- అతని ద్వారా మానవజాతి కంతటికీ ఆ ఇతర లోకాలనుంచి వచ్చిన 'ఎగిరేపళ్ళాల'లోని బుద్ధిజీవులలో జరిగిన పై అద్భుతానుభవాలూ, ఈనాడు మనకెలాగ తెలిసాయని అనుమానం రావచ్చు. ఇది నా ఊహకాదు. కల్పనా కథకూడా కాదు- అని తెలిపే గ్రంథం ఇంగ్లీషులో అచ్చయి వున్నది- 'ది హెర్మిట్' (The Hermit) లేక 'ఆ ఆశ్రమవాసి' అన్న పేరుతో.

అంతరిక్షనౌక వదిలేసిన ఆ ముసలిలామా అలానే కొన్నిరోజుల పాటు వారిచ్చిన గోళీలద్వారా ఆహారం తీసుకుంటూ జీవిస్తూ వుండగా ఒక టిబెటిన్ కుఱ్ఱవాడు అలాగ ఆ మంచుఎడారిలో పోతూ దారితప్పి ఈ లామాను మహాయోగిగా గుర్తించి, గౌరవించి చేసినసపర్యలకు ఫలితంగా అతడు పై అనుభవాన్ని తెలియజేశాడు.

ఇది జరిగిన కొద్దికాలం తర్వాత అంటే 1956-59లో చైనా సేనలు టిబెట్టును అంతా ఆక్రమించాయి. దలైలామా ప్రాణాలతో తప్పించుకొని వచ్చి భారతదేశంలో తలదాచుకున్నాడు. అంతకు ముందే టిబెట్టు నుంచి తప్పించుకుపోయిన యీ టిబెట్టు కుఱ్ఱవాడు తన అనుభవాలను ఒక గ్రంథంగా ప్రచురించి ప్రపంచం అంతా ప్రకటించాడు. అంతరిక్ష ప్రయాణీకులు మానవజాతికి అందించిన ఆ సందేశం కూడా ఈ పుస్తకంలోనే అచ్చువేయబడి వుంది. ఇందులో ఆశ్చర్యమేమిటంటే అప్పటికి ప్రపంచంలో చాలామందికి రష్యాలో జరుగుతున్న అంతరిక్ష జీవులమీద పరిశోధన గురించి కాని, ఆకాశంలో ఎగిరే UFOల గురించిగానీ, ఇంతా తెలియక ముందే వ్రాయబడిందా గ్రంథం.

రానున్న సంవత్సరాల్లో 'ఈ ఎగిరే వస్తువులు' అంతకంతకు ఎక్కువవు తాయనీ, మానవజాతికి తల్లిదండ్రులయిన ఆ అంతరిక్షనౌకలలోని ఆ

'అద్భుతవ్యక్తులు' భూమ్మీద మానవుడు అణుబాంబులు పేల్చుకుని, తనను తాను నాశనం చేసుకోకుండా మనల్ని కాపాడే ఉద్దేశ్యంతోనే ఈ భూమ్మీద దిగివున్నారనీ' - వారు పంపిన ఆ సందేశంలో ఉన్న ఒక ముఖ్యమైన అంశం. అంతేకాక భూమిమీద మానవుడి దివ్యశక్తులను మేలుకొలిపే ఉద్దేశ్యంతో వారిచేత మానవుల మెదడు మీద శక్తి ప్రేరణ చేయబడుతోందనీ, తత్ఫలితంగా అనేక దేశాల్లో చాలామంది వ్యక్తులలో అద్భుత శక్తులూ, అతీంద్రియ శక్తులూ, అతి మానసికశక్తి, ఎక్కువగా వెలువడతాయనీ ఈ అంతరిక్షజీవుల సందేశం.

దీని ఫలితమేనా ఈనాడు రష్యాలో అకస్మాత్తుగా బయటపడుతున్న 'ఉల్ఫ్ మెస్సింగ్', 'నెల్యామిఖైలోవా' వంటి అనేక మందిలో కనిపించే అద్భుతశక్తుల గురించిన వార్తలు? ఎవరు చెప్పగలరు?



ఇలా అంతరిక్షంలో 'ఎగిరే పళ్లాల' (Flying Saucers) గురించీ ఇతర గ్రహాలలో వున్న జీవుల గురించీ పరిశోధన చేసినది సైంటిస్టు 'జైట్సేవ్' ఒక్కడేకాదు. ప్రొఫెసర్ 'మోడెస్ట్ అగ్రెస్టు' (Modest Agrest) ఫిబ్రవరి 1966లో తన సిద్ధాంతాన్ని ప్రకటించాడు - అంతరిక్ష నౌకలలో భూమికి ఇతర లోకాల నుంచి దిగివచ్చిన ప్రాణులు. కనీసం గత 1000,000 సంవత్సరాల క్రితంనుంచి మనభూమ్మీదకు రాకపోకలు జరుపుతున్నట్లు ఋజువు అయిందని!'- ప్రొఫెసరు అగ్రెస్టు, లెఖ్కలలోను, ఫిజిక్సు (Physics) లోనూ డాక్టరేట్. అయిన లెబనాన్‌లో దొరికిన విచిత్రమైన శిలావస్తువులు- 'టిక్‌టైట్'(Tectires) లపైన పరిశోధనచేసి, ఇవి ఇతర గ్రహాల నుంచి ప్రేల్చబడిన రాకెట్లవంటి వాటి అవశేషాలు - అంటే కాలిపోగా మిగిలినవి అని తేల్చాడు!

అలాగే జపానులోని 'డోగూ' (Dogu) అనే 25000- నాటి శిలావిగ్రహాలకు టోపీలు వంటి ధరించినవి - ప్రాచీన అంతరిక్షనౌక నుంచి దిగిన - 'వ్యక్తుల' ప్రతిరూపాలు అంటాడు 'అగ్రెస్టు' (Agrest).

ఆశ్చర్యం! కాని అంతకంటే విచిత్రం సోవియట్ సైన్సు ఎకాడమి సభ్యుడూ, దానికి 'కరస్పాండెంటూ' అయిన డా|| ఐయోసిఫ్ ష్లోవిస్కీ (Dr|| Losif Shlovsky) చెప్పే వాదం! బైబిలులో 'డేనియల్', 'ఇజెకెల్' వంటి ప్రవక్తలు చూచినట్టు వర్ణించిన 'దేవుని-విమానం'- ఆకాశం నుంచి కిందకు దిగినట్టూ అది అనేక చక్రాలతో వుండి అవి తిరుగుతూన్నట్టు వర్ణించినది నిజానికి ఒక 'అంతరిక్షనౌక' (లేక UFO)అని ఆయన వాదం! దీనితో సరిగ్గా సరిపోయే వాదమే 1962లో అమెరికన్ అంతరిక్ష ఖగోల శాస్త్రజ్ఞుడు - 'కారల్ సాగన్' (Carl Sagan) ప్రతిపాదించాడు.

దీనితోపాటు 1967లో సోవియట్ సైన్సు ఎకాడమీ ప్రచురించిన రీసెర్చి ర్టు ప్రకారం - సైబీరియా (Siberia)లో 1908వసంవత్సరంలో శంలోంచి దూసుకువచ్చి మంచుమైదానంలో కూలినది 'ఉల్క' కానేకాదు!! న్ని టన్నుల బరువు కలిగిన లోహపు వస్తువు. కొన్ని మైళ్ళ వేగంలో సైబీరియాలో పిడుగులాపడి కొన్ని మైళ్ళ వెడల్పుగా అడవి అంతా మాడిపోయి రేడియో ధార్మికశక్తిని చుట్టూరా చిమ్మి వేసింది. అది నిజానికి ఒక అంతరిక్షనౌక కూలిపడింది! ఆ చుట్టూరా వందలాది రైన్‌దుప్పుల శరీరాలు నశించటమేగాక కొన్ని వందల కొద్దీ చెట్లు కూలిపోయి ఆ మధ్య ఒక పెద్ద అగాధం వంటి 'గండి' - సొరంగంలాగ ఏర్పడింది. ఆ తాకిడికి చుట్టూరావున్న దేశాలలో ఒక పెద్ద భూకంపం లాంటిది కలిగింది!

ప్రఖ్యాత మనస్తత్వవేత్త 'కారల్‌జుంగు' (లే యూంగ్) (Karl Jung) ఈ ఎగిరేపళ్ళాల వంటి కాంతి చక్రం యొక్క నిగూఢమైన ప్రభావం గురించి పరిశోధించాడు. పై పరిశోధనలన్నీ కూడా సోవియట్ సైంటిస్టు జైట్సేవ్ (Zaitsev) వాదాన్నే బలపరుస్తున్నవి - ఇలాగ భూమికి రాకపోకలు ఈ అంతరిక్షనౌకలు చాలా కాలంగా జరుపుతూ వున్నాయనీ, బైబిల్ కాలంలోనూ, ఇంకా 5000ల సంవత్సరాల క్రితం అంటే మహాభారత కాలంలోను వీటిని చూచిన వర్ణనలు అనేక మతగ్రంథాలలో వున్నాయనీ ఈయనవాదం. అంతేకాదు జైట్సేవ్

(Zaitsev) అంటాడు- ''భగవంతుడు'' అనే పదానికి అంతరిక్ష సైంటిస్టుల భావన - అపార విజ్ఞానంతో దూరానవున్న ఇతర నక్షత్ర మండలాల నుంచి వచ్చిన ''ఎగిరే వస్తువుల''లోంచి దిగివచ్చిన మానవాతీత శక్తులుగల అద్భుతవ్యక్తులే''నని! ఆకాశంలోంచి దిగటం కళ్ళారా చూసిన ఆదిమ మానవుల కళ్ళకివారు - దేవుని లోకం నించి వెలుగుతున్న దివ్యరధాలు (ఎగిరే పళ్ళాలు) ఎక్కివచ్చిన ''దేవధూతలు''!

అలాగనే- రానున్న దగ్గర భవిష్యత్తులోనే, మళ్ళీ అలానే ఒక అంతరిక్షనౌకలో మానవజాతికి సుదూరంలోని నక్షత్రలోకంనుంచి ''సందేశం'' (Message) తీసుకుని వెలుగుతున్న విమానం ఎక్కి భూమికి - ఒక ''దేవధూత'' రాగలడని జైట్సేవ్ () అంచనా!! దీనికోసం ఇప్పటినుంచే ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నారు సోవియట్ సైంటిస్టులు!!!

జర్మను రచయిత ''డానికిన్'' సోవియట్ ''జైట్సేవ్'' (Zaitsev) మాత్రమేగాక ఇంకా ''మోడెస్టు అగ్రెస్టు'' (Modest Agrest) ''నావ్‌మోవ్'' (Naumov), జెకొస్లొవియన్ ''రాజ్‌డాక్'' ''జీగెల్'' వంటి అనేకులు రానున్న అవతారపురుషుడు ఆకాశంలోంచి దిగివస్తాడని చెబుతున్నారు - అంతేకాక ఈ రానున్న క్రీస్తు ''రెండవ అవతరణ'' (Second Comming) అంటే భూమ్మీద జన్మించటంకాదనీ, బైబిల్ ఆధారంగా నొక్కి చెప్తున్నారు. వారిలో కొందరు లెక్కకట్టినదాన్ని బట్టి - మన సూర్యకుటుంబానికి అతి సమీపంలో వున్న నక్షత్రమండలం లేక ''గెలాక్సీ'' (Galaxy) నుంచి భూమికి కాంతియొక్క వేగంతో రావాలన్నా కనీసం 5000 సంవత్సరాలు పడుతుంది. అందుకే అంతరిక్షనౌకమీద క్రితంసారి ఈ దేవతలు భూమికి వచ్చి కనీసం 5000వేల సంవత్సరాలయింది.

విచిత్రం - మహాభారతం జరిగి ఇప్పటికి సరిగ్గా 5000 సంవత్సరాలు! కనుక ఈ ''దివ్యరధాలతో ఆకాశం నుంచిదిగే-'' దేవధూత లేక హిందువుల పరిభాషలో భూమికిరావాలి ఈ లెఖ్ఖలప్రకారం వాయుపురాణంలోనూ 5000

సంవత్సరాల తర్వాత మనభూమికి దేవతలు దిగివచ్చి మనుషులతో మాట్లాడుతారని వున్నది - ఇదేనేమో!!

వీరి రెండువాదాలు విచిత్రంగానే వున్నాయి- బైబిల్‌లోని రెండవ అవతరణా - భారతీయుల ''కలియుగం'' చివరిలోవచ్చే ''అవతార పురుషుడు'' కల్కిమూర్తి! ఈ యుగాంతంలో వచ్చే ''దేవధూతల గుర్రం'' ఎక్కి అంటే అంతరిక్షయానంలో పరుగెట్టేది - మేఘాలలోంచి కిందికి వచ్చి దిగుతాడని ఈ సైంటిస్టుల గట్టివాదం. ఏది నిజం?

బైబిలులో రానున్న భవిష్యత్తు తెలిపే ''రివలేషన్'' అన్న గ్రంథంలోని- ''తీర్పునిచ్చే దినం'' లేక ''కలియుగాంతం''లో -దేవధూత దిగివచ్చే ఘట్టాలు పోల్చిచూస్తే సోవియట్ సైంటిస్టులు చెప్పినట్టు ఎంతో పోలికగా వున్నాయి!

ముందు ''బైబిల్''లో ఏముందో చూద్దాం! ''రివలేషన్''- 19వ ద్యంలో ఇలా వ్రాసి వున్నది-

And I saw heaven opened, and behold a white horse; and he that sat upon him was called Faithful and True, and in righteousnesshe both judge and make war.

And out of hiis mouth goeth a sharp sword, that with it he should, smite the nations and he shall rule them with a rod of iron and he threade the winepress of the fiercencess and wratn of Almighty God.

And he hath on his vesture and on his thigh a name written, KING OF KINGS, AND LORD OF LORDS.

"Revelation"

THE BIBLE(19) 11-16.

అంటే సారాంశం!

స్వర్గద్వారాలు తెరుచుకొని తెల్లనిగ్రుర్రం మీద సత్యస్వరూపుడైన ఓ అపూర్వవ్యక్తి న్యాయనిర్ణేతగాను యుద్ధం చేయడానికి వస్తాడు. అతని నోటినుండి

ఒక పదునైన కత్తి ఉద్భవిస్తుంది. దానితో అతడు సకల ప్రపంచాన్ని జయించి సకల జీవులను తన కఠోరశాసనానికి గురిచేసి పాలిస్తాడు. అతని వస్త్రాలపైనా, తొడపైనా ''రాజులకురాజు'' ''దేవుళ్ళకు దేవుడు'' అని వ్రాసి ఉంటుంది.

బైబిల్- రివిలేషన్-(19) 11-16.

అంతేకాకుండా త్వరలోనే కలియుగం అంతమై సత్యయుగం రాబోతోందనడానికి చాలా నిదర్శనాలున్నాయి. ఇవి '1999 కలియుగాంతం-కాలజ్ఞానం' అన్న నా గ్రంథంలో వివరించాను.

ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన ''ప్రపంచ భవిష్యత్తు'' అనే గ్రంథంలో మానవలోకాన్ని ఉద్ధరించే 1980వ సంవత్సరంలో వస్తాడని వ్రాయబడింది.

ఇవన్నీ చూస్తూంటే, కలియుగం అంతమై సత్యయుగం రాబోయే యీ సమయంలో - ఈ సైంటిస్టులంతా గట్టిగా నిర్ధారణచేసి చెపుతున్నట్లుగా - ఆ ''దేవధూత'' లేక ''అవతారమూర్తి'' త్వరలోనే అంతరిక్షం నుండి దిగివస్తాడేమో?



12

# సోవియట్ రష్యాలో జ్యోతిషం!

# జ్యోతిషంతో - సంతాన నిరోధం!

ఒకమనిషి పుట్టిన సమయంలో సూర్యుడిలో జరిగే మార్పులు ఆ మనిషి జీవితంలో పనిచేసే ఆధ్యాత్మిక శక్తుల గురించి తెలుపుతాయని సోవియట్ సైంటిస్టు 'ఎడ్వర్డ్ నావ్‌మోవ్' (Edward Naumov) కనుగొన్నాడు.

కాని సూర్యుడిలో జరిగే మార్పులు మనిషిలో ఆధ్యాత్మిక శక్తులనెలా పుట్టిస్తాయి? అనేది, వెంటనే నిర్ధారణగా చెప్పటం కష్టం. కాని ''సైన్సు'' పరిశోధనలు రష్యాలో పోగుచేస్తున్న భోగట్టాను గణిత శాస్త్రరీత్యా (Statistical Analysis) పరిశీలిస్తే - సూర్యుడిలో ''మచ్చలు'' ఎక్కువగా ఉన్నప్పుడు మనస్సుతో ఆధ్యాత్మిక తరంగాలు పంపే శక్తిగల వ్యక్తులు పుడతారనీ - సూర్యుడిలో ఈ మచ్చలు లేనప్పుడు జన్మించేవాళ్ళు అలాంటి తరంగాలను, 'దర్శించ' (టీ.వి - సెట్టులా స్వీకరించ) గల్గుతారని ఆయన అంటాడు. రష్యా వంటి ఇంకా అనేక ఇతర కమ్యూనిస్టు దేశాల్లో కూడా జరుగుతున్న

పరిశోధనలు ''దివ్యశక్తులు'' వంటి విషయాలపైనా, సూర్యుని తరంగాలు మానవ జన్మలపైనా, చూపే ప్రభావంమీదా- ''పార్టీ- జీవితం'' (Party Life) అనే కమ్యూనిస్టు పత్రికలలోనే ప్రచురించారు! ఇందులో పడే ''రీసెర్చి'' వ్యాసాలను చూస్తే ఒక మనిషిలోని దివ్యశక్తులు తక్కిన సమయాలలో కంటే పౌర్ణమి టైములోనే ఎక్కువగా ఉంటాయని తెలింది.

దీనికి పాతపేరు 'జ్యోతిష్యం'. కాని దీనినంతా తిరగతోడి రాజకీయ ఇబ్బంది లేకుండా రష్యాలో దీనికి ''ఖగోళ-జీవశాస్త్రం'' (Cosmic Biology) అని ఓ కొత్త పేరు పెట్టుకొని పార్టీ ''నిఘా'' భయంతో ఇలా, వేరేరూపంలో అవతరిస్తున్న, ఈ పాతకాలపు ''జ్యోతిష'' పరిశోధనకు మూలపురుషుడు డాక్టర్ ఎ.ఎల్. ఖిజేవ్స్కీ (A.L. Chijevsky). ఈయన పరిశోధనలో భూమ్మీద ప్రజలే అంటువ్యాధులు ఒక్కుమ్మడిగా వ్యాప్తిచెందటమూ, రోగాలూ, మిడతలూ, ...లుకలూ వంటివి, ఇలా ఉన్నట్లుండి కారణం లేకుండా మూకుమ్మడిగా ...రగటం, ఇంకా ఇలాంటి అనేక ప్రకృతిలోని మార్పులు ఎన్నో - ఈ ...ర్యుడిలో కనబడే ''మచ్చల''తోనో సంబంధించి ఉన్నట్లు తెలింది.

అంతేకాదు! మానవచరిత్రలో ఒక్కోసారి ఉండుండి జరుగుతుండే యుద్ధాలూ, విప్లవాలూ, కొన్నికొన్ని జాతులు మూకఉమ్మడిగా విడిచిపెట్టి ''వలస''పోవడం (Mass Migration) వంటి ''చరిత్రాత్మక సంఘటనలు'' ఎన్నింటికో సూర్యుడిలో ఏర్పడే మచ్చలతో సంబంధం ఉన్నట్టుగా రష్యాలోని ఈ పరిశోధనవల్ల తెలింది.

ఈ విషయంలో ఒక కమిటీకూడా ఏర్పాటు చేయబడింది. రష్యాలో ఈ కమిటీకి అధ్యక్షుడు డాక్టర్ లూనాకర్స్కీ (Dr. Luna Charsky), ఈయనతో కలిసి డాక్టర్ సెమాష్కో (Dr. Semashko) అనే సైంటిస్టు జరిపిన ఈ పరిశోధనల వివరాలన్నీ ప్రచురింపబడినాయి. ఇందులో ఆసక్తి గొలిపేవి ఎన్నో ఉన్నాయి. ఇందులో ప్రత్యేకించి రష్యాలో 1917 కమ్యూనిస్టు విప్లవం తర్వాత మనుషులు

---

* "The Soviet Academy of Science- USSR."

మూకుమ్మడిగా వలసపోవడం వంటి చరిత్రాత్మకమైన మార్పులెన్నో ఈ సూర్యుడిలో జరిగే మార్పులతో సంబంధించివున్నట్లు ఋజువయింది!

వీరు తయారుచేసిన అనేక ''గ్రాపులూ'' లెక్కలు (Statistics) గత చరిత్రలోని తేదీలు గత సంఘటనల ''లిస్టులూ'' చూస్తే. ఈ విషయాలు ధృవపరుస్తాయంటూ నిర్ధారించాడు ''డాక్టర్ కోబీజేవ్'' (Kobyizev) ఇంకా దీనికి సంబంధించిన అనేక వైజ్ఞానిక విషయాలు కూడా ఎన్నో ఇటీవలే కనుగొనబడినాయి.

జ్యోతిషంపై ''సోవియట్ సైన్సు ఎకాడమీ'' వంటి నమ్మకమైన అధికారసంస్థ ప్రకటించిన అత్యాశ్చర్యకరమైన పరిశోధనలలో ఇలాంటి వింతలెన్నో! యీ సంస్థ (Academy of Sciences USSR) మాస్కోలో ఇలాగ ప్రచురించిన వింతలలో ఇవి కొన్ని మాత్రమే. దీని ప్రకారం ప్రతి 11 1/2 లేక 12 సంవత్సరాలకి సూర్యుని బింబంలో కొన్ని ''మచ్చలు'' కనబడతాయి. ఇవి 'టెలిస్కోప్' (దూరదర్శిని)తోనే గాక ఒక్కొక్కసారి విడిగా కంటికి కూడా కనబడతాయి.

ఇలా సూర్యునిలో - మచ్చలు (Sun-Spots) కనిపించినప్పుడు తీవ్రమైన ప్రోటాన్ కిరణాల వంటి ''శక్తితరంగాలు'' భూమ్మీదకు ప్రసరించటం జరుగుతుంది. వాటి ప్రభావం వల్ల మానవజాతిలో చారిత్రాత్మకమైన మార్పులు రావటం కూడా జరుగుతుంది. రష్యాలో జరిగే యీ పరిశోధనలను విడిగా అమెరికాలోని శాస్త్రజ్ఞులు కూడా ధృవపరిచారు. అందులో ప్రొఫెసర్ 'సెసిల్‌మేటీ' (Cecil Marty, A.R.Cs. FRAS) డా॥మిఖేల్ గాక్విసన్ (Michel Gauquelin) వంటి సైంటిస్టులు చాలాకాలంగా జరిపిన పరిశోధనలవల్ల తీవ్రమైన మార్పులు పొందుతుందని.

అంతేకాదు యీ గ్రహాల ప్రభావం వేటిమీద ఎక్కువగా కనబడు తుందంటే సూర్యుని ప్రసారం చెట్ల పెరుగుదలా మనిషి మెదడూ ఆలోచనలూ ఆరోగ్యమూ పరిశ్రమల ఉత్పత్తి ప్రపంచ మార్కెట్‌లోని ధరల మార్పులూ

ద్రవ్యనిధుల హెచ్చుతగ్గులూ ఇలా వీటన్నింటిపైనా గ్రహాల ప్రభావం ఖచ్చితంగా ఉన్నదని యీ రష్యన్ సైంటిస్టులు కనుగొన్నారు. వాళ్ళు చేసిన అనేక పరిశోధనలలో ఇవి కొన్ని మాత్రమే.

ఈ సూర్యుడిలోంచి వచ్చే 'గామా' కిరణాలు (Gama Rays) సూర్యునిలోని మచ్చలు (Sun Spots) భూమ్మీద యీ మార్పులు ఎలా తీసుకొస్తాయో - అన్న రహస్యం కూడా డా॥ లియోనార్డ్ రవిట్జ్ (Dr. Leonard Ravitz) చేసిన పరిశోధనలవల్ల తెలిసింది. ఇందులో మన శరీరం చుట్టూవుండే శక్తితరంగాలు సరిగ్గా సూదంటురాయి చుట్టూండే అయస్కాంత తరంగాలు (Magnetic field) వంటి వేననీ తేలింది గ్రహాలచుట్టూ ఉండే ''అయస్కాంత పరిధి'' (Gravitation Field) మానవ శరీరం చుట్టూ వ్యాపించివున్న యీ ''అయస్కాంతేజశ్చక్రం'' ద్వారానే గ్రహఫలితాలు చూపుతుందనీ తేలింది. అంతేగాక గ్రహాలకూ సూర్యుని శక్తితరంగాలకు ప్రత్యక్షప్రభావం మానవుడిమీద ఉందనీ కూడా తేలింది. బూజుపట్టిన హిందువుల మూఢనమ్మకం అని ఈనాడు మనం పండ్లికిలించే 'జ్యోతిషం' - సోవియట్ రష్యాలోని ''అంతరిక్ష యుగపు (Space Age Science) శాస్త్రం'' అయి వూరుకుంది. అందులోను అది నాస్థికత్వమూ, భౌతికవాదమూ పుట్టిన రష్యాలోనే జరగటం ఇంకా ఆశ్చర్యం!!!

ఇన్నాళ్ళూ, జ్యోతిషం శాస్త్రం కాదని వాదించే చాలామందికి ఈ పరిశోధనలు వింటే నెత్తిమీద పిడుగుపడ్డట్టు వుంటుంది. హిందువులు కొన్ని వేల సంవత్సరాలుగా వేదకాలంనుంచీ జ్యోతిషం ఒక శాస్త్రం అని నమ్ముతున్నారు. అంతేగాకుండా ఒక మనిషి పుట్టినప్పుడు ఆకాశంలోవుండే గ్రహస్థితి ద్వారా ఆ మనిషి జీవితంలోని అనేక మార్పులను కొలవవచ్చునని తేలింది! ఆనాటి ఖగోళశాస్త్రం మాత్రమే ఈ ''జ్యోతిష శాస్త్రా''నికి ఆధారము!

ఎక్కడో ఆకాశంలోని గ్రహాలకీ, భూమ్మీదవుండే మన జీవితాలకూ సంబంధం ఏమిటి? అని రోడ్డుమీద నుంచోని వాదించే కొంతమందిని చూచి, ఏ పరిశోధనా, అసలు అందులో పరిజ్ఞానము లేకుండా వాదించి మేధావులమని

గర్వపడే అనేక మందికి కనువిప్పు ఈ రష్యన్ పరిశోధనలు: మన దేశంలో అనేక మంది డాక్టర్లూ శాస్త్రజ్ఞులు ఏ పరిశోధనా లేకుండా, లేక కనీసం రష్యాలో ఇతరులు చేస్తున్న పరిశోధన ఏమిటో కూడా తెలియకుండానే తమ ఊహాగానాలమీదే ఆధారపడి జ్యోతిష పండితుల మీదా, వేదాలమీదా, జ్యోతిషం మీదా వాళ్ళకున్న అక్కసునూ, విరోధాన్నీ, భారతీయ విజ్ఞానం మీదా వాళ్ళకున్న అక్కసునూ, సైన్సు పేరిటా అవిశ్వాసం పేరునా చులకనగా వ్యక్తం చేస్తున్నారు. వాళ్ళకు నిజంగా ప్రాచీన జ్యోతిషం చదివిన జ్ఞానమూ లేదు. పోనీ అటు ఆధునిక సైన్సులో రష్యావంటి దేశాలు చేస్తున్న ''రీసెర్చీ'' తెలియదు. ఎటొచ్చీ తమ 'మూర్ఖత్వమే' సైన్సుగా మసిపూసి - తద్వారా హిందూమతాన్ని దుయ్యబట్టి జ్యోతిషం వంటి మూఢవిశ్వాసాలని నశింప చేశామనుకొని తృప్తిగా ఆనందపడు తున్నారు. పాపం. వాళ్ళ ఈ అవిశ్వాసం ఎంత అశాస్త్రీయమైనదో ఈ సోవియట్ పరిశోధనలే స్పష్టంగా ఋజువుచేస్తాయి: సిగ్గుచేటు: ఇందులో అనేక వైజ్ఞానిక పరిభాష సామాన్యుడికందుబాటులో వుండదు.

డాక్టర్ 'కోబీజేవ్' (Dr॥ Kobizev) ఈ విషయంలో ఇలా అన్నారు. సూర్యుడిలో జరిగే మార్పులుకాలంలో చక్రాకారంగా ఏడేళ్ళకు, పదకొండు, ముప్పైఐదూ, ఎనభైయ్యేసి సంవత్సరాలకు ఒకసారి తిరిగి, పునరావృత్త మౌతుంటాయి.

అదే సమయంలో భూమ్మీద అన్యాయమూ, అక్రమమైన సాంఘిక పరిస్థితులుగానీ, రాజకీయ పరిస్థితులుగానీ వుంటే, అప్పుడు విప్లవానికి కావలసిన పరిస్థితులూ తయారౌతుండవచ్చు. ఈ పరిస్థితులు సూర్యగోళం నుంచీ ధారాపాతంగా వచ్చే శక్తి తరంగాలవల్ల రాజకీయ నాయకుల ఆలోచనలను, వాళ్ళ మెదడులోని నరాలనూ ప్రకోపించి నిశ్చయాలను ఉధృతం చేస్తాయి.'' అనే నిర్ణయాలుగా మారి రాజకీయ సంఘటనలకు దారితీస్తాయి''

విస్తారమైన రష్యన్ రీసెర్చిరిపోర్టు (Research Report)లు చదివితే ఇవే ఒక గ్రంథంగా రాయవచ్చు. దీనివల్ల ఎక్కువగా సూర్యగోళంలో మార్పులు

ఒక్కమాటలో చెప్పాలంటే ఈ రష్యన్ సైంటిస్టుల పరిశోధన సారాంశం ఇది సూర్యుడూ, గ్రహాలూ. వాటి రేడియో తరంగాలూ, గామా కిరణాలు, ప్రొటాన్ ప్రసారం, మచ్చలూ వంటి శక్తులు నిత్యం భూమ్మీదకి ధారాపాతంగా వర్షిస్తాయి. కనుక భూమిమీద ఒకచోట ఏ ప్రసారం ఎంతబడుతుందో అన్నది ఆయా గ్రహాలు భూమిచుట్టూరా ఎలా'అమరి' (arrangement) వున్నాయో దాన్ని బట్టి ఆధారపడుతుంది. భూమి చుట్టూవున్న గ్రహాల స్థితియేగదా 'జాతకం'?

ఈ తరంగాల ప్రభావం అతిసున్నితమైన మెదడులోని నరాలపై ఎక్కువగా వుంటుంది గనుక, వేదంలో మనిషి పుట్టేముందు శిరస్సు ఉదయించే కాలానికి ఇంత ప్రాముఖ్యత నివ్వటం జరిగింది! అలాగనే రష్యాలో జరుగుతున్న జ్యోతిష పరిశోధనలో ఇంకో విచిత్రమైన అంశంకూడా వున్నది. దేమిటంటే మానవశరీరం మీద గ్రహాలు ఎలా పనిచేస్తాయో ఆ 'విధానాన్ని' కూడా పట్టుకొనేందుకు రష్యన్ పరిశోధకులు విశ్వప్రయత్నాలు చేస్తున్నారు.

ఈ గ్రహాలు సూర్యుడూ మన మనస్సుమీద పనిచేస్తున్నాయా? లేక సూర్యుడినుంచీ గ్రహాల నుంచీ వచ్చే రేడియోధార్మిక కిరణాలవంటి ప్రసారంగాని, 'అయస్కాంత పరిధి' () వంటిశక్తిగాని, భూమిమీద వున్న మన అయస్కాంత పరిధి ద్వారా మానవజాతిని ఈ విద్యుత్తు (కరెంటు)తో 'పురికొల్పు'తున్నాయా? మనిషి మెదడులోని జీవకణాలమీద బయట అంతరిక్షంలోంచి వచ్చే అనేక రకాల 'కిరణాల' ప్రసారం యొక్క ఫలితాలు ఎలా వుంటాయో అన్న విషయం కూడా పరిశీలించడం జరుగుతోంది. రష్యాలో ఇంకా!

ఈ పరిశోధనలో సహజంగానే ఇతర సైన్సులు జ్యోతిష్యంతో సంయోగంపొంది ఒక విచిత్రమైన 'శాస్త్రముగా' తయారై. ఈ పరిశోధన ద్వారా క్రమంగా పెరుగుతున్నది. ఇది కేవలం ఏ ఒక్క శాస్త్రమూ కాకుండా ఇతర సైన్సుల సమ్మేళనంతో ఏర్పడటం జరుగుతుంది. ఈ మార్గాల్లో పరిశోధన

జరుపుతున్నవాళ్ళలో, రష్యాలోనేగాకుండా ఇంకా ఇతర కమ్యూనిస్టుదేశాల్లో కూడా ఎంతో పరిశోధన జరిగింది. ఇందులో 'జెకొస్లోవాకియా' లోని డా॥ జోనాస్ కనిపెట్టిన 'జ్యోతిషం-సంతాన నిరోధం' బల్గేరియా పోలెండు బ్రాటిస్లేవియా లలో ''జ్యోతిషం-హఠయోగం'' మీద జరిగిన పరిశోధనలు ఎంతో ముఖ్యమైనవి. ఇవి విపులంగా తరువాత గ్రంథంలో వివరించడం జరిగింది. ఇక్కడ మాత్రం చూచాయగా కొందరు పరిశోధకుల పేర్లు వారు చేస్తున్న పనిని సూచించడం మాత్రమే ఈ అధ్యాయం యొక్క ఉద్దేశ్యం.

మనస్సుయొక్క ఏకాగ్రతశక్తిని ఉపయోగించి పదార్థాన్నీ ఇతర వస్తువులనూ కదిలించగల ''PK-శక్తి'' మీద కూడా గ్రహాల ప్రభావం ఎలా వున్నదో ఆ ''జ్యోతిష'' ఫలితాలను కూడా పరిశోధించడం జరుగుతోంది. ''అతీంద్రియ శక్తుల''మీదా, ''దివ్యశక్తుల''పైన గ్రహాలకు ఎటువంటి ప్రభావం వున్నదో, మనిషి మనస్సు పనిచేసే తీరును గ్రహాలు ఏవిధంగా ప్రభావితం చేస్తాయో, ఇంకా ఇటువంటి అంశాలు ఎన్నిటిపైనో, అపూర్వం ఆశ్చర్యం అయిన పరిశోధనలు జేస్తున్నాడు ''జెక్'' సైంటిస్టు - డా॥ ''రజ్‌డాక్'' (Dr॥ Zbenek Rajdak) ఇదే మాదిరిగా హఠయోగంలో శరీరంలో వున్న ''ఏడు చక్రాల''పైనా బైటగ్రహాల ప్రభావం - ఒక్కో చక్రంమీద ఎలా పనిచేస్తున్నదో కూడా పరిశోధిస్తున్నాడు.

ఇది రష్యాలాంటి నాస్తికవాద దేశాలలో యాభైయేళ్ళ రహస్య-పరిశోధన!! ఇంకా ఈ మధ్య. ఇటీవల, వీళ్ళు ఎన్ని కొత్తవిషయాల మీద పరిశోధనలు చేస్తున్నారో పట్టించుకునే ''కమ్యూనిస్టు''లు మన దేశంలో ఇంకా పుట్టాల్సిందేమో! రష్యాలో సూర్యుడు ఉదయించినా మన ''కామ్రేడ్''ల మెదడులో ఉదయించాలి గదా!



'స్టాలిన్ మనుమరాళ్ళు చెప్పిన అనుభవాల్లో అతి విచిత్రమైన దొకటుంది! అందులో ఉల్ఫ్‌మెస్సింగ్, స్టాలిన్ యొక్క మకాములోకి ఎటువంటి 'గేట్‌పాస్' లేకుండా, అనుమతి లేకుడా ప్రవేశించాలి! స్టాలిన్ ఉండే 'దాచా' అంటే 'పల్లెటూరి మకాం' చుట్టూరా ఎప్పుడూ సాయుధులైన దళాలు కాపలా వుండేవారు. స్టాలిన్ ఇంట్లో పనిచేసే అనుచరులూ, సిబ్బందీ అందరూ కూడా రష్యాలోని రహస్య పోలీసు శాఖలలో సభ్యులే.

ఆరోజు స్టాలిన్ మకామైన 'దాచా' (Dacha)లో పెద్దడైనింగ్ టేబుల్ ముందు కూర్చుని, కుప్పలుగా పడివున్న ఆఫీసుకాయితాలు చూస్తున్నాడు! ఇంతలోకే ఎవరికీ అలికిడి కాకుండా నల్లజుట్టుగల ఒక పొడుగాటివ్యక్తి, స్టాలిన్ ఇంట్లో ప్రవేశించాడు! ఎవరూ ఏమీ అనలేదు సరిగదా, స్టాలిన్ అంగరక్షకులు కూడా గౌరవంగా 'ఎటెన్షన్' (Attention)లో నిలుచున్నారు. అలాగే స్టాలిన్ ఇంట్లోని సిబ్బంది కూడా దారి ఇచ్చి తొలిగారు. ఆ నల్లజుట్టుగలవ్యక్తి సరాసరి లోపలికి వెళ్ళి ఒక పెద్దహాలులో ప్రవేశించి. అక్కడనుంచి ప్రక్కనున్న గదులలో ఒక గదిలోనుంచి ఇంకో గదిలోకిపోతూ చివరికి ఆ గదులన్నీ దాటి స్టాలిన్‌వున్న గదిలో ద్వారం దగ్గర నిలబడి లోపలికి చూశాడు! డైనింగ్ టేబుల్ దగ్గర కూచుని రాసుకుంటున్న స్టాలిన్ తలఎత్తి అతనివైపు చూశాడు. ఒక్కసారిగా తనముందు నిలబడిన ఉల్ఫ్‌మెస్సింగ్‌ను చూసి స్టాలిన్ నిర్ఘాంతపోయాడు. ఇది ఎలా సాధ్యం ఎలా లోపలికి ప్రవేశించగలిగాడు ఉల్ఫ్‌మెస్సింగ్, ఏ అనుమతి లేకుండా? - చాలాకాలం తర్వాత తన అనుభవాన్ని మెస్సింగు ఇలా చెప్పాడు - 'నేను మనస్సులో తీవ్రంగా సంకల్పించి, ఆ సిబ్బంది మనస్సులపైనా, అక్కడ పనిచేసే మనుష్యులపైనా, 'నేను బెరియాని' అనే ఆలోచననే మళ్ళీ మళ్ళీ మారుమ్రోగేలా చేశాను'- అని. ఆశ్చర్యం ఏమిటంటే స్టాలిన్ ఇంట్లో వున్న రహస్య పోలీసుశాఖలో పనిచేసే సిబ్బంది అందరూ, స్టాలిన్ ఇంటికి నిత్యం వస్తూ పోతూవుండే పోలీసు అధికారి ఐన 'లావ్రెంటి బెరియా'నే

* "I am a Telepathist" నేను ఆధ్యాత్మిక శక్తులున్న వ్యక్తిని అన్న ప్రచురణ నెం.14లో ఉల్ఫ్‌మెస్సింగ్ (Wolf Messing) ప్రచురించినవి చూడవచ్చును.

లోపలికి వస్తున్నట్లు చూశారు ఆరోజు! అందుకే గౌరవంగా దారిచ్చి తప్పుకున్నారు! ఆ రోజుల్లో రష్యన్ గూఢచారి పోలీసుశాఖకు అధికారి అని! కాని రూపురేఖలో 'బెరియా'కు ఉల్ఫ్‌మెస్సింగుకు అసలు పోలికలు లేవు, అదే ఆశ్చర్యం! ఉంగరాల జుట్టుతో వున్న ఉల్ఫ్‌మెస్సింగుకూ కళ్ళజోడు పెట్టుకునే 'బెరియా'కు ఎంతో తేడా కనీసం పోలికకోసమైనా 'బెరియా' ధరించే ఒంటికంటి కళ్ళ అద్దాన్ని కూడా పెట్టుకోలేదు ఉల్ఫ్‌మెస్సింగ్, బాహ్యంగా పోలికలకోసం వేషం మార్చనక్కరలేదు - తన అద్భుత ఆధ్యాత్మిక శక్తేచాలు ఉల్ఫ్‌మెస్సింగ్‌కు!

ఆ రోజుల్లో మాస్కోలోని చాలామంది ప్రముఖులు మెస్సింగుతో స్టాలిన్ జరుపుతున్న పరీక్షలూ ఆశ్చర్యకరమైన అనుభవాలు ఎరుగుదురు! ఇందులో చాలామంది మాస్కోలో ఉన్నతమైన పదవులలో వ్యక్తులు, వీరిలో కొందరు మెస్సింగ్ ప్రమాదకరమైన వ్యక్తి అని కూడా భావించడం జరిగింది. ఫలితంగా ఉల్ఫ్‌మెస్సింగ్ రహస్య పోలీసుశాఖచేత అనేకసార్లు పోలీసు 'చెకింగ్'కు గురి అయినవాడు, ఫలితం ఏమైందంటే, ఉల్ఫ్ మెస్సింగ్‌కు సోవియట్ ప్రభుత్వంలోని అగ్రస్థాయి నుంచి ఉన్నతాధికారాలు అదివరకే లభించివున్నట్టు తేలింది! అంటే అతను అడ్డులేకుండా సోవియట్ రష్యాలో ఎక్కడైనా తిరగవచ్చు.

ఉల్ఫ్‌మెస్సింగ్‌కు ఒక్క స్టాలిన్‌తోనేకాదు ఇంత సన్నిహితసంబంధం ఉండేది రష్యాలోని రసాయన శాస్త్రవేత్త నోబుల్ ప్రైజు పొందిన డా॥నికోలాయి, సిమ్యోనోవ్ (Dr॥ Nikolai Semyonov) వంటి ప్రముఖులు, ఆనాటి సోవియట్ సమాజంలో అతి ఉన్నతమైన పదవులు గౌరవస్థానాలు అధిష్టించిన అనేక మంది గొప్ప పూజనీయుడుగా పవిత్రంగా గౌరవించదగిన వ్యక్తిగా, చూచేవారు ఉల్ఫ్‌మెస్సింగ్‌ను, దీనికి ఉదాహరణ కావాలంటే 1966 సెప్టెంబరు, 'సైన్స్ -మతము' అనే పత్రికలో - రష్యాలోని సైన్సు అకాడమీలో వైస్ ప్రెసిడెంట్‌గా వున్న డా॥ నికోలాయి సిమ్యోనోవ్ ఇలా వ్రాశారు - ఉల్ఫ్‌మెస్సింగ్ వంటి

కున్నాడు. అది 1937వ సంవత్సరం ఓనాడు ఇల్లువదలి బజారులోకి వెళ్లాడు. మెస్సింగ్ అంతే! జర్మన్ సైనికులతన్ని నిలేశారు అనుమానంగా చూస్తూ-

'ఎవరు నువ్వు'?- అన్నాడొక అధికారి.

''నేనొక ఆర్టిస్టును''- అన్నాడు మెస్సింగు.

''కాదు, నువ్వు ఉల్ఫ్‌మెస్సింగ్‌వు కదూ! మా నాయకుడు హిట్లరు చనిపోతాడని భవిష్యత్తు చెప్పింది నువ్వేకదూ' - జవాబు చెప్పనీయకుండానే మెస్సింగ్ జట్టును అందిపుచ్చుకొన్నాడు. ఆ జర్మన్ సైన్యాధికారి, బలమైన ఒక్కగుద్దుతో మెస్సింగ్ నోటిలోనుంచి రక్తంకారింది. ఆరుపళ్ళు కదిలి క్రిందపడ్డాయి. ఆ వ్యక్తి తన జేబులోనుంచి చిన్నపుస్తకం తీసి అందులోని అనుమానితుల ఫోటోలలో వున్న మెస్సింగ్ ఫొటోను జాగ్రత్తగా పరిశీలించి మళ్ళీ మెస్సింగ్ మొహంలోకి పరిశీలనగా చూస్తున్నాడు - ఆ సంఘటన గుర్తుచేసుకుంటూ మెస్సింగు యిలా చెప్పాడు - 'మెరుపులా నాకో విషయం తట్టింది. ఆ క్షణంలో పోలెండు వదలి పారిపోవాలి లేకపోతే నాకు చావు తప్పదనుకున్నాను. నాకున్న యావత్తు శక్తినీ మనస్సులోకి కూడతీసుకొని ఆ పోలీస్ అధికారి కళ్ళలోకి కేంద్రీకరించి చూశాను. వాళ్ళందరూ ఒక రూములో సమావేశం కావాలని తీవ్రంగా సంకల్పించి ఆ ఆలోచనను వాళ్ళపై ప్రవేశ పెట్టాను. వెంటనే అందరూ గబగబా ప్రక్కనున్న రూములోకి వెళ్ళారు. ఆ పోలీసు అధికారులు, సెంట్రీలు, అందరూ ఆ గదిలో ఓ సమావేశంలా గుమిగూడారు. వారంతా నా మనస్సుయొక్క ప్రభావానికిలోనై వున్నారని గ్రహించాను. చప్పున నేను బయటికి వచ్చి గది తలుపులకు బయట ఒక ఇనుపగడియ బిగించి పారిపోయాను''.- అన్నాడు మెస్సింగు నవ్వుతూ చాలాకాలం తర్వాత.

ఆరాత్రే మెస్సింగ్ వార్సా వదలి పోలెండు సరిహద్దుకూడా దాటి రష్యాలో ప్రవేశించాడు. ఆ రోజు రాత్రికే మెస్సింగ్‌తండ్రి అతని సోదరులు కుటుంబ సభ్యులు యావత్తు వార్సాలో ఘోరంగా నాజీలచే హత్య చేయబడ్డారు. నాజీల

ధాటికి ఆగలేక రష్యాలోకి పారిపోయివచ్చిన పోలెండు కాందిశీకులతో కలసి 'తోవిస్క్' ప్రవేశించాడు మెస్సింగ్. అతనికి రష్యన్ భాషకూడారాదు. బ్రతుకు తెరువుకోసం ఎంతో ప్రయత్నించాడు రష్యాలో కాని రష్యాలో పోలీస్ అధికారులు "ఈ దేశంలో జ్యోతిషాలు, భవిష్యత్తులు చెప్పే మంత్రగాళ్ళకు స్థానంలేదు" అని ఖచ్చితంగా చెప్పారు. అదివిని, మెస్సింగ్‌కు మతిపోయినట్లయింది. "ఆధ్యాత్మిక శక్తులనేవి అబద్ధం అని నమ్మేవాళ్ళు ద్రోహులు ఇలాంటి మనస్తత్వంగల రష్యన్‌లతో లాభంలేదని గ్రహించాడు మెస్సింగ్. కమ్యూనిష్టు మనస్తత్వంతో గుడ్డి నాస్తికత్వాన్ని నమ్మే రాజకీయ శిక్షణకు మనస్సులు అంకితం చేసిన ఆ మనుషులతో, స్వంతంగా ఆలోచించే శక్తిలేని ఆ పార్టీ కార్యకర్తలతో, అందులోనూ ఆనాటి 'స్టాలిన్‌రష్యా'లో వున్న పరిస్థితులు తనకు చాలా ప్రమాదమని గుర్తించాడు మెస్సింగ్.

బహుశ తన అద్భుత మానసికశక్తులు ప్రదర్శిస్తే నిజాన్ని చూస్తేనన్నా అలాంటివి అసంభవమనే విశ్వాసం కల్గుతుందని మెస్సింగ్ ప్రయత్నించాడు. ఆ రోజునుంచి ప్రారంభమయింది. ఉల్ఫ్‌మెస్సింగ్ అద్భుత జీవితం మెస్సింగ్ ఆ తర్వాతకాలంలో తనశక్తుల గురించి ఇలా అంటాడు.

"ప్రజల ఆలోచనలు నాకు సినిమాలోని బొమ్మల్లాగా స్పష్టంగా కనబడతాయి. దూరాన జరిగే విషయాలైనా, ఇతరుల మనస్సులోని ఆలోచనలైనా, టెలివిజన్ స్క్రీన్‌మీద బొమ్మల్లాగా కనబడుతాయి. ఇందులో అంత ఆశ్చర్యమేమీలేదు. అంతేకాదు ప్రతిమనిషికీ సహజంగానే వుంటుంది ఓదైవశక్తి కృషిచేస్తే దానిని క్రమముగా వృద్ధిచేయవచ్చ'ని కూడా అంటాడు మెస్సింగ్. చాలామంది వ్యక్తులు చిన్నతనంలోనే ఈ ఆలోచనలు గ్రహించేశక్తి కల్గివుంటారు. కాని వాళ్ళను పెంచే మనుష్యులలోని అవిశ్వాసం నాస్తికత్వం ఒక పెద్ద అడ్డంకిలాగ ఏర్పడి చిన్న మనస్సులోవున్న ఈ అద్భుతశక్తులను అణచివేస్తాయి. ప్రతిమనిషీ ఆధ్యాత్మిక శక్తులంటే అసంభవం అని అనేకసార్లు అనుకోవడం ద్వారా అదే నిజమని గుడ్డిగానమ్మటం జరుగుతుంది! దీనివల్ల జరిగే ప్రమాదం

14

# మిఖైల్ కునీ - దివ్యశక్తులు

రష్యాలో రాజకీయంగా పరిపాలిస్తున్నది కమ్యూనిష్టు ప్రభుత్వమే అయినా - రష్యాలోని రాజకీయ వ్యక్తులు ఆధ్యాత్మిక శక్తులన్నా, దేవుడన్నా, జ్యోతిష్యం అన్నా విశ్వాసం ప్రజలలో కలగకుండా అణచివేయాలని ఎంత ప్రచారం సాగిస్తున్నా కొంతమంది విచిత్ర వ్యక్తులలో కనబడే ఆధ్యాత్మికశక్తులు అందరినీ ఆశ్చర్యంలో ముంచివేస్తున్నాయి.

స్టాలిన్ ముందు అనేక విచిత్ర ప్రదర్శనలు ఇచ్చిన ఉల్ఫ్‌మెస్సింగ్‌లాగే అనేక ఆధ్యాత్మిక శక్తులు కల్గినవ్యక్తి ''మిఖైల్‌కునీ'' 'కునీ' ఇప్పుడు '60'వ పడిలో వున్న వృద్ధుడు ముడతలుపడ్డ అతనినుదురూ, పంచదార వంటి జుట్టుతో చూస్తే ఆయన ఏదో విచిత్రమైన ధ్యానంలో వున్న మనిషిలా కనిపిస్తాడు. ఈయన ఉల్ఫ్‌మెస్సింగ్‌లాగే రష్యాలో వేలాది జనముదు తన ఆధ్యాత్మికశక్తుల ప్రదర్శనలు ఇచ్చాడు. రకరకాల పరీక్షలకు నిలబడి విజయం సాధించాడు.

'మిఖైల్‌కునీ' యొక్క ఆధ్యాత్మికశక్తులపైన పరిశోధనలు చేసిన 'ఎడ్వర్డ్ నావ్‌మోవ్' అనేక పరీక్షలుపెట్టి ఆయన పరిశీలించిన తరువాత తన అభిప్రాయాన్ని ఇలా వ్యక్తం చేశారు.

'ఆయనకు నిజంగా ఆశ్చర్యం గొలిపే దివ్యశక్తులు సహజంగానే వున్నాయి. ఈ విషయంలో ఎలాంటి సందేహమూ లేదు' అని.

ఈ విషయం చాలాకాలం క్రిందట 'మిఖైల్‌కునీ' చిత్రకళ నేర్చుకుంటూ విద్యార్థిగా వుండేరోజులలో జరిగింది. ఈ ఆధ్యాత్మిక అనుభవాన్ని 'కునీ' తన సొంత మాటలలో ఇలా వివరించాడు- ''ఆరోజు నాకో భయంకరమైన కల వచ్చింది అది ఒక పీడకల. అందులో మా తల్లిని ఒక ఎలుక కరిచినట్లుగా స్పష్టంగా కనిపించింది. ఆ కల చూస్తున్నంతసేపూ నేను నిజంగా అక్కడే ఉన్నట్లుగా ఆవేశంకూడా కలిగింది. అక్కడి పరిస్థితి అంతా నా కళ్ళకు కట్టినట్లుగా కనిపించింది. ఎందురుగా నా తల్లి మంచంమీద పడుకొనివుంది. భయంతోనూ, బాధతోనూ పాలిపోయివుంది. ఆమె ముఖంచూస్తే, ఆమె మృత్యువుకు దగ్గరలో వున్నట్టు అనిపించింది'- ఈకలలో ఉలిక్కిపడి మేలుకున్నాడు ''మిఖైల్ కునీ'' కిటికీలోంచి విచారంగా బయట కురుస్తున్న మంచులోకి చూస్తూ తన తల్లికి ఏదో ప్రమాదం రాబోతున్నట్టు శంకించాడు. ఆ రోజల్లా అతని స్నేహితులతో కులాసాగా గడపలేక పోయాడు. మిత్రులు ఎంత నవ్వించినా అతని దిగులు పోలేదు.

మధ్యాహ్నానికి ''కునీ'' ఇంటినుంచి ఒక ''టెలిగ్రామ్'' వచ్చింది. మాస్కోకు కొన్నివందలమైళ్ళు పడమటగావున్న 'కునీ' స్వగ్రామము నుంచి ఫిబ్రవరి 21వ తేదీన వచ్చిన ఆ టెలిగ్రామ్- ''తల్లిప్రమాదంగా జబ్బుతో వున్నది. వెంటనే బయల్దేరిరావలసింది''అని. ఆ టెలిగ్రామ్ అందగానే ఆదరా బాదరాగా సామానులు సర్దుకొని ఆరోజే బయలుదేరివెళ్ళాడు ''కునీ'' మర్నాడు యింటికి చేరుకున్నాడు. పరుగుపరుగున ఇంట్లోకివెళ్ళి చూస్తే అతనితల్లి చాలా ''సీరియస్''గా జబ్బుపడి వున్నది. మంచంమీద పడుకొనివున్న

తల్లిని, ఆ గదిలోని దృశ్యమూ, అంతా చూడగానే అకస్మాత్తుగా తనకలలో కనిపించిన దృశ్యమే ఎదురుగా వున్నట్టయింది. తల్లి మంచంమీద పడుకొని వున్నది. బాధతో, భయంతో పాలిపోయి సరిగ్గా అంతకు పదిరోజులముందే - అంటే ఫిబ్రవరి 11వ తారీఖునే ఆమెకాలును ఒక ఎలుక కరిచింది. ఆకాటు పెద్దలోతుగాదిగలేదు. ఆ రోజు అశ్రద్ధచేశారు. అది కొద్ది రోజులకల్లా 'సెప్టిక్' అయి విషజ్వరంకూడా ప్రారంభించింది. చివరికి కాలు తీసి వేయవలసినంతగా కుళ్ళిపోయి ప్రమాదస్థితిలో వున్నది. అతడి తల్లికి 20వ తేదీకల్లా జ్వరం తీవ్రంగా వున్నది. ఆమెను పరీక్షించిన డాక్టర్లు ఆమెకు రక్తం చక్కెర వున్నందువల్ల మధుమేహ (Diabetis) వ్యాధి మూలంగా చాలా ప్రమాదస్థితిలో వుందని నిర్ణయించారు. ఆ సమయంలో అతనితల్లి ప్రాణాలపైన ఆశ వదులుకుంది. దూరాన వున్న తన కొడుకుని చూడాలని గట్టిగా మనసులో సంకల్పించినది. ఈ అనుభవాన్ని గురించి వివరిస్తూ 'కునీ' ఇలా అంటాడు.

'తీవ్రమైన ఆవేశంలో వున్న నాతల్లి ఆనాటి మనస్తత్వం- ఆందోళన ఒత్తిడి చేయగా ఆమె మనస్సులోని ఆధ్యాత్మికశక్తి ఒక్కసారి మేల్కొన్నది. దానితో ఆమె మనస్సులోని అతీంద్రియ భావతరంగాలు టెలివిజన్‌లోని చిత్రాలవలె నా మనస్సులోకి ప్రసారం చేయబడ్డాయి'- అంటే ఆమె మనస్సులోని ఆందోళనకూడా రేడియో ప్రసారంలాగా ''కునీ'' మనసులోకి ప్రయాణం చేసింది.

ఆరోజు నుంచీ జబ్బుతో మృత్యుముఖంలో వున్న తన తల్లి అనుభవం 'కునీ' జీవితాన్ని మార్చివేసింది. ఆ రోజు నుంచి తను నేర్చుకుంటున్న చిత్రకళ వదలివేసి ఆధ్యాత్మిక పరిశోధనలో లీనమయినాడు ''మిఖైల్‌కునీ''! ఫలితంగా రష్యా అంతా ప్రఖ్యాతినార్జించిన అద్భుత మానసికశక్తులకు అధికారి కాగలిగాడు.

''కునీ'' పరిశోధనలు విచిత్రమైనవి. మామూలు వ్యక్తులకన్నా మూగవాళ్ళు, చెవిటివాళ్ళు తమభావాలను మనస్సుతోనే ఆధ్యాత్మికంగా

ఇతరులకు అందేలాగ దివ్యదృష్టివలె ప్రసారం చేయగలరు. ముగ్గురు మూగవాళ్ళు ఒకరోజు 'కునీ'తో పాటు ఒకే విమానంలో ప్రయాణించారు. విమానంలో ఇద్దరు మూగవాళ్ళు ఈయనకు ముందు వరుసలో కూర్చున్నారు. ఇంకొక స్త్రీ 'కునీ' కూర్చున్న వరుసలోనే కూర్చుంది. ఆమె పుస్తకం చదువుకుంటూ మధ్యలో తలఎత్తి ఎదుటకూర్చున్న మూగవాడివంక చూసింది! ఆమె ఏమీ మాట్లాడకపోయినా ఎదురుగా కూర్చున్న ఆ మూగవ్యక్తి తన్ను పిలిచినట్టుగా వెనక్కి తిరిగి ఆమె కేసి చూశాడు. ఇలా పరస్పరం మూగవాళ్ళు ఆలోచనతో మాట్లాడుకోగలరనే సూత్రం 'మిఖైల్‌కునీ' మనస్సులో మెరుపులా మెరిసింది. ఇదే ఆయన కొన్ని సంవత్సరాల తరువాత చెవిటి, మూగవారిలోని ఆధ్యాత్మిక శక్తులపైన చేసిన పరిశోధనకాధారం.

''ఉల్ఫ్‌మెస్సింగ్'' 'మిఖైల్‌కునీ' ఈ ఇద్దరి అభిప్రాయాలూ ఒకటే - మూగవాళ్ళు, చెవిటివాళ్ళు ఆధ్యాత్మికంగా ఆలోచనలను ఎక్కువ బలంగా ప్రసారం చేయగలరు. ఎందుకనీ అంటే సహజంగానే వారికి వినడం, మాట్లాడటం అనే శక్తి లోపించటంవల్ల మామూలు మాటలద్వారా ప్రసారం చేసే ఆలోచనలు బహిర్గతం చేయడానికి వీల్లేక లోపలే అణచబడి వుండి ఆ ఆలోచనలను మరింత తీవ్రం చేస్తాయి. ఇందువల్ల వారు మనస్సుద్వారానే ఆలోచనలను ప్రసారం చేయడానికి తగినంత ఒత్తిడి వారిజీవితమే ఇస్తుంది. ఇదే వారిలోని ఆధ్యాత్మిక శక్తులను మేల్కొలుపుతుంది.

'మిఖైల్‌కునీ' తనమనస్సుతో తాను సంకల్పించిన పని ఎదుటవానిచేత చేయించగలడు - వాళ్ళకే తెలియకుండా! ఆయనచేసిన మానసిక పరిశోధనలు ఆయనే ఇలా వర్ణించాడు-

''నేను నా కుడిచేతిలో ఒక గ్లాసులో వేడిగావున్న టీపోసినట్టు అనుకున్నాను. నా చేతివేళ్ళు ఆ టీ వేడికి వెచ్చబడటం గమనించాను. నా చేతితో వేడిగా తగిలే ఈ స్పర్శానుభవాన్ని దూరంగా అవతల గదిలో కూచున్న ఏడుగురు వ్యక్తులకు అందించవచ్చని తోచింది. అవతల వ్యక్తుల గురించి

గట్టిగా మనస్సులో తలచుకున్నాను. వాళ్ళను అంతకుముందే హిప్నటిజంతో యోగనిద్రలోకి పంపేశాను. ఆ తర్వాత ఆ ఏడుగురు వ్యక్తులను అడిగితే అందరికి కుడిచేతిలో ఏదో వేడిగా, వెచ్చగా తగిలిందని తమ అనుభవాన్ని వర్ణించారు.

ఇదయింతర్వాత నా చేతిని ఒక సూదితో గుచ్చుకున్నాను! అంతే! ఇక వాళ్ళని ప్రశ్నించాల్సిన పనిలేక పోయింది. అవతల గదిలో ఉన్న వ్యక్తులు కెవ్వుమని కేకపెట్టారు. ఇదే పరిశోధనను అనేకసార్లు మళ్ళీ మళ్ళీ చేశాను. ఒకసారి 15 మంది, ఇంకోసారి 20 మంది మనుషులతో, ఇదే ఫలితాలు కనిపించాయి.

అలాగే ఇంకోసారి తనశక్తులను పరిశీలించడానికి వచ్చిన ఇద్దరు సైంటిస్టులను చూసి తన ముందున్న తెల్లకాయితంమీద పెన్సిల్‌తో గబగబా ఏదో వ్రాసి దాన్ని బోర్లించి టేబుల్‌మీద పెట్టాడు. అక్షరాలుపైకి కనిపించకుండా ఇంతలో ఆ సైంటిస్టులలో ఒకరు చెయ్యి అప్రయత్నంగా చెవిమీదకు పోనిచ్చి, చెవి వెనకగా గోక్కోవటం జరిగింది. 'మీరు కావాలనే చెవి గోక్కున్నారుకదూ? అంటూ "కునీ" నవ్వి తను టేబుల్ మీద బోర్లించి పెట్టిన కాయితంతీసి చూపెట్టాడు. దానిమీద "నీ కుడిచేత్తో చెవి వెనకాల గోక్కో!" అని వ్రాసివుంది! అవతల వ్యక్తి నిర్ఘాంతపోయాడు, తన శరీరం 'కునీ' చెప్పినట్లు పనిచేయడం చూసి.

"మీకపుడే మనిపించింది? మీ అనుభవాన్ని సరిగ్గా వివరించి చెప్పండి" అన్నాడు 'మిఖైల్‌కునీ'. నాకేమి అనిపించలేదు ఏదో చెవి దగ్గర గోక్కోవాలని అనుకోవటం జరిగింది. అపుడు చెవిదగ్గర దురద కూడా లేదు. ఏమీతోచక అప్రయత్నంగా చేయి చెవి దగ్గరకు పోయింది అంతే! అన్నాడా సైంటిస్టు.

మిఖైల్‌కునీ శక్తులలో ఇంకొక విచిత్రమైన చమత్కారం కూడా వుంది. అతనికి 12 ఏళ్ళప్పుడు స్కూల్లో ఓనాడు తోటికుర్రాడు తన జేబులోంచి

---

* "Potentials of Human memory"- (Technology for Youth) No. 1-1964

అగ్గిపెట్టె తీశాడు. అది చేయిజారి క్రిందపడి అగ్గిపుల్లలన్నీ కిందపడిపోయాయి. క్షణంలో కునీ కిందకిచూసి ''సరిగ్గా 32 పుల్లలున్నాయి'' అన్నాడు. క్లాస్‌మేట్లు ఒక్కసారి నవ్వారు. కాని తర్వాత ఒక్కొక్కపుల్లే లెక్కపెట్టి తెల్లబోయారు. అన్నీ లెక్కేస్తే సరిగ్గా 32 ఉన్నాయి. ఇది ''కునీ''లో అప్రయత్నంగా వున్న అద్భుతశక్తి. ఏ వస్తువువైనా - అగ్గిపుల్లాలూ, దువ్వెనపళ్ళూ అంతులేని అంకెలూ- చూడగానే ఎన్నివున్నాయో లెక్క పెట్టకుండా చెప్పగలడు. ఒకసారి 'కునీ' మెదడులో ఒక మెరుపు మెరుస్తుందా అన్నంత ఆశ్చర్యం వేస్తుంది!

ఎందుకంటే కొన్నేళ్ళకి పూర్వం ''మిఖైల్‌కునీ'' తనకున్న అద్భుతశక్తుల ప్రదర్శన ఇస్తున్నాడు. మాస్కోకి దగ్గరలో వున్న ''ఆటమ్‌గ్రాడ్'' (Atom grad) నగరం దగ్గర రష్యాలోని ప్రఖ్యాత సైంటిస్టుల ఎదురుగుండా తన ప్రదర్శనలు ఇస్తున్నాడు. కంప్యూటర్ లాంటి కునీబుర్ర ఎంతటి సంఖ్యలనైనాసరే క్షణకాలంలో అవలీలగా లెక్కించకుండా చెపుతుంది. ప్రదర్శనలోంచి ఒక వ్యక్తిని పిలిచి ఒక సుద్దముక్క ఇచ్చి దాంతో ఎదురుగా ఉన్న నల్లబల్లమీద లెక్కలేనన్ని గుండ్రంగా సున్నాలు వ్రాయమన్నాడు. ఒకదాని ప్రక్కన ఒకటి అంటుకుండేలాగ వ్రాసినా ఫరవాలేదు. ఒక సున్నాలోపల ఇంకోసున్నా రాసినా సరే, మీ ఇష్టము! - అన్నాడు కునీ.

'కునీ' స్టేజీదిగి హాలులోంచి బయటకు వెళ్ళాడు. కళ్ళకి గంతలు కట్టుకొని జనంవైపు తిరిగి నిలబడ్డాడు. సున్నాలు రాయటం అయ్యీ అవకముందే అతను ఆ సంఖ్యని చెప్పాడు- '167'అని. ఆ సున్నాలు గీసిన సైంటిస్టులు 'కునీ' క్షణంలో చెప్పిన ఆ సంఖ్యను లెక్కపెట్టి చూసేసరికి చాలాసేపు పట్టింది. కాని వాటిఅంకె సరిగ్గా సరిపోయింది. 'కునీ' ఇలాంటి అంకెలలో అసాధారణమైన శక్తులను ఎన్నో చూపెట్టాడు. ఆటమ్‌గ్రాడ్ నగరంలోని అణుశక్తి పరిశోధనా కేంద్రములోని సైంటిస్టులముందు సంఖ్యలతో ''కునీ'' చూపిన అద్భుతశక్తినిచూసి, ఆ సంస్థవారు- ''మేం సైంటిస్టులం కనుక 'కునీ' యొక్క మెదడును ఇటువంటి అద్భుతమైన సిద్ధులను

కలిగివున్నదని తెలుసుకోవటం జరిగింది. ఇదే ఇతరులకైతే సాధ్యం అయ్యేది కాదు''- అన్నారు!

మాస్కోలో ''కునీ''నిపరిశోధించడానికి రెండుపెద్ద నల్లబల్లలను వేరువేరు గదులలో పెట్టారు. ఆ గదులలో టి.వి. సర్క్యూట్ ఏర్పాటు చేయబడింది. ఈ పరిశోధనలను చేసిన సైంటిస్టు 'నావ్‌మోవ్' ఒక గదిలోని బోర్డుమీద పెద్దపెద్ద అంకెలు రాసుకుంటూ వెళ్ళి చివరికి బోర్డు అంతా ఖాళీ లేకుండా నిండిపోయేలా వ్రాసాడు. ఇలా రాయడం అయిన తరువాత రెండవగదిలో ఉన్న నల్లబల్లమీద 'కునీ' ఏమిరాశాడో వెళ్ళి పరిశీలించాడు వీళ్లు వెళ్ళడమే ఆలస్యం! అంతకుముందే ఆ బల్లంతా పూర్తిగా నింపివేయబడింది! ఆశ్చర్యం! ఒక్కటికూడా తప్పులేకుండా సరిగా ఏ అంకెలయితే ''నావ్‌మోవ్'' అవతల గదిలోని నల్లబల్లమీద వ్రాశాడో అవే నెంబర్లు! ఎక్కడా తేడాలేదు!

అకస్మాత్తుగా పెద్దసంఖ్యలో వేటినైనా లెక్కపెట్టకుండా చెప్పగల శక్తిని సంస్కృతంలో ''అక్షవిద్య'' అంటారు. మహాభారతంలో నలదమయంతుల కథలో 'ఋతుపర్ణుడు' అనే మహారాజు 'మిఖైల్‌కునీ' వంటి అద్భుతమైన శక్తిని ప్రదర్శించాడు.

రథం వేగంగా పరిగెడుతోంది దమయంతి స్వయంవరంకోసం. ఋతుపర్ణుడు ఎక్కిన రథాన్ని నలమహారాజు వేగంగా తోలుతున్నాడు. అకస్మాత్తుగా దారి ప్రక్కన వున్న ఒక చెట్టును చూపించి ఋతుపర్ణుడు దానిమీద ఎన్ని ఆకులున్నాయో, నలుడుకి చెప్పాడు. నలుడు ఆశ్చర్యపోయి రథం ఆపి తాను దిగివెళ్ళి చెట్టును నరికి ఆకులను లెక్కించాడు. ఆశ్చర్యం! సరిగ్గా ఋతుపర్ణుడు చెప్పినన్ని ఆకులే ఆ చెట్టుకి ఉన్నాయి!

తరువాత ఈ ''అక్షవిద్య''ని ఋతుపర్ణమహారాజు నలునికి నేర్పడం జరిగింది. దీనివల్ల నలుడుని పట్టుకుని పీడిస్తున్న 'కలి' ఈ విద్య యొక్క ప్రభావంతో అతడిని విడిచిపెట్టింది. తరువాత ఆ నలమహారాజు కష్టాలు తొలగి తన సామ్రాజ్యం తిరిగి తాను పొందాడు.

పై భారతగాథలో 'అక్షవిద్య' తోపాటు కలియొుక్క ప్రభావం నశించడం అన్నసూత్రం ముడిపెట్టడంలో ఉన్న రహస్యస్వార్థం ఏమిటి? ఎవరు చెప్పగలరు? ఇది కూడా మళ్ళీ రష్యన్‌సైంటిస్టులు ఒకనాడు పరిశోధనచేసి దాన్ని మనకి విడమరచినపుడే ''కలియుగం అంతంకావటం'' జరగవచ్చు. ప్రాచీన భారత గాథలోని ''అక్షవిద్య కలియొుక్క అంతమూ'' అభూతకల్పన కాదని ఆనాటి భారతీయులలో వుండే అపూర్వమైన విద్య అని 'మిఖైల్‌కునీ' యొుక్క అద్భుతశక్తుల పరిశోధనవల్ల ఋజువయింది.



**15**

# రష్యాలో - "యుగం-మార్పు!"

మానవజాతి చరిత్రలోనే ఒక నూతనయుగం ఆరంభమవుతున్నది! ఈ భూమిమీద జరిగే మానవ పరిణామంలో ఇప్పుడు ఒక నూతనదశలోకి అడుగు పెట్టబోతున్నది మానవజాతి. అంటే జీవుల పరిణామంలో ఒక ముఖ్యమైన మెట్టు ఆరంభం కాబోతున్నది. ఏమిటో తెలుసుకుందాం!

కోట్ల సంవ్సరాల క్రిందట ఈ భూమ్మీద ఎప్పుడో సూక్ష్మజీవుల రూపంలో జీవులు సృష్టి అయ్యాయి. అనాదికాలంలో ఆరంభమయిన ఈ సూక్ష్మజీవుల పురోగతి డార్విన్ పరిణామ సిద్ధాంతం ప్రకారం మెట్లుమెట్లుగాపైకి ఎక్కుతూ పోయి క్రమంగా వృక్షజాతులు - క్రిములు, కీటకాలు, జలజంతువులు. చేపలు వాటిలోంచి క్రమంగా నేలమీద భూమ్మీద సంచరించే కప్పలవంటి ఉభయచరాలు (Amphibials) ఆ తర్వాత కేవలం భూమ్మీద సంచరించే

సరీసృపాలు (Reptiles) వాటి నుంచి గాలిలో ఎగిరేపక్షులు, పిల్లలకు పాలిచ్చి పెంచే క్షీరదములు (Mammals) ఉద్భవించినాయి. అది ఈనాడు సైన్సుకూడా అంగీకరించిన పరిణామవాదం. ఇలా యుగయుగానికి భూమిలో వస్తున్న మార్పు, వాతావరణంలోని మార్పులవల్ల, జీవరాశి ఒక్కొక్క మెట్టుపైకి ఎక్కవలసిన తీవ్రమైన పరిస్థితిని ఎదుర్కోవలసి రావడంతో, దాని నెదుర్కోవడానికి జీవులశరీరాల్లో మనస్సులో, విప్లవాత్మక పరిణామాలురావడం సైన్సుకు తెలిసిన సత్యమే! ఇలాంటి మార్పులకు జీవుల ప్రతీకార చర్యగానే (Reaction to environment) జీవులలో మేధస్సులేక ఆలోచించే సంకల్పశక్తి కలిగిన తెలివి ఉద్భవించి. తద్వారా ఈనాటి మానవజాతి ఈ భూమ్మీద అవతరించటం జరిగింది. తద్వారా ఈనాటి మానవజాతి ఈ భూమ్మీద అవతరించటం జరిగింది. జీవుల పరిణామంలో ఏర్పడే విపత్కర పరిస్థితులవల్లనే. పరిణామంలో ఒక మెట్టుపైకి ఎక్కటం ఇంతవరకూ జరుగతున్నపని! ఇది పరిణామం యొక్క స్వభావంలోనే ఉన్నది. ఈ భూమ్మీద ఎప్పుడు జీవుల పరిణామంలో ఒక మెట్టుపైకి వెళ్ళాలన్నా వాటి జీవన పరిస్థితులలో ఒక గడ్డు కాలం ఆసన్నమై పైకి పురోగమించని జీవులు నశించిపోయే పరిస్థితిని ప్రకృతి కల్పించడం జరిగింది. ఇలాంటి వాతావరణ మార్పుల చేపలు భూమ్మీదికి బలవంతంగా మార్పుచెంది స్థలచరాలుగా మారి, అలాగే వాతావరణంలోని వేడిమి పెరగటంతో అవి ఆకాశంలోకి ఎగరవలసిన విపత్కర పరిస్థితిలో 'పక్షులు'గా పురోగమించడం జరిగింది. 20వ శతాబ్దిలో సైంటిస్టులు జూలియన్ హక్లీ (Julian Huxley), బెట్రాండ్ రస్సెల్ (Betrand Russel), ఐన్‌స్టీన్, వంటి మేధావులు ఈ గడ్డుపరిస్థితులు ఏర్పడిన దానికి సమాధానంగానే, జీవరాశి పరిణామంలో ఒక్కొక్క మెట్టుపైకి పురోగమించవలసిన అత్యధిక విపత్కర పరిస్థితి (Strees of emergency) ఏర్పడినప్పుడల్లా జీవులు పరిణామంలో ఒక్కొమెట్టుపైకి ఎక్కి తమకంటే పైకి పురోగమించడం జరుగుతున్నదని అభిప్రాయపడ్డాడు. ఈ విషయం ఈనాటి సైన్సు అంగీకరించిన మహాసత్యమే. అయితే ఈ పరిణామ సిద్ధాంతం మానవజాతికికూడ వర్తిస్తుందన్న విషయమే

మానవజాతి ఎక్కువగా గుర్తించినట్లు కనబడదు. ఇపుడీ పరిణామ సూత్రాన్నే చరిత్రలో మానవజాతి పురోగమనానికి అన్వయించి చూద్దాం.

మానవుడు తన వివేకంతో ఈ భూమ్మీద ఆహారాన్ని, రక్షణను, బట్టలను, ఉంచటానికి ఒక నివాసాన్ని, అడవులలో ప్రమాదాల నుంచి రక్షించుకోడానికి ఆయుధాలు కనిపెట్టడం ద్వారా మానవజాతిలో 'సంస్కృతి' అనేది రూపొందింది. దీనితోపాటే పల్లెలు, పట్నాలలో సామాజిక జీవితంకూడా ఏర్పటయింది. మనిషి మనిషికి సంబంధాలు అడవిలోని జంతువుల్లాగ ఒక దాన్నొకటి చంపుకుంటూ బతికే జంతుదశలోంచి మనిషికి మనిషికి సహకారంతో జీవించే సమాజం ఏర్పాటు చేసుకున్నాడు మానవుడు. ఈ సహకార జీవనానికి రూపమే కుటుంబవము. కుటుంబవములోని అందరు వ్యక్తుల రక్షణకు, కలసి పనిచేయడానికి కావలసిన ఐకమత్యతకు అన్నదమ్ములు. అక్క చెల్లెళ్ళు, అనే రక్తసంబంధాలు ఏర్పడినాయి. దీనిద్వారా మనిషిని మనిషి దోచుకోవడం, మనిషిని మనిషి చంపుకోవడం అన్యోన్య హింసద్వారా ఆహారాన్ని, స్త్రీని, నివసించేందుకు స్థలాన్ని సంపాదించుకోవలసిన అగత్యం లేకుండా, మానవుడు ఒకరినొకరు గౌరవించుకోవడానికి ఒక సామాజిక ధర్మం సహకారం మీద ఏర్పాటు చేయబడింది. దీనితోనే మానవ సమాజంలో న్యాయం, ధర్మం అనే సూత్రాలు ఏర్పటు చేసుకున్నాడు మానవుడు. ఇదే మానవజాతియొక్క మానసిక పరిణామానికే మొదటిమెట్టు. దీనితో మానవజాతి అధ్యాయంలో ఒక నూతన యుగం ప్రారంభమయింది.

న్యాయం, ధర్మం అనే సూత్రాలను గుర్తించి అందరూ అన్యోన్య సహజీవనంతో, అన్యోన్య సహకారంతో జీవించే సమాజానికి ప్రారంభం చేయబడింది. దీన్ని ఆధారం చేసుకొని ఒక చట్టం, ఒక శాసనము. అందరు వ్యక్తులు ఒకే సూత్రాలను నిర్దుష్టంగా అమలు జరపాలనీ, దాన్ని వ్యతిరేకించిన వ్యక్తులకు శిక్షవేయడం, ఆ సమాజధర్మానికి అనుసరించి జీవించే వారికి సుఖశాంతులు అభ్యుదయం హామీ ఇవ్వడంకోసమే 'శాసనం' అనేది ఏర్పటయింది. ఇదే

రాజ్యాంగానికి మొదలు కావచ్చు. కుటుంబంలో తండ్రి ఎలాగైతే అందరు కుటుంబ సభ్యుల మంచి చెడులను సమానంగా పరితూచి, అందరికీ న్యాయాన్ని చేకూర్చే వ్యవస్థగా కుటుంబాన్ని ఎలా పనిచేయిస్తాడో, అదే విధంగా సమాజానికి ఒక నాయకుడు లేక కులపతి ఉండటం ఏర్పాటైంది. అదేరాష్ట్రానికొక రాజుగానూ దేశానికి ఒక సామ్రాట్టుగానూ ఏర్పడి మానవ పరిణామంలో మానసిక దశ ఇంకొక మెట్టుపైకి వెళ్ళింది. ఇంకా తర్వాత జరిగిన పరిణామాలను ఇక్కడ విస్తరించి చెప్పడం అవసరం కాదు. అది వేరేచోట వివరించబడింది. మానవ పరిణామంలో ప్రతివ్యక్తీ నిత్యజీవితంలో తన స్వభావానికి తగిన కర్మలను చేస్తూ ఒక్కొక్క మెట్టేపైకి పురోగమించడానికి చాతుర్వర్ణ వ్యవస్థ ప్రాచీన భారతదేశంలో మహర్షులు ఏర్పాటుచేశారు. స్త్రీ, పురుషుల మధ్య సంబంధాలనుకూడా జంతుదశలోలాగ అనాగరిక స్థితిలో ఉండకుండా ఒక భార్యకి ఒక భర్త అని వివాహవ్యవస్థ ఏర్పాటుచేశారు. ఇది ంరంగా నిలబడాలంటే పవిత్రత. నిజాయితీకి కట్టుబడి ఉండటంతో న్యాయం, ర్మం అన్న ప్రాతిపదికలే ఇక్కడకూడా. రానున్న పురోగతికి పునాది రాళ్ళుగా ర్పాటుచేయబడి ఉన్నాయి.

సమాజంలో రాజకీయవ్యవస్థ ఏర్పాటయిన తర్వాత మానవుడు యంత్రాలు కనుక్కోవడంతో 'యంత్రయుగం' ప్రారంభమైంది. తద్వారా ''పారిశ్రామిక విప్లవం'' యూరప్‌లో ప్రారంభించింది. దీంతో మనిషి జీవితం పూర్తిగా మారిపోయింది. ధర్మం, సత్యం, న్యాయం మీద ఆధారపడి అంతవరకు జీవించే మానవసమాజంలో కొనడం, అమ్మడం, అనే సూత్రం- అంటే ''వాణిజ్య విధానం'' తలెత్తింది. దీనివల్ల ఎక్కువ యంత్రాలు తయారుచేయగల దేశాలు ఎక్కువ పురోగమించినట్టుగా భావించటం జరుగుతున్నది. యంత్రాలు ఎక్కువ ఉత్పత్తి చేయలేని దేశాలు వెనుకబడిన దేశాలుగా ఈనాటికీ భావించటం జరుగుతోంది. ఈ యాంత్రిక మనస్తత్వం మానవుడిలో తలెత్తినప్పటినుంచీ యూరప్‌లో ఫ్యాక్టరీలు, బొగ్గుగనులు అన్నిచోట్ల తలెత్తినాయి. మొదట్లో

కొంతవరకు మేలే జరిగింది. ఉత్పత్తి పెరిగి మానవుడికి ఎక్కువ వస్తువులు నిత్యజీవితంలో లభించడానికి ఈ యంత్రయుగంలోని పరిణామం ఎందుకంటే యంత్రాలవల్లా, ఫ్యాక్టరీలవల్లా, బొగ్గుగనుల వల్లా, పరిశ్రమలవల్లా ఒక వైపున ఉత్పత్తి పెరిగినా రెండోవైపున కూలికై శరీరం అమ్ముకునే సమాజంలో నికృష్టంగా జీవించే కష్టజీవులు, శ్రామికవర్గం విపరీతంగా పెరిగిపోసాగింది. యంత్రాలు పెరగడంతో యూరప్‌లోని పట్టణాలన్నింటిలోను కార్మికులు, కూలీలు అనబడే శ్రమజీవులసంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. అంటే ఏమిజరిగింది? యంత్రాలు మానవుడికి సౌకర్యాలను, సుఖాలను సంపాదించి పెట్టేబదులు సమాజంలో మూడువంతుల జనాన్ని యంత్రానికి బానిసలుగా తయారు చేశాయి. ఇది ఈ యాంత్రికయుగం యొక్క దుష్పరిణామం. దీనికి ప్రతీకారంగా మానవ పరిణామంలో ఏర్పడిన కొత్త విప్లవమే 'సోషలిజం'. ఇది రష్యాలో ఆరంభమయి క్రమంగా చాలా చోట్ల వ్యాపించింది. యంత్రాలవల్ల మానవసమాజంలో అంతకుముందు సమాజంలోలేని తీవ్రమైన అసమానత్వం తలఎత్తింది. ఈ అసమానత్వం ఎక్కువకాగానే దానికి విరుగుడుగా సమానత్వం కోసం నినాదాలు ఆరంభమయ్యాయి. ఈ వాతావరణంలో యూరప్‌లో 'ఫ్రెంచివిప్లవం'తో సోషలిజంకు నాంది జరిగింది. అలాగే రష్యాలోని 'కమ్యూనిష్టు విప్లవం'తో కమ్యూనిజానికి నాంది జరిగింది.

కాని మానవపరిణామంలో కేవలం బయట పరిస్థితుల మార్పుఒక్కటే చాలదు. రాజకీయ పరిణామాలతోపాటు ఆర్థిక వ్యవస్థలో పరిణామాలు ఆరంభమైనట్టే, సైన్సులో కూడా పరిణామం ఆరంభమవుతోంది. సామాజిక పరిణామం ఎలా అవసరమో మానవుడి మానసిక పరిణామం కూడా అలాగే అవసరం, అన్న ఈ సిద్ధాంతాన్ని ఈ 20వ శతాబ్దంలో గుర్తించడం జరిగింది. దీని ఫలితంగా మానవహక్కులు అంటే ప్రతివ్యక్తికీ సుఖమయిన జీవితానికి హక్కు వుండాలి! కనీస జీవితావసరాలు ప్రతిమానవుడికీ అవసరం. అందుకని కనీసహక్కులు చట్టరీత్యా అన్నిదేశాలు గుర్తించాలనే నూతన పరిణామాన్ని

1945లో రెండవ ప్రపంచయుద్ధాన్ని రుచిచూచిన మానవజాతి గుర్తించింది. కోట్లాది మానవుల భయంకర బాధల కారణంగా మానసికస్వేచ్ఛ ప్రపంచంలో ప్రతివ్యక్తికీ అవసరం అనే సూత్రం, రష్యన్ విప్లవం తర్వాత స్టాలిన్‌యుగం ఫలితంగానూ, సమాజంలో మనిషికి కేవలం తిండి, బట్టఇవ్వడంతో సరిపోదు అనే సత్యాన్ని మానవజాతి గుర్తించింది. 'పదార్థవాదం' సర్వస్వం అని నమ్మే 19వ శతాబ్దపు ''భౌతిక సిద్ధాంతం'' అణువును సైంటిస్టులు బ్రద్దలుకొట్టడంతో అంతమయింది. ఫలితంగా అణుబాంబు ప్రేలుడుతో మానవసమాజంలో ఒక నూతనశకం ఆరంభమయింది. అంటే మానవసమాజంలో ఎలాగయితే, భౌతిక పరిణామం తర్వాత మానసిక పరిణామం. తర్వాతి అధ్యాయంగా ఆరంభ మయిందో, అదే విధంగా మానసిక పరిణామం తర్వాత మానవుడి మనస్సుకి అందని దివ్యశక్తుల పరిణామం కూడా ఈ సోవియట్ రష్యాలోనే ఆరంభమవడం శ్చర్యకరమైన విషయం! ఎందుకంటే పదార్థం శాశ్వతమని అణువును నేదించడం అసాధ్యమని నమ్మిన భౌతిక వాదులైన సైంటిస్టులకు పదార్థం నశిస్తే అందులోంచి శక్తి పడుతుందనే మహాసత్యం ఎంత విప్లవాత్మక మైన మార్పు. అలాగే - మానవుడిలో అసాధ్యమైన ''ఆధ్యాత్మిక శక్తులు''న్నాయన్న మహాసత్యం బయటపెట్టడం అనే తీవ్రపరిణామం కూడా, ఈ సోవియట్ రష్యాలోని ఆధ్యాత్మిక పరిశోధనవల్లనే జరిగింది. దీనివల్ల మానవుడు ఒక కొత్తసత్యాన్ని గుర్తించవలసి వచ్చింది. కంటికి కనబడే పదార్థం ఎలాగయితే కంటికి కనిపించని ఇంకో ''మహాసత్యం'' నుంచి (శక్తి నుంచి) ఉద్భవించిందో, అలాగే మనిషి కూడా ఈ కంటికి కనిపించే శరీరంలోపల దాగివుండే ఇంకొక సూక్ష్మశరీరం వల్లనే ఉద్భవించాడన్న మహాసత్యం. ఈ సూక్ష్మశరీరాన్ని ఋజువు చేసే సైన్సు పరికరమే ''జోసెఫ్ కిర్లియన్'' కనిపెట్టిన ''కిర్లియన్ ఫోటోగ్రఫీ'' దీనివల్ల మానవుడు పైకికనిపించే శరీరం మాత్రమేకాదనీ, ఈ పైకి కనిపించే శరీరం వెనకాల కంటికి కనిపించిన మహత్తర శక్తి - దీన్ని ఆత్మ అనండి సూక్ష్మశరీరం అనండి, ఏదైనా పేరుతో పిలవండి బాధలేదు. భౌతిక పదార్థాని

కందని ఒక ''దివ్యశక్తి'' (Subtle Energy- Consicousness) ఉంది- అన్న సూత్రాన్ని రష్యన్ సైంటిస్టులు ఇష్టం లేకుండానే గుర్తించాల్సి వచ్చింది. ఇంతకు ముందు అధ్యాయాల్లోని పరిశోధనల ద్వారా!

అలాగే కళ్ళులేకుండా చూపు, మంత్రదండం, ఉల్ఫ్‌మెస్సింగ్ యొక్క ఆశ్చర్యకరమైన ప్రదర్శనలు, మొదలైన అంశాలపై జరిగిన అద్భుత పరిశోధనలు చూస్తే మానవుడిలో ఆధ్యాత్మిక శక్తులనేవి యదార్థమని తెలుతుంది. అంతేకాదు మనిషి మెదడువల్ల ఏర్పడే తెలివితేటలేకాక భౌతికశరీరం లోపలవుండే ''ఆధ్యాత్మిక శక్తి'' యొక్క బలమేహెచ్చనీ, దీన్ని వినియోగించుకోగలిగితే రానున్న శతాబ్దిలో మానవజాతి పరిణామంలోనే ఒక బంగారు అధ్యాయం ఆరంభం చేసుకోవచ్చనీ రష్యన్ సైంటిస్టులు కనుగొన్నారు. అలాగే భూగర్భ జలం, మానవజీవితంపై ఇతర గ్రహాలప్రభావం కాలంయొక్క బరువును గురించిన పరిశోధనలతో, మానవపరిణామంలో ఇంకొక నూతన శకానికే ద్వారాలు తెరుచుకుంటున్నాయి. 'పదార్థవాదం, భౌతికవాదం' రాజకీయాల యాంత్రిక సమాజం మానవజాతిని గతయుగంలోలాగ రానున్న కాలంలో ఖైదీగా ఉండలేదు! పదార్థం యొక్క ఖైదీగా మానవుడి మనస్సు బంధించివుంచడం రానున్న ఈ నూతనయుగంలో ఇక ముందు సాధ్యంకాదనే సత్యం కళ్ళున్న వారికి తెలుస్తుంది. బుద్ధి కలిగిన వారికి అర్థమవుతుంది. ఎదురుగుండా వున్నా బుద్ధిలేని వాళ్ళనీ, గుడ్డిగా బతికే జీవులనూ, ప్రకృతి క్షమించదు. పురోగతి, పరిణామం, ప్రకృతి యొక్క ధ్యేయం మానవజాతి పరిణామదశలో, గతానికి అంటిపెట్టుకొనే తిరోగమనానికి తావులేదు. అందువల్లనే 20వ శతాబ్దంలో రష్యా 19వ శతాబ్దపు భౌతికవాదాలను, పదార్థవాదాలను విడిచిపెట్టి మానవుడిలోని 'అధ్యాత్మిక శక్తి'ని గురించి నూతనయుగంలోకి అడుగుపెట్టింది. ఇంకా ఈ విషయం రష్యాలోని రాజకీయ నాయకత్వం పూర్తిగా గుర్తించినట్టు కనబడదు. కాని అలా గుర్తించవలసి రావటం ఎంతో సేపు పట్టదు. సైన్సు పరిశోధనలు గుర్తించకుండా ఏ రాజకీయ

నాయకత్వం మనలేదు. ''ఐన్‌స్టీన్'' అణువును భేదించడం సాధ్యమని నిరూపించిన మహాసత్యం యొక్క లోతు అనాటి అమెరికన్ సైనికాధికారులకు అర్థంకాలేదు. జర్మనీలోని హిట్లర్‌కూ అర్థంకాలేదు. రష్యాలోని స్టాలిన్‌కు ఉల్ఫ్‌మెస్సింగ్‌యొక్క ఆధ్యాత్మికశక్తిలోతు, మానవజాతిపై రానున్న పరిణామం అర్థం కాలేదు. కాని చరిత్ర ఆగలేదు. వారికి అర్థం అయ్యేదాకా!

అణుబాంబే రెండవ ప్రపంచయుద్ధాన్ని అంతం చేసింది. మానవుడనే అణువులో ఆధ్యాత్మికశక్తి అనే పేలుడు ఇప్పుడు రష్యాలో సంభవించింది. ఈ పేలుడును ఏ రాజకీయశక్తీ నిరోధించలేదు! ఇది మానవజాతికి రానున్న విప్లవంలో నూతన సూర్యోదయం! మానవ రాజకీయ చరిత్రలో కమ్యూనిజం అవతరించటం ఎర్రని అరుణోదయమయితే, రష్యాలోని ఆధ్యాత్మిక పరిశోధనలో వెలువడిన మానవుడి ''దైవత్వం-బంగారు సూర్యోదయం''!! ఒకదాంట్లో మానవ సమానత్వం ఉదయిస్తే, రెండవదాంట్లో మానవుని దైవత్వమే ఆవిష్కారమయింది. ఒకటి అరుణోదయం అయితే రెండవది సూర్యోదయం! రానున్న 21వ శతాబ్దిలో మానవజాతి అడుగుపెడుతున్న నూతన యుగానికి సూచనయే ఈ ''ఆధ్యాత్మిక సూర్యోదయం''! మానవునిలో వెలిగే దైవత్వానికి సైన్సుపరికరాలే మొదటి పూజారి!!



16

# "కాలంయొక్క - బరువు"

## కమ్యూనిష్టు దేశాలలో ఆధ్యాత్మిక పురోగతి:

ఆకాశంలోని అగాధమైన చీకటిలోంచి దూరదూరాన నక్షత్రాలు మిలమిలా మెరుస్తున్నాయి. అనంతమైన ఈ విశాల విశ్వంలోంచి ఏదో ఒక విచిత్రమైన శక్తి నిత్యం ధారాపాతంగా కురుస్తోంది నిశ్శబ్దంగా! దీని పేరే "కాలము".

సోవియట్ రష్యాలో కాలాన్ని కొలిచే మెదడు* లెనిన్‌గ్రాడ్‌కు దగ్గరలో వున్న 'ఉల్‌కోవా' నగరంలో రష్యన్ సైన్సు అకాడమీకి కేంద్రం అయిన "అంతరిక్ష పరిశోధనశాఖ"లో డా॥నికోలాయి కొజైరేవ్ (Kozirev) చేసిన పరిశోధనల ఫలితమే పై నిర్ణయము! ఆశ్చర్యం! నమ్మశక్యంకాని వింత కదూ!

---

* 'నికోలాయి కొజైరేవ్' "అంతుపట్టని విశ్వం" (An un Explored World) Soviet life (Nov. 1965)- Nekolai Kozairev.

నిజమే డా॥కొజైరేవ్ పుల్కొవా (Pulkova)లోని తన నక్షత్ర పరిశోధన శాలలో కనిపెట్టిన విచిత్రమైన ఈ వైజ్ఞానిక రహస్యం ఇప్పుడున్న విజ్ఞానాన్ని తలక్రిందులు చేస్తుందా? ఈనాడు ప్రపంచంలోని అనేక దేశాల 'సైంటిస్టులు' కాలం గురించి వేసుకున్న నిర్ణయాలన్నీ డా॥ కొజైరేవ్ పరిశోధన వల్ల తలక్రిందులైపోతాయా?

ఇదే ఈనాడు సైంటిస్టుల ప్రపంచంలో డా॥ కొజైరేవ్ అపూర్వ పరిశోధనల గురించి తెలిసిన అనేకమంది మనస్సులలో రేగుతున్న తుఫాను, జర్మనీ యుద్ధంలో నాజీ సైనికుల బాంబులతో నాశనమైన ఈయన పరిశోధనశాల రకరకాల టెలిస్కోపులతో ఈనాడు మళ్ళీ విచిత్రమైన సైన్సుపరికరాలతో నిండివున్నది. ఇది వొక చిత్రమైన ఆధ్యాత్మిక, సైన్సు పరిశోధనగాథ!

ఒక ఆకుపచ్చని రంగుతో మెరిసే 'గైరోస్కోపు'ను (Gyroscope) ముందు వేసుకుని ఒక పెద్ద బల్లముందు కూర్చున్న వ్యక్తి చిరునవ్వుతో మిమ్మల్ని ఆహ్వానిస్తాడు. కాలగర్భంలోంచి తాము వెలికి తీసిన అపూర్వ రహస్యాలను తనతోపాటు పంచుకోమని! ఆయనే డా॥ కొజైరేవ్!! ఆయన పరిశోధనల గురించి ఆయన స్వంత మాటలతోనే వినాలి.

"ప్రకృతిలో వున్న అగాధమైన విషయాల్లో ఏ మాత్రం అంతుపట్టని విషయం కాలమే! కాలం కాంతిలాగ తరంగాలతో ప్రయాణం చేయదు. ఈ విశ్వంలో ఇది ఒక్కసారే ప్రత్యక్షమవుతుంది విశ్వంలో ఏమూల చూసినా ఒకే సెకండుకాలంలో కనిపించే మార్పు యొక్కగుణం దీనిది. అది తక్షణమే అన్నిచోట్లా కనిపిస్తుంది! ఎలాగైతే 'టైము' అనేది అన్నిచోట్లా అదే నిముషంలో సర్వత్రా ఉన్నట్లుగానే కాలం ఈ విశ్వంలోని అన్ని వస్తువుల్నీ అన్ని సంఘటనలనీ ఒక్క సారే కలిపి వుంచుతుంది"- ఒక చెరువులోని చేపలా చుట్టూ వ్యాపించి ఉన్న నీళ్ళమాదిరిగానే!

---

* Nekolai Kozairev:- Possibility of enpermental study of the properties of Time (2-5-1968) Department of Commerce (U.S.A. )

డా॥ కొజైరెవ్ పరిశోధనలో కనుగొన్న అతివిచిత్రమైన విషయాల్లో కాలం (time) అనేది ఒకానొక శక్తి (energy)! అది పనిచేసే విధానం విచిత్రంగా ఉంటుంది. ప్రారంభించిన చోట చిక్కగానూ దాని పర్యవసానం పూర్తి అయ్యే చోట పల్చగానూ ఉంటుంది.

ఈ విషయాన్ని ఋజువుచేసే తన యంత్రాల ముందుకు వెళ్ళి సిద్ధాంతాలను వివరించటం మొదలుపెట్టాడు డా॥ 'కొజైరెవ్'. ఆయంత్రాలలో అతి సున్నితమైన నిశితమైన గైరోస్కోపులు, గడియారంలో ఇటూ అటూ వూగే పెండ్యులం (pendulum) వంటి పరికరాలు 'పురి'ని (Torrion) కొలిచే త్రాసులూ, అనేకం ఉన్నాయి. ఆయన ముందు ఈ పనిముట్ల సహాయంతో ఒక చిన్న పరిశోధన ఏర్పాటుచేశాడు.

దానిలో చూపెట్టింది తేలికమాటలతో చెప్పాలంటే, కాలం యొక్క 'చిక్కదనం' రెండు కొసలవద్ద తేడాతో ఉంటుంది. అంటే ఏమిటి?

ఒక సాగేదారం (elastic threɛd) తీసుకొని రెండు వైపులా పట్టుకొని లాగితే ఒక కొసన ఆ తాడును 'లాగేశక్తి' పనిచేస్తూ ఉంటే- దానికి అవతల చివర ఉన్న కొసలో ''ముడుచుకొనే శక్తి'' పనిచేస్తూ ఉంటుంది. ఈ రెండు 'పుల్ అండ్ స్ట్రెచ్' (Pull and stretch) శక్తులను కొలిచే పెండ్యులం సహాయంతో కాలం యొక్క చిక్కదనాన్ని కొలవవచ్చు అంటాడు డా॥ కొజైరెవ్ పరిశోధన ఫలితంగా.

దీనిలో ఉన్నది. అయస్కాంత తరంగాలు కానీకరెంటు తరంగాలతో కానీ సంబంధించిన విషయం కాదు.

''మేం కనుగొన్న రహస్యం ఒక్కటే! ఒకదారం పట్టిలాగితే ఒక కొసన అలా సాగడానికి 'కారణం' (cause) అవతల కొసన అలా సాగిన 'ఫలితం' (Effect) ఉంటాయి. ఈ కాలంయొక్క చిక్కదనాన్ని 'కొలిచినపుడు' కాలం, 'కారణం' దగ్గర పలుచగానూ 'ఫలితం' దగ్గర చిక్కగానూ పనిచేస్తుందని తేలింది.

ఈ ప్రక్రియ చివరికి ఇనుపగొట్టాలద్వారా కూడా పనిచేస్తుందని విన్నాము రసాయనిక మార్పులు కలిగినపుడుకూడా ఆ కాలం 'చిక్కదనం కూడా మారుతుంది అంటాడు 'కొజైరేవ్'! ఈ సత్యాన్ని ప్రదర్శించడానికి ఆయన పంచదారను మండించి ఇదే ఫలితాలను ఋజువు చేశాడు - కాలం 'కారణం' దగ్గర పల్చగానూ 'ఫలితం' దగ్గర చిక్కగానూ ఏర్పడుతుందని! ఇది సైన్సులోనే చారిత్రాత్మకమైన విచిత్ర ప్రక్రియ.

దీనినే భారతీయుల మాటలో చెప్పాలంటే 'కర్త, కర్మ, క్రియ' అనే మూడింటిలో కారణం కర్తదాని ఫలితం క్రియ అలాంటప్పుడు కాలంయొక్క చిక్కదనం 'క్రియ' మీద ఎక్కువగా ఏర్పడుతుంది. అలాగే కాలంయొక్క ఫలితం 'కర్త' చుట్టూ ఏర్పడుతుంది. కర్మ క్షయం అయినపుడే ఈ విశ్వంలోని ప్రతీదానికి 'కర్త' అయివున్న శక్తిని గుర్తించగలుగుతాము. అంటే కర్తవద్ద కాలం దాదాపు తక్కువగానూ క్రియవద్ద కాలం ప్రభావం చిక్కగానూ ఉంటుందని, కొజైరేవ్ సిద్ధాంతాలను మన మాటలలో చెప్పుకుంటే అర్థం!

ఇదంతా చదివితే ఇది ఏదో ఒకరకమైన ఊహాజనితమైన, వేదాంత జనితమైన, సిద్ధాంతమూ అనిపించవచ్చు. కాని ఈ సూత్రాలు ప్రత్యక్షంగా పనిచేయడం చూస్తే అపరిమిత ఆనందం వేస్తుంది. రసాయనికమైన మార్పులుతాము జరిగిన చోటునుంచి ఎంతో దూరంలో ఉన్న గడియారంలో వున్న పెండ్యులం (Pendulum) వంటి పరికరాన్ని ప్రత్యక్షంగా మార్చుతుంది. అంటే ఏరకమైన శక్తినీ ఉపయోగించకుండగనే అది కదులుతుంది. ఈ కదలిక ''శక్తి'' వల్ల కాక డా॥ కొజైరేవ్ సిద్ధాంతం ప్రకారం ''కాలం యొక్క చిక్కదనం'' వల్ల కలుగుతుంది.

దీనివల్ల మనిషికి చాలాదూరంలో వున్న 'పదార్థాన్ని కూడా ప్రభావితం చేయవచ్చు' అంటే ఆధ్యాత్మిక శక్తులు కల్గిన నెల్యామీఖైలోవా వంటి వారి మనస్సుల్లోంచి ప్రవహించే P K అనే ఒక విచిత్రమైన 'ప్రభావం' పదార్థాన్ని కదిలించ గలుగుతోంది. మనస్సు శక్తితో పదార్థాన్ని కదిలించే ప్రభావం పేరు

F K అంటారు. ఇది జరగటం కాలంయొక్క చిక్కదనం, పల్చదనంలోని మార్పులవలనే - దీంతో ఎంతదూరానవున్న పదార్థమునుకూడా ప్రభావితం చేయవచ్చు అంటాడు కొజైరేవ్ అన్న రష్యను సైంటిస్టు.

అలాగయితే మనస్సుకూడా కాలంయొక్క చిక్కదనం లేక పల్చదనాన్ని మార్పుచేస్తుందా? అన్న మా ప్రశ్నకు!

నిశ్చయంగా! అని డా॥కొజైరేవ్ దృఢంగా సమాధానం చెప్పారు. ఎలాగంటే ''మనస్సు అనేది తప్పకుండా ఒక ఫలితాన్ని మారుస్తుంది'' ఎలాగంటే నేను బుద్ధిపూర్వకంగా కవిత్వం గురించి కాని లేక ఉద్రేకాన్ని కలిగించే విషయాన్ని ఏదైనా ఆలోచిస్తే అలా చేసినపుడు వెంటనే ఇక్కడున్న పరికరాలు ఈ మార్పును చూపెడతాయి.

ఈ మార్పు గణితశాస్త్రపు లెక్కలు (Arithmetic) వంటి, మానసిక విషయాల గురించి ఆలోచిస్తే మన మనస్సులో కనబడే మార్పులకన్నా - ఆవేశం (emotion)తో ఆలోచించే విషయాలలోనే ఈ మార్పు ఎక్కువగా ఉంటుందని కొజైరేవ్ నిరూపించాడు. నిగూఢమైన సాంకేతికమైన తన సైన్సు పరిశోధనలతో! దీనినిబట్టి చూస్తే సోవియట్ సైన్సులో జరిగే ఈ ఆధ్యాత్మిక పరిశోధనలో ఏమి ఋజువు అవుతున్నదంటే - ఆలోచనలు కాలం యొక్క పలచదనాన్ని గాని చిక్కదనాన్ని గానీ తప్పక మార్చగలవు అన్నసత్యాన్ని!

కాలంయొక్క చిక్కదనాన్ని మార్పుచేసేవి. ఇలా ఇంకా వున్నాయా అంటే అద్భుతశక్తులు లేక ఆధ్యాత్మిక శక్తులువంటి విషయాలు మనస్సులో పనిచేసినప్పుడు ఆ చుట్టుప్రక్కల కాలం చాలాపల్చగా అయిపోతుందట! ఆలోచనలు పంపించే వ్యక్తిదగ్గర కాలం పల్చగానూ ఆలోచనలు తీసుకొనే వ్యక్తి దగ్గరకాలం చిక్కగానూ మారి పోవడాన్ని తన యంత్రాలతోనే ఋజువు చేయగలిగాడు. డా॥కొజైరేవ్!

ఇంతేకాదు ''దివ్యదృష్టి లేక దూరదృష్టివంటి దివ్యశక్తులు కాలం మీదే ఆధారపడతాయి. లేబరేటరీలో జరిపిన పరిశోధనతో కాలం చిక్కదనాన్ని

మార్చడానికి ప్రయత్నించాము. కాలం చిక్కబడేలా చేయగలిగితే అక్కడ దూరశ్రవణం లేక దివ్యదృష్టి ఎప్పుడు కావాలంటే అప్పుడు పనిచేస్తాయి'' అంటాడు కొజైరేవ్. ఆయనింకా యిలా అంటాడు;

''కాలం యొక్క చిక్కదనాన్ని మార్చే యితర మార్పుల్లో ముఖ్యమైనవి పిడుగులూ, ఉరుములూ కలిసిన 'తుఫాను', గాలివాన. ఇంకా ఋతువుల్లో మార్పు ఇవన్నీ కూడా కాలం చిక్కదనాన్ని (Time Density) మారుస్తాయి. శీతాకాలంలోనూ, వేసవికాలంలోనూ, కూడా కాలం యొక్క సాంద్రత మారుతుంది''. డా॥ కొజైరేవ్ చేసిన పరిశోధనలో రాత్రిపూటలో పెంచిన చెట్లూ, పువ్వులు కాలంయొక్క సాంద్రతలోని మార్పులను ఎలా ఋజువు చేస్తుందో చూపెడతాయి.

'భూమి యొక్క అక్షాంశాలూ, రేఖాంశాలూ దగ్గరకూడా కాలం చిక్కగా వుంటుంది. అక్కడ ఆలోచనలను ఒకరినుంచి ఇంకొకరికి వేగంగా ప్రయాణిస్తాయి'. అంటాడు డా॥ కొజైరేవ్.

అలాగే పదార్థంయొక్క సాంద్రత (Density of matter) కూడా కాలం యొక్క చిక్కదనాన్ని మారుస్తుంది. అలాగే భూమి యొక్క ఆకర్షణశక్తి (Gravitation Field) కూడా కాలం యొక్క చిక్కదనాన్ని మారుస్తుంది.

ఇంకో అద్భుతమైన విశేషమేమిటంటే డా॥కొజైరేవ్ కనుగొన్న ఫలితాలు- మంత్రదండంలోని భూగర్భజలాన్ని పరిశోధించిన వ్యక్తుల అనుభవంతో సరిగ్గా సరిపోతున్నాయి. 'మంత్రదండంతో' (Dowsing Rod) పరిశోధించినప్పుడు భూమిలోని రకరకాల ఖనిజాలపైన మంత్రదండం పట్టుకొన్న వ్యక్తిలో వేరువేరు స్పందనలు కలిగిస్తాయి' అంటాడు కొజైరేవ్. ఈ వేరువేరు రకాల స్పందనలు కలగటం కాలంయొక్క చిక్కదనములోని మార్పులవల్లనే - అని. అంటే భూమి అడుగున్న వున్న రకరకాల ఖనిజాలూ, వాటిలోని పదార్థపు సాంద్రత, లేక చిక్కదనం మారుతూ వుండటం వల్ల - పదార్థంలోని సాంద్రతవల్లా ఆ ప్రదేశంలో కాలం యొక్క చిక్కదనంకూడా మారుతుంది. అన్న విషయం రూఢి అయింది.

ప్రాణులయొక్క శరీరంలోకూడా కాలం ప్రభావం యొక్క చిక్కదనం మారుతూవుంటుంది. కుడి ప్రక్క అవయవాల్లో కన్నా ఎడమప్రక్క అవయవాల్లో ఈ కాలంయొక్క చిక్కదనం చాలా తేడాగా వుంటుంది. అంతేగాకుండా మైక్రోస్కోపు (Microscope)లో కనబడే సూక్ష్మజీవులు (Protozoa) వాటి శరీర నిర్మాణంలో గుల్లలు (Shells) నిర్మించేటప్పుడు గుండ్రంగా సుడిగుండం ఆకారంలోనూ, అనేక వికృతరూపాలు నిర్మించడానికి కారణం - వాటికాలం లోని చిక్కదనం, పల్చదనంలోని తేడాలే! ఇది కేవలం యాదృచ్ఛికంకాదు. 'ప్రకృతి బుద్ధిపూర్వకంగా ఏర్పడ్డవి' అంటాడు డా॥ కొజైరేవ్. ప్రాణుల శరీరంలో 'కాలం' ప్రవహించే చిక్కదనం అది ప్రవహించే సమయంలో వేరువేరుగా వుంటుంది.

సంవత్సరాల తరబడి తాను చేసిన పరిశోధనలో డా॥ కొజైరేవ్ కనుగొన్న విచిత్రమేమిటంటే 'సుడిగుండం' (Whirl pool)గా తిరిగే ప్రవాహంలోవచ్చే మార్పులు- ఎడమవైపుకు తిరిగే (అప్రదక్షిణంగా) సుడిగుండంలాంటి ప్రవాహంలో కాలంయొక్క 'ధనశక్తిని' (Positive) కుడివైపు (ప్రదక్షిణం)గా తిరిగే కాలంయొక్క 'ఋణశక్తిని' (Negative) కలిగి వుంటుంది. అంటే సుడిగుండంలా కుడివైపు ఆ ప్రవాహంలో కాలం నెగటివ్ (Negative)గా పనిచేస్తుంది! ఈ సిద్ధాంతం రసాయన శాస్త్రంలో అణువుల నిర్మాణంలో కూడా (Molecular structure) పనిచేస్తుందని కనుగొన్నాడు. టర్పెంటైను వంటి రసాయన పదార్థంలో అణువులు ఎడమవైపు (Leavo) తిరిగిన నిర్మాణం కలిగివుంటాయి. కనుక కాలప్రమాణం (Positive)ని (ధనశక్తి) కల్గివుంటుంది. అందుకే ఆధ్యాత్మిక పరిశోధనలు చేసేటప్పుడు కొజైరేవ్ కనిపెట్టిన యంత్రాలు టర్పెంటైన్ దగ్గర పెడితే (Positive) ఫలితాలు చూపెడుతున్నాయి. ఇలాంటి పరిశోధనల సారాంశం చాలా విచిత్రంగా వుంటుంది. మనం జీవించే ఈ ప్రపంచం ఎడమవైపుగా తిరిగే కాలనిర్మాణం కలిగివున్నది. అందుకనే కాలప్రవాహం (Positive)గా పనిచేసే శక్తిని పెంచగలుగుతుంది అంటాడాయన!

ఈ కాలం యొక్క అసలు పూర్తి స్వరూపం సైన్సుకుకూడ అంతుపట్టలేదు. అసలువున్నదానిలో నూటికి పది, పదిహేను వంతులే పరిశోధించటం జరిగినది. కాలం అనేది ఎక్కడ ఊహలా మనిషి మనస్సులో ఊహించేదికాదు - అది యదార్థ అస్తిత్వంగల ఒక 'వస్తువు' వంటిది - దీనికి ఫలానా నిర్దిష్టమైన లక్షణాలు, ఫలితాలు వున్నాయి'. అంటాడు కొజైరేవ్.

అందుకే టైమ్ (Time) అనేది - గతం టైము భవిష్యత్తులోని టైము ఒక్కటికాదు. ఇది సైన్సునుగూడ తెలియరాలేదింకా! ఇప్పుడిప్పుడే పరిశోధనలలో కనబడిన సత్యం-అంటాడు. కొజైరేవ్ అమూల్య రహస్యాలను కనుగొన్నాడు.

కాలం అనేది ఒకరకమైన 'శక్తి'! దానికి కొన్ని పనులను సాధించిపెట్టగల శక్తి వున్నది - ఆధ్యాత్మిక ప్రపంచంలో

గ్రీసు సైంటిస్టు ఎ.టనగ్రాస్ (A. Tanagras) కనుగొన్నట్లు కాలం యోగులూ ఆధ్యాత్మిక శక్తులున్నవాళ్ళు చెప్పే 'భవిష్యత్తు'ను జరిగేలాగ చేసే ఒకానొకశక్తి ఈ కాలానికున్నది. అంటే మానవుడి చుట్టూవుండే సూక్ష్మశరీరం యొక్క 'తేజస్సు'తో ఈకాలం యొక్క భవిష్యత్తును జరిగించే శక్తి తీగలవంటి సన్నని కిరణాలు కట్టబడి వుంటాయి! అందుకే యోగులు చెప్పే భవిష్యత్తుకూ (Prophecy) ఆ విషయాన్ని జరిగేలా చేసే శక్తికూడా వుంటుంది. కేవలం దాన్ని తెలుసుకోవటం మాత్రమేగాదు! ఇది కాలంలో వున్న విచిత్రమైన క్రియాశక్తివల్ల (జరిగించే శక్తి)నే సాధ్యపడుతుంది.

ఎ.టనగ్రాస్ సిద్ధాంతం ప్రకారం మనకు జరగబోయే మంచీ చెడు సంఘటనలు మన అంతరాత్మతో తీగెలలాగ బంధించబడి ఉంటాయన్నమాట! మనిషిలోని వ్యక్తిత్వానికీ అతనికి రాబోయే సంఘటనలకీ ఏదో ఒక రకమైన 'సంబంధం' లేక 'లింకు' వున్నది.

విశ్వంలో జరుగుతున్న సంఘటనలో కాలం విచిత్రంగా తాను కూడా పాల్గొంటున్నది. దీనివల్ల దివ్యశక్తులున్న తీగలవంటి సంబంధసూత్రాలవల్ల

యోగులతనికి జరిగే సంఘటనల తాలూకూ భవిష్యత్తును ముందుగానే చూస్తారు.

దీన్నే ''భారతీయుల'' భాషలో చెప్పాలంటే ఒకడికి కాలంలో జరిగే భవిష్యత్తువుుందే 'బంధాలు' లేక సంబంధాన్ని కలిపే తీగెలు కలసి వుంచుతాయి.

సైన్సు మాటలతో కొజైరేవ్ భారతీయులు 'కాలం' వల్లనే మన గతకర్మా, దానివల్ల జరగవలసిన భవిష్యత్ సంఘటనలూ, మనిషికి కర్మ (తీగెలు) బంధాలవల్ల 'లింకు' చేయబడి వుంటాయి - ఈ తీగలవంటి బంధాలవల్లనే దివ్యదృష్టి గలవాళ్ళు ఆ మనిషికి జరగబోయే సంఘటనల చిత్రాలని చూడగలుగుతున్నారు. అని రుజువుచేశాడు! ఈ చిత్రాలు (Figures) 'సూదంటు'రాయి (అయస్కాంతం) చుట్టూవున్న అయస్కాంత తరంగాలు తీగెలు (Lines force) తీగెలుగా వున్నట్లే ఈ (Magnetic Field)లో జరగబోయే ఈ చిత్రాలుకూడ సన్నని తీగెలు వంటి శక్తి తరంగాలతోనే ఏర్పడి వుంటాయి. ఈ శక్తి వేరేకాదు!! ఈ తరంగాల ఆకారాన్నే భవిష్యత్తును తెలుసుకునే యోగులుచూసే భవిష్యత్ చిత్రాలు, సూక్ష్మంగా చెప్పాలంటే ఇది డా॥కొజైరేవ్ తన పరిశోధనల ద్వారా కాలం గురించి ప్రతిపాదించిన విచిత్రమైన సిద్ధాంతం.

ఆకాశంలోని నక్షత్రాలను పరిశోధించే సైంటిస్టయిన డా॥కొజైరేవ్‌కు ఆధ్యాత్మిక శక్తులతోనూ, ఈ మానసిక తరంగాలతోనూ సంబంధం ఎలాగ ఏర్పడింది! అని కొందరు స్నేహితులు ఆయనను ప్రశ్నించారు. దానికాయన తన అనుభవాన్ని ఇలా చెప్పాడు- ''నేను 1961లో బెల్జియంలో జరిగిన ఖగోళశాస్త్రంపై కాన్ఫరెన్సు (Conference) లో చదివిన ఈ సైన్సు పేపరు చూడండి! అంటూ టేబుల్ మీద రీసెర్చి రిపోర్టు (Research Report)ను పడేశారు. ఇంకా ఇలా అన్నాడు. 'ఆకాశంలో రకరకాల నక్షత్రాలుంటాయి. అందులో కొన్నిజంటలుగా వుంటాయి. వాటినే జంటనక్షత్రాలు (Double Stars) అని కూడ అంటారు. మొదట్లో ఆ జంటలోని రెండు నక్షత్రాలు ఒకే

విధంగా ఉండవుకాని క్రమేణా కాలం గడిచినకొద్దీ అందులోవున్న రెండవనక్షత్రం మొదటి నక్షత్రం పోలికతో తయారవుతుంది. సరిగ్గా దానికున్న రంగు, కాంతి ఆ నక్షత్రానికి వున్న తేజస్సు, అలాంటి కాంతి చక్రమే ఇదీ తయారు చేసుకుంటుంది. అంతంత దూరాన వున్న ఈ నక్షత్రాలు ఇలా తయారవడానికి బింబ- ప్రతిబింబ (Mirraring effect) సిద్ధాంతం వల్ల కాదు, పరిశోధించి చూడగా ఆ రెండింటిలో ముఖ్యమైన నక్షత్రాన్ని తనకి ఉపగ్రహంగా వున్న నక్షత్రాన్ని ప్రభావితం చేస్తున్నది. ఏదో ఒక శక్తి ద్వారా, ఈ శక్తి వేరేకాలం సరిగ్గా అది మనస్సులు కలిపి దివ్యదృష్టితో మాట్లాడుకుంటున్నాయా అన్నట్లుగా వుంటుంది - చూస్తే! అంటూ పెద్దగానవ్వి తన సిద్ధాంతాన్ని విశదీకరించాడు. ఈ విచిత్రమైన సిద్ధాంతాల పర్యవసానం అంతా ఆకళింపుచేసుకుని గనక ఆలోచిస్తే ఈ విశాల విశ్వంలోని కాలంయొక్క పాత్ర ఏమిటో విశదమవుతుంది.

ఈ విశాలవిశ్వంలో నక్షత్ర మండలంలో చూసినా అందులోని 'శక్తి' పదార్థముల సమ్మేళనం స్థిరంగా వుండక క్రమంగా క్షీణించి పోతూ వుండటానికి కారణం ఏమిటి? అని ఒక ప్రాథమిక సమస్యను లేవదీశాడు డా॥కొజైవ్ ఇందులో ఒకటి సాధ్యం అని చెప్పవచ్చు. పదార్థంతో తయారయిన ఈ గ్రహనక్షత్ర ప్రపంచాలలో జరిగే అన్ని మార్పులూ ఏదో ఇంకొక మహాశక్తివంటి ప్రవాహానికి ఆహారమై సముద్రంలో చేరే నదులవలే అవుతున్నాయి - మళ్ళీ ఆ ప్రవాహమే వెనుకగా అంతర్వాహినిగా వచ్చి, ఈ పైకి కనిపించే పదార్థ ప్రపంచానికి ఆధారం కలిగిస్తున్నట్లు అనుకోవచ్చు.

"ఈనాడు చాలామంది సైంటిస్టులు ఆకాశంలో కనిపించే నక్షత్రాల గురించి ఆలోచించేటప్పుడు అవి ఒక పెద్ద అణుశక్తి 'రియాక్టరు'లాగ - అణుశక్తిని తయారుచేసే యంత్రంలా భావింపబడుతోంది. కాని నా పరిశోధనవల్ల నేనీ నిశ్చయానికి వచ్చాను - ఏమంటే ఇందులో జరిగే మార్పుల్లో అణుశక్తి రియాక్షన్ల (Reacations) కు మొదటి ప్రాధాన్యత లేదు. దానికి రెండవ స్థానమే. ఈ నక్షత్రాల్లో అపారమైన శక్తి ఎక్కడ నుండి వస్తోంది?'.

కాలమేక్రమంగా వృద్ధిపొంది, ఒక రకమైన భౌతిక సత్యంలాగ ప్రత్యక్షమై ఈ కనిపించే పదార్థ ప్రపంచానికి కొత్త శక్తులనూ, కొత్త రకాల గుణములను సంపాదించి పెడుతున్నది. అసలీ ప్రపంచంలో వున్న ప్రధానమైన శక్తి పదార్థానికి వెనకవున్న శక్తికూడ సప్లయి (Supply) చేసే అపారమూ, అనంతమూ అయిన 'శక్తినిధి' (Source of Power) ఈ కాలంనుంచే వస్తున్నది.

ఈనాటి సైన్సులలోని పెద్దపొరపాటు ఎక్కడ వున్నది అంటే, కాలం యొక్క లక్షణాలలో గతాన్ని, భవిష్యత్తును ఒకటిగానే భావిస్తారు. ఈనాటి సైన్సు గతించిన కాలానికి రానున్న కాలానికి తేడా గమనించదు! కాని మన మనస్సుతోచూస్తే కాలం గతంలోనుంచి ప్రవహిస్తు భవిష్యత్తు వైపు పరుగెతున్నట్లు కనిపిస్తుంది అంటాడు, కొజైరేవ్ తాను చేస్తున్న ఈ రహస్య పరిశోధనలవల్ల.

పైన మనం తెలుసుకున్న నిజానికి డా॥నికోలాయికొజైరేవ్ సిద్ధాంతంలోని అగాధమైన సైన్సు రహస్యాలను విడిచిపెట్టి అందులోని వెయ్యోవంతే సూత్రప్రాయంగా పరిశీలించాము. ఈనాటి సైన్సు ప్రపంచంలో డా॥ కొజైరేవ్ చేసిన అపూర్వ పరిశోధన ఎంతగౌరవించబడుతోందో తెలుసుకోడానికి ఒకటి మచ్చుకుచాలు. అమెరికాలోని కామర్స్ విభాగంలోని పరిశోధనా విభాగంలో "కొజైరేవ్" సిద్ధాంత వ్యాసాల్లోంచి యధాతథంగా అనువాదం చేయబడి ప్రమాణగ్రంథంగా నిక్షిప్తం చేయబడి వున్నాయంటే, డోగ్లాస్ రిసెర్చి లేబరేటరీలో, కాలిఫోర్నియాలోకూడ పరిశీలించబడుతున్నాయంటే ఇంకేం కావాలి.

ఈయన చేసిన అసాధారమైన పరిశోధనయొక్క విలువని అంచనా వేస్తూ అమెరికన్ సైంటిస్టు అల్బర్ట్ విల్సన్ ఇలా అన్నాడు.

దీనిలోతు అగాధం! ఇది మనసైన్సు ఊహించే ప్రపంచాన్ని తలక్రిందులు చేస్తుంది. ఈనాటి సైన్సు విజ్ఞానంలోనే నిజమని భావించే సిద్ధాంతాలను గల్లంతు చేస్తుంది.

---

* **Dr. Albert Wilson (Douglas Research Laboratory California) - Possibility of experimental story of the Property of time J.P.R.S. 45238 May 2, 1968.**

కొజెరేవ్ కనుగొన్న సిద్ధాంతాలను ఈనాటి సైంటిస్టులు పూర్తిగా అవగతం చేసుకోవాలంటే ఒక తరం సైంటిస్టుల జీవితకాలం సరిపోతుంది. ఆయన భవిష్యత్తులోకి ఎంత పెద్దఎదుగు ఎగిరాడో తెలుసుకోడానికి! ప్రపంచాన్నీ దాని నిర్మాణాన్నీ కొత్తరకంగా అర్థం చేసుకునే నూతన ఆలోచనా విధానం, దీని విలువ అపూర్వం.

వేదంలోని 'రాత్రిసూక్తం'లో - కాలం ఒక 'మహాశక్తి' అని వర్ణించి వున్నది. ఆ శక్తియొక్క లవలేశం వల్లనే, ఈ కనిపించే పదార్థమై ప్రపంచం అంతా నడిపించబడుతున్నది- అదే ఈ పదార్థం పుట్టుక వినాశం రెంటినీ నిర్వహిస్తున్నదని తెలియజేస్తున్నదన్న విషయాలకు డా॥ కొజైరేవ్ కాలం మీద కనిపెట్టిన రహస్యాలు ఎంతో పోలిక వున్నది. వేదాలకూ కొజైరేవ్ సిద్ధాంతాలకు గల ఈ పోలిక కేవలం యాధృచ్ఛికమా?

ఈ మాటకి సమాధానం డా॥ చార్లెస్ ఎమూజెక్ మాటాలలో చెప్పాలంటే- 'చివరికి మనమంతా ఒక రోజున 'టైము' అనే దానికి ఈ ప్రంపచంవెనుకవున్న ఒకానొక మహాకారణం కనిపెట్టడం తప్పకచూస్తాం' ఆయన కూడా కాలం నుంచివచ్చే తరంగాలు, స్పందనలు లేక కంపనలవంటివి, అని స్థిరపరిచాడు.

కాలుడే అన్నీ నడిపిస్తున్నాడన్న వేదలకాల సిద్ధాంతం! ఈ నాటి భౌతిక వాదులకారాధ్యక్షేత్రమైన కమ్యూనిష్టు రష్యాలో జన్మించటం, ఊహకందని విచిత్రం, రష్యాలో ఆధునిక వేదం దర్శించడం యిరవై యొక్కకటవ శతాబ్దపు వింత! వింతల్లోకల్లావింత!



---

* మనకు ఆధ్యాత్మిక జన్మమొసగువాడే నిజమైన గురువు, అతనిగుండానే ఆధ్యాత్మిక మైన వాహిని మనలోకి ప్రవహిస్తుంది. అతడే ఆధ్యాత్మిక ప్రపంచమంతటితో మనకు సంబంధమును కలుపుతున్నాడు. ఒకానొకవ్యక్తిని మితిమీరి విశ్వసించుట దౌర్భల్యానికి, వ్యక్తి ఆరాధనకు కారణమౌతుంది.



# భారతీయ ఆధ్యాత్మిక సాంఘిక సంస్కృతి విద్యా సముద్ధరణ సంస్థ

## (యోగమిత్రమండలి)

# UNITED SOCIAL CULTURAL & EDUCATIONAL FOUNDATION OF INDIA (USCEFI)

# అంటే ఏమిటి?

మనది భారతదేశం! ప్రపంచంలో మన భారతీయులకు మనది అంటూ ఒక **ప్రత్యేకసంస్కృతి** వుంది! మన సంస్కృతి గురించి మనం తెలుసుకోవాలంటే - ప్రతి భారతీయుడూ - మన జాతిగురించి మన దేశంగురించి, శాస్త్రాలగురించీ సరైన విజ్ఞానం ఇచ్చే ఇలాంటి అమూల్య గ్రంధాలు చదివితీరాలి!

## మా లక్ష్యం

భారతదేశమన్నా, **భారతీయ సంస్కృతి** అన్నా, కళలూ, మన జాతీయ సాహిత్యం అన్నా, ప్రజలలో గౌరవం, భక్తీ ఇనుమడింప చేయటమే, ఈ **"భారతీయ సంస్కృతి సముద్ధరణ సంస్థ"** - లేక **USCEFI** యుస్కెఫీ లక్ష్యం. **USCEFI** — అన్న అక్షరాలు **"United Social Cultural & Educaitonal Foundation of India"** అన్న ధర్మసంస్థ పేరు. సంక్షిప్తంగా దీన్నే మామూలుగా **"యుస్కెఫీ"** లేక **"భారతీయ ఆధ్యాత్మిక సాంఘిక సంస్కృతి విద్యా సముద్ధరణ"** సంస్థ అని తెలుగులో.

ఈనాడు ఎటుచూసినా దేశంలో తలెత్తే విచ్ఛిన్నకర శక్తులు దేశానికే ప్రమాదం కలిగించగలవు. అలాకాకుండా రక్షించగల తారకమంత్ర - **రాజకీయాలు** కాదు, తుపాకులు కాదు, లారీలుకాదు - ప్రజలలో కరుడు కట్టుకున్న దేశభక్తీ, త్యాగం, ఆధ్యాత్మిక ధృక్పధం, ఇవి మాత్రమే మనల్ని రక్షించగలవు.

ఇది ఒక ధర్మ సంస్థ. అంటే స్వలాభం వ్యాపార దృష్టిలేని - (Non-Profit Organisation) భారతీయ ధర్మం మీద (Donations) ఆధారపడిన, సంస్థ.

రాజకీయాలతో, కులమత తత్వాలతో, ముఠాతత్వాలతో సంబంధం లేకుండా - అంతేకాదు - వీటికి **విరుద్ధమైన,** ఆదర్శ సామాజిక **చైతన్యం,** కల్పించి, పన్నులుకట్టే "ఓటర్ల" తో స్వయంపరిపాలనద్వారా దేశాభి వృద్ధి - రాజకీయపార్టీలు లేకుండా - మనమే, మనదేశాన్ని పాలించు కోవాలనే జాతీయత తేవడం, Nation కోసం పాటు పడడమే, యీ **USCEFI** ధర్మసంస్థ కార్యక్రమము.

# USCEFI (యుస్కెఫీ) కార్యక్రమాలు

## 1. ఆధ్యాత్మిక ప్రచురణలు

ఈ సంస్థ కార్యక్రమాలలో మొదటిది ఆధ్యాత్మిక ప్రచురణలు. ఈనాడు సమాజంలో విషబీజాలను నాటుతున్న పుస్తకాలూ, ప్రచురణలూ అనేకం! ఇవి సెక్సు గురించీ, నేరాల గురించీ, సంఘద్రోహ చర్యల గురించి గొప్పగా వర్ణించి, **పిల్లల మనస్సులను పాడుచేసే** పుస్తకాలే! ఇవి కొల్లలుగా పుస్తక రూపంగా; చెత్త పత్రికల రూపంగానూ, నిత్యమూ ప్రచురింపబడుతున్నాయన్న విషయం మనకందరికీ కూడా తెలుసు. కాలేజి పిల్లలుకూడా ఇవి చదివి వాళ్ళ మనస్సు చెడు ప్రభావాలకు లోనుకాకుండా, అతి చిన్నప్పుడే వాళ్ళకు వ్యక్తిత్వంలోని **పవిత్రత నశించటంతో, దేశభక్తికి** పనికిరాని విధంగా వీరు తయారుకావటమూ చూస్తున్నాం!

మనుషులను దుర్గార్గులుగా దోపిడీదారులుగా, నేరస్తులుగానూ **తయారు చేయటమే** తమ **పనిగా** పెట్టుకున్న కొందరు **"దేశద్రోహకరశక్తులూ"**, వ్యాపార సంస్థలూ కలిసి, నిత్యం ప్రచురించే ఈ విష పుస్తకాలు జాతికే విషప్రాయమైనవి. **ప్రతి తల్లీ, తండ్రీ** ఈ ఘోర **ప్రమాదం గమనించి** తమ పిల్లలు బైటికి వెళ్ళి కాలేజీనుంచి తిరిగివచ్చేలోపున **ఏ విషపరిణామాలకు గురి అవుతున్నారో** - ఎటువంటి చెడు పుస్తకాలు చదువుతున్నారో గ్రహిస్తే -

**ఈనాడు అనాధాశ్రమాలలో** దిక్కులేని చోట్లా గర్భస్రావాలు చేయించుకునే ముక్కుపచ్చలారని పిల్లలూ, ఇంట్లో **చెప్పకుండా పారిపోయి** - చదువు మానేసి అటు ఉద్యోగానికీ కొరగాక, ఇటు చదువుకూగాక, **తిండిలేక చివరికి ఆత్మహత్యలకు** పాల్పడే యువకులూ, ఇంకా మరికొందరు **స్వార్థ రాజకీయాలకు** ఆహుతి అయిపోయి చివరికి దేశంలో బందిపోటుదారుల క్రింద బ్రతికి, క్రమశిక్షణలేని, ఆధ్యాత్మిక వికాసానికి నోచుకోని, పవిత్రతలేని దిక్కులేని జీవితాలు కలిగిన యువకులను ఎంతోమందిని చూస్తున్నాముగదా - ఈ ప్రచురణలు చేసి డబ్బుచేసుకునే వీటన్నింటికీ ఎవరు బాధ్యులో తెలుస్తుంది!

ఈ బాధ్యత లేనటువంటి సెక్సు పుస్తకాలూ, బాధ్యతలేని విష పరిణామాలతో కూడిన ప్రచారసాహిత్యం, **చవకబారు సినిమాలూ**, ఇంకా **పిల్లలు** ఏమి చేస్తున్నారో **ఏం చదువుతున్నారో** పట్టించుకోనటువంటి జంతు ప్రాయులైన తల్లిదండ్రులూ దేశం ఎటుపోతోందో ఆలోచించనటు వంటి **గుడ్డి రాజకీయ నాయకులూ** ఇలాగ - ఇవన్నీకలసి మనదేశాన్ని ఒక పెద్ద రాజకీయ సుడిగుండంలోకి లాగుతున్నాయి. ఇటువంటి ప్రమాదం నుంచి సమాజం తప్పించుకొని బాగుపడాలంటే **స్వలాభం కోరని "ధర్మ సంస్థలు"** మన దేశం గురించీ, మన ప్రాచీన విజ్ఞానం గురించీ, దేశభక్తి, మంచి నడతవంటి చిన్నపిల్లలు నేర్చుకోదగ్గ అనేక విషయాల్ని తేటతెల్లంగా సులభశైలిలో చక్కని గ్రంధాలను వేయాలి! ఇలాంటివి అందరూ అర్థం చేసుకోవాలన్న భావంతోనే **"యుస్కెఫీ" (USCEFI)** సంస్థలో ఈ ధర్మ - **'ప్రచురణ విభాగం'** ఏర్పడింది.

# 2. జాతీయ విద్యావిధానం - గురుకుల పాఠశాలలు కార్యక్రమాలు

## జాతీయ విద్యావిధానం

**"వేదవ్యాస భారతి గురుకుల పాఠశాలలు"** - విద్యార్థులకు నేడు లభిస్తున్న విద్యపట్ల అటు పాశ్చాత్యులకుండే క్రమశిక్షణా, సునిశిత శాస్త్రీయ దృక్పధంకానీ, కలగటం లేకపోగా మానసిక, బ్రిటీషువాడిచ్చిన ఔద్యోగిక - దాస్యమనస్తత్వం పెరుగుతున్నది. అందుకని **గురుకుల పద్ధతిలో** సంస్కృతం, యోగాసనాలతోపాటు ఈనాటి మెట్రిక్ పరీక్షకు సరిపోయే వ్యవహారిక విద్యతో **"హిందూమతం"** కూడా బోధించే పాఠశాలలు ఏర్పాటు - **"యుస్కెఫీ" (USCEFI)** కార్యక్రమాల్లో - ముందున్నది.

## భారతీయ విద్య

అంటే భారతీయమైన చదువు చెప్పాలి. ఈ విద్యాలయాలలో ఇప్పుడు మనం చదువుకునేది భారతీయ విద్యకాదు! పరదేశీయులు ఏర్పరచింది. అంతేకాదు, **"భారతీయత"** నే నాశనం చేయటానికి 'మెకాలే' (Macauley) ఉద్దేశించి మొదలుపెట్టిన విధానాన్నే - అతుకులుపెట్టి, మాట్లువేసి - **రాజకీయాలతో, సంకరం** చేసి - డబ్బు దండుకునే **"డొనేషన్ విద్యనే"** 'విద్య' అనుకుంటున్నాం. దానికే, వేలకి వేలు డబ్బుపోసి - **ఆస్తులు అమ్మి** అయినాసరే "డిగ్రీ" అనే నిరుద్యోగి భిక్షాపాత్ర చేతికి తెచ్చుకొని ఉద్యోగంకోసం గడపా - గడపా ఎక్కి, అడుక్కునే హీనులుగా మన యువకుల్ని తయారుచేసింది ప్రభుత్వం. ఈనాటి విద్య ఇది **భారతీయ విద్య** (National Education) ఎలా అవుతుంది?

## మహిళా విభాగం

పిల్లలకు ప్రధమ గురువు **తల్లియే!** వారిని సక్రమంగా పెంచి, భావి పౌరులుగా తీర్చిదిద్దేందుకు తగిన శిక్షణ కోసం, మానసిక వికాసం కోసం స్త్రీలకు ప్రత్యేకంగా ఈ **"మహిళా విభాగం"** ఏర్పాటు చేయబడింది.

## శ్రీమన్నారాయణ యజ్ఞం

నరుణ్ణి "నారాయణుడి"గా మార్చగల ఈ యజ్ఞం ప్రతి సంవత్సరము మకరసంక్రాంతి పుణ్యకాలములో దుద్దుకూరు (పశ్చిమగోదావరిజిల్లా) శ్రీపర్వతం మీద శ్రీ వేంకటేశ్వరస్వామివారి దివ్యసన్నిధిలో నిర్వహించబడుతున్నది. ఈ యజ్ఞంలో పాల్గొన్న వారెందరికో దివ్యానుభూతులు కలిగాయి.

మనదేశం బానిసత్వం నుంచి రాజకీయంగా సంకెళ్ళు తెంచుకొని బయటపడి 48 సంవత్సరాలు అయినా మనమింకా **మానసికంగా పరిపూర్ణ స్వాతంత్ర్యాన్ని** పొందనేలేదు.

అంటే ఏమిటో - దీనికి అర్ధం తెలియాలంటే ఒక్కసారి, నేటి మన సమాజం పోకడలు చూస్తే చాలు! తెలుస్తుంది!! ఈనాటి భారతీయుడూ వేషభాషలలో విదేశాలకి దాసుడని! అది రష్యా, అమెరికాగాని ఏదేమైనా గాని మనదేశానికి మాత్రం కాదు! అటు చైనాకో ఇటు రష్యాకో, లేక అమెరికాకో అమ్ముడుపోయిన దాసులైపోయి తన ఆత్మనే మరచిపోయిన ఎందరో విద్యార్థులూ, లెక్చరర్లూ, **రాజకీయనాయకులూ ఇలా** లెక్కకు మీరి కనపడతారు. చూడటానికి మనకి కళ్ళుండాలి! అంతే!

ఈనాటి ఈ దేశ పరిస్థితిని పట్టించుకునేవారుగాని, నేటి యువతరం పొందిన పతనాన్ని, మనజాతి రానున్న భవిష్యత్తు గురించిగానీ, బాధపడే

వారే ఈనాడు దేశంలో దాదాపు లేరంటే, మనం సామాజికంగా, పరదేశాలకు ఎంతగా బానిసత్వంలో వున్నామో తెలుస్తుంది.

## జాతీయ - చరిత్ర

ఇంతేకాదు! మనదేశం నిజమైన చరిత్ర ఏమిటో దాన్నిగురించి పరిశోధన ఎంతో చేయవలసి ఉన్నది. ఇంగ్లీషువాడు ఇచ్చిన "బానిసత్వ - విద్యావిధానం" నుంచి మనం బయటపడటానికి మనకొక "జాతీయ విద్యావిధానం" ఏర్పడవలసి వున్నది, ఇలాంటి 'విద్యా విధానం' తయారు చేయాలన్న అవసరం ఏర్పడి ఇప్పటికి 20-సంవత్సరాలకు పైబడినా ఇంకా అలాంటి విద్యావిధానం ఎలా తయారుచేయాలో యోచించగల సమర్థులు గాని, నిర్మించగల మేధావులుగాని లేకపోవడం సమగ్రమైన "జాతీయవిద్య" అంటే ఏమిటో కూడా నిర్వచనం చెప్పలేని విద్యావేత్తలూ, అధికారులూ వుండటము - ఫలితంగా కాలేజీలు, యూనివర్సిటీ మొదలైన విద్యాసంస్థ లన్నీ ఈ 50 సం॥లుగా రాజకీయాలతో ఉడికిపోతున్నాయి! ఏ రోజు వార్తలు చూసినా బంద్‌లు, తగాదాలూ, విద్యార్థుల తిరుగుబాటులు, అధ్యాపకుల అవినీతి - ఇవే కనబడుతున్నాయి.

జీవితంలో తనకాళ్ళమీద తాను నిలబడే శక్తినిచ్చేదే, నిజమైన విద్య! ధైర్యం, బలం క్రమశిక్షణ నేర్పేదే విద్య! అన్యాయాన్నీ అధర్మాన్నీ భయం లేకుండా ఎదుర్కొనే మగతనం ఇచ్చే టానిక్కు నిజమైన విద్య! అంటే, మానసిక దాస్యం, ఉద్యోగాలలో దాస్యం, నేర్పే జైలుకాదు - విద్యాలయం అంటే!

జీవితంలో సరైన విలువలు యిచ్చి ఆత్మ స్వాతంత్ర్యం (Independent Spirit) అంటే ఏమిటో రుచిచూపి ధర్మం ఎలాంటిదో అధర్మం మారువేషా

లెన్నో చూపి, దేశానికి మంచినిచ్చే ప్రభావాలను రక్షిస్తూండగల, స్వతంత్ర పౌరుల్ని తయారుచేసేదే, భారతీయ విద్య లేక National Education.

## నూతన గురుకులం

"యుస్కెఫీ" ఏర్పడ్డ పది సంవత్సరాలలోనూ కేవలం గ్రంథాలు ప్రచురించటమే కాకుండా ఒక ఆదర్శమైన స్కూలు ఏర్పాటుచేసే కార్యక్రమం కూడా చేపట్టింది. ఇందులో ప్రాచీన గురుకుల పద్ధతిలో నేర్పే సంస్కృతము, యోగము, ఆసనాలు, మొదలైన వాటితోపాటు ఈనాటి "మెట్రిక్" వరకూ సరిపోయే సైన్సు, ఆర్ట్సుతో వ్యవహారిక విద్యకూడా బోధింపబడుతుంది. ఇందులో బోధించే సబ్జక్టులు కాదు ముఖ్యం - ఈ బోధనా పద్ధతే విలక్షణం, ఎక్కడా లేదు!

ప్రాచీన ఋషిసంప్రదాయం పద్ధతి ప్రకారం ఈ గురుకులమును, ఆశ్రమంలాగా ఏర్పాటు చేస్తున్నాము. ఇందులో ఒక వేంకటేశ్వరస్వామి ఆలయం - కాన్వెంటులో చర్చివలే - హాస్టలూ, తోటపని, ఆటస్థలము, వ్యాయామానికి, లలిత కళలకూ అన్ని సౌకర్యాలతో, సంస్కృతం, యోగం 10-15 సం॥ల పిల్లలకు బోధిస్తారు. ఇందులో 7-10, సంవత్సరాల మధ్య పిల్లలను చేర్చుకుంటారు.

భారతీయ విజ్ఞానం, చరిత్ర, కళ, సంగీతం, శిల్పం, వైద్య, జ్యోతిష శాస్త్రాలలోని సారం పిల్లలకీ, స్త్రీలకి, తెలిసేలాగ వ్రాసి ప్రచురించటం - ఈ USCEFI సంస్థ రెండోపని!

## సంఘసేవ

సంఘంలో అన్యాయాలకు బలి అయినవాళ్ళని అన్యాయాలను చక్కదిద్దటానికి కావలసిన కార్యక్రమాలకి చేయూత, సాయం ఆర్థికంగా గ్రాంట్లు యివ్వటం USCEFI మూడోపని!

## సత్సంగం

ఈ శుభవార్త పత్రికే కాకుండా ఈ **USCEFI** సంస్థ నడిపే కార్య క్రమాలలో అతి ముఖ్యమైనది "సత్సంగ" కార్యక్రమం.

"సత్సంగం" అంటే సద్బుద్ధితో కొందరు మిత్రలు, సాధకులూ, ఒక చోటచేరి చేసే ఆధ్యాత్మిక కార్యక్రమం! ప్రతినిత్యం సినిమాలకు చీట్ల పేకలతో జూదాలకు, మనకాలాన్ని దుర్వినియోగం చేయకుండా మానసిక ఆధ్యాత్మిక క్రమశిక్షణతో సాంఘికంగా నలుగురూ కలిసి దేశంలో ఆధ్యాత్మిక శక్తిని సంపాదించేందుకు ఏర్పాటుచేయబడిన అపూర్వ కార్యక్రమమే - సత్సంగ్. దీని కేంద్రాలు యుస్కెఫీ అన్ని సెంటర్లలోనూ పనిచేస్తున్నాయి. ఇది ప్రతి ఆదివారం సాయంత్రం 6 గంటల నుండి 8 గంటల వరకూ యుస్కెఫీ సభ్యుల ఇండ్లలో వరుసప్రకారం జరుగుతుంది. వారానికి ఒక సభ్యుని ఇంటిలో ఈ సత్సంగ్ ఏర్పడుతుంది.

ఇందులో సామూహికంగా అందరూ కలిసి ధ్యానం చేస్తారు. ముందుగా **"ప్రణవం"** ధ్యానించిన తరువాత సంకీర్తన భగవన్నామకీర్తన జరుగుతుంది. తరువాత ఒక ఆధ్యాత్మిక గ్రంథం నుండి పారాయణగా పఠనం, ఆ తరువాత సంఘసేవా కార్యక్రమాలను గురించి చర్చలు.

ఇలాంటి కేంద్రాలు న్యూఢిల్లీలోనూ, బెంగుళూరులోనూ, మద్రాసులోనూ, హైద్రాబాద్‌లోనూ, ఏలూరులోనూ, రాజమండ్రిలోనూ, బొంబాయిలోనూ, కాకినాడలోనూ ఇలా గురుదేవులు ఎక్కడెక్కడ కొంతకాలం ఉండి మన ఆధ్యాత్మిక ఉత్తేజం కోసం తమ అమూల్యమైన సందేశాన్ని అందజేశారో అక్కడక్కడ వుండిన మిత్రులంతా కలిసి ఏర్పాటుచేసిన కేంద్రాలు పని చేస్తున్నవి. ఇలా కొద్దికాలంలోనే ప్రతిజిల్లాలోనూ పనిచేసే "సత్సంగ్" కేంద్రాలు ఏర్పాటు చేయటం జరుగుతున్నది.

ఈనాడు ప్రతివాడికి ఏదో ఒక సమస్య బాధపెడుతున్నది. కొందరికి చాలా సమస్యలు! ఈ సమస్యలు లేనివాళ్ళెవరూ కనపడటంలేదు అయితే ఈ సమస్యలు తీరేదెలా? మనం జీవితంలో సాధించవలసినవి అనేక ఆశయాలూ, కోరికలూ, అవసరాలు, తీరేదెలా! అన్నదే ప్రతివాడినీ పట్టుకు పీడిస్తున్న సమస్య.

డబ్బులేక, డబ్బుచాలక అనుకున్న ఎన్నో మహత్తర కార్యక్రమాలు జీవితంలో మూలబడి - కోరికలు నెరవేరక నిస్పృహతో వున్నారా మీరు?

ఆరోగ్యంలేక బాధపడుతున్నారా? లేక మీ ఉద్యోగంతో సంతృప్తి లేక వృత్తి వ్యాపారాలలో జీవితం అసంతృప్తిగా వుంటోందా? ఈనాటి ప్రపంచంలో ప్రతి మనిషి - ఇలా ఏదో సమస్యతో ఏవో బాధలతో నిరుత్సాహంతో జీవితం మీద విరక్తితో బాధపడున్నవాడే, నివారణ ఎలా?

ఆలోచించండి! మన జీవితాలను కంటికి కనిపించని ఒకానొక అదృశ్యశక్తి నడిపిస్తోందని ఎప్పుడైనా మీకు తోచిందా! ఏమిటి ఆశక్తి? దానిని మన జీవితాలలోకి ఆకర్షించి మనకు కావలసిన ఆరోగ్యం, మనశ్శాంతీ, ఆర్థిక వసతులూ కలిగించేలాగ మానవుడు చేసుకోగలడా? అలాంటి "సిద్ధ పురుషులు" మానవ చరిత్రలో తమతోటి మానవులకందని శక్తినీ, జ్ఞానాన్ని, అదృష్టాన్నీ, ఆత్మసంతృప్తినీ పొందగలిగిన **"రహస్య విజ్ఞానం"** (Secret Esoteric Wisdom) గురించి మీకు తెలుసా!

నిస్పృహతో ఎండిపోయిన మీ జీవితాలను చిగురింప చేసుకునే **దివ్యశక్తి** (God Force) ని ఆకాశంలోనించి మనలోకి ఆకర్షించుకునే **'రహస్య విద్య'** ప్రాచీనులకి తెలుసు! కాని అది మతం కాదు. క్షుద్ర భూతాలను వశం చేసుకునే సిద్ధిగాదు. అది మానవ జీవితాన్ని నడిపిస్తూ

- మన మనస్సుకు **అందని సిద్ధ, యోగశాస్త్రరహస్యం.** అదేమిటో ఎప్పుడైనా ఆలోచించారా?

**దూరాన తిరుగుతున్న గ్రహాలను "ఆకర్షణ" అనే శక్తితో బిగించి గతి తప్పకుండా నడిపించే అదృశ్యశక్తియే మన భూమిని నిత్యం క్రమమార్గంలో తిరుగుతుండేలాగ నిలబెట్టింది! మన గుండెలు కొట్టుకునేలాగ నడిపించేది, నదులు కొన్ని తూర్పుకి, కొన్ని పడమరకి ప్రవహించేలాగ నిశ్చయించేది, ఏ రోజున ఎవరు మరణించేది కొందరు ఆరోజే జన్మించేలాగ ఇలా "విశ్వకార్యక్రమం" నిర్వహించేది - ఒక అదృశ్యశక్తి - అదేమిటో ఆలోచించారా?**

అది మీ జీవితాన్ని మార్చి మీ అదృష్టాన్ని సరిదిద్ది మనందరి జీవితాలను కూడా విశ్వంలో తిరిగే కోటానుకోట్ల నక్షత్ర మండలాలను సక్రమంగా నడుపుతున్నట్టే నడిపించేలాగ చేసే రహస్యం మనకి తెలిసే దెలా? మీకు తెలుసా?

తెలుసుకోవాలంటే **(USCEFI) 'యోగమిత్ర మండలి'** వారిని సంప్రదించండి. (ఏ మతస్థులైనా సరే పట్టింపులేదు) మీకు 'దివ్యజీవనం', 'ఆధ్యాత్మిక జీవితం' తెలిపేది **'యోగమిత్ర మండలి'**యే.

# ఆధ్యాత్మిక మాసపత్రిక

ఈనాడు దేశం ఎటుచూసినా నిరాశా నిస్పృహలతో నిండిపోయి స్వార్థం హింస అజ్ఞానాలతో కరుడుకట్టుకుపోయిన ఈనాటి చీకటి సమాజంలో "సెక్సు" పుస్తకాలూ రాజకీయాలు నవలలే కనిపిస్తున్నాయి. ఎటు చూసినా చీకటి బజార్ల జేబులు నిండుతున్నాయి. జనం కూడా చెత్తమేస్తూ పశుత్వంలోకి దిగజారిపోతున్న ఈ తరుణంలో ఈనాటి యువతీయువకు లకు మానవ జీవిత గమ్యం ఏమిటో తెలిపి నిత్యజీవితం నడిపించు ంటూనే 'సాధన' చేసుకునే రహస్యాలు శ్రీ గురుదేవుల అమూల్య ఉపదేశ క్యాల ద్వారా అందిస్తున్న ఈ ప్రచురణలు ప్రతి భారతీయుడూ చదవాల్సి నవి.

**"శుభవార్త"** (ఆద్యాత్మిక జ్యోతిష యోగ సాహిత్య మాసపత్రిక)

గృహిణులు తీరిక కాలాన్ని ఇంట్లో వ్యర్థంచేస్తూ కూర్చోకుండా ఆ కాలాన్ని సద్వినియోగం చేస్తూ సంఘానికి సేవచేయాలనే ఉద్దేశ్యంతో **ఢిల్లీలో 1975లో "శుభవార్త"** అనే ఒక పత్రికను కూడా స్థాపించటం **జరిగింది!** ఇది ఆధ్యాత్మిక "ధర్మ-సంస్థ" నడిపే ఏకైక మాసపత్రిక. ఈ పత్రికను యోగమిత్రులే నడుపుతున్నారు. దీనిని ప్రతివారూ తమ నిత్య **జీవితంలో** రోజూ పనులు చేసుకుంటూనే ఇంట్లో యోగసాధన నడిపే

టటువంటి పద్ధతి మీరు వ్యాసాలు మరియూ దేశభవిష్యత్తును తెలిపే **జ్యోతిషశాస్త్ర సంబంధమైన వ్యాసాలూ,** ప్రాచీన **తాటాకు గ్రంథాలలో** మన కెవ్వరికీ తెలియకుండావున్న **అద్భుతగ్రంథాల రహస్యాలు** ఎన్నో **ప్రతీనెల** ప్రచురింపబడుతున్నాయి!

ఇంతేకాకుండా ప్రతీనెలా వచ్చే **"పండుగల"** యొక్క ప్రాముఖ్యత ఏమిటీ? ఈ **"పండుగల యొక్క రహస్యం ఏమిటి?"** వీటి వెనుకవున్న మనం చేయటానికి వేదకాలంనాటి **ఋషులు ఏర్పరచిన విధులు,** వెనుక దాగివున్న **ఆరోగ్య విషయాలూ,** ఇంకా సైన్స్ దృష్ట్యా ప్రాముఖ్యతలూ, ఇవన్నీ తెలిపే - అనేక వ్యాసాలు ప్రచురింపబడుతున్నాయి ప్రతినెలా! అతి తక్కువ వెలలో అందరు గృహిణులకూ, పిల్లలకూ సైతం అందు బాటులో ఉండే విధంగా ఇలా చేయబడింది!

గురుదేవుల ఆధ్యాత్మిక ఉపన్యాసాలను ఓపికతో వ్రాసి అచ్చువేసి స్వంతఖర్చుతో ఆధ్యాత్మిక సోదరులకోసం సాధకులైన గృహిణులు మీకు అందించే ప్రచురణ! త్యాగంతో సాధకులైన మహిళల సమాజం మీకోసం అందిస్తున్న అమూల్య ప్రచురణ!! ప్రతినెలా మన సాధక మిత్ర బృందానికి అందించే **"శుభవార్త"!!**

# ఆధ్యాత్మిక ప్రచురణలు

## పురుషసూక్త రహస్యము

ఈ పురుషసూక్త గ్రంథం ఒక అపూర్వమైన గ్రంథమని "విషయ సూచిక" చూస్తే మీకే తెలుస్తుంది. ఇందులో ముఖ్యమైన అంశం ఏమిటంటే "పురుష సూక్త మంత్రము" విడివిడిగా నాలుగు వేదాలలో ఉన్నట్టు నాలుగూ ఇలా మొదటిసారిగా తెలుగులో ప్రచురించబడటమే! ఇంతే కాకుండా పురుషసూక్తం పై కేవలం తాత్పర్యం టీకా మాత్రమే కాకుండా జ్యోతిషశాస్త్ర దృష్ట్యా విశేషార్థాలు ఇంకా యోగశాస్త్ర దృష్ట్యాకూడా అనేక గహనమైన విషయాలు వివరిస్తూ వేదాల ఉపనిషత్తుల సారంతో కూడిన గురుదేవుల వ్యాఖ్యను కూడా ఇందులో ప్రచురిస్తున్నాము. "ముద్గలోపనిషత్తు" లోని పురుషసూక్త మంత్రార్థము "అహిర్బుధ్న్య సంహిత" లోని పురుషసూక్త వివరణ, కూడా ఇందులో ప్రచురించటం జరిగింది. ఇదంతా గ్రంథంలో సగం భాగమే.

మిగిలిన సగభాగమూ పురుషసూక్తాన్ని అర్థం చేసుకోటానికి కావలసిన సాంఘిక వ్యవహారిక శాస్త్రీయ విషయాలను చర్చిస్తూ పది అధ్యాయాలలో అనేక రహస్య విషయాలను వివరించటం జరిగింది.

ఇందులో మన కులాలు ఎలా పుట్టాయి? చాతుర్వర్ణ వ్యవస్థకు వేదాలలో ఆధారం ఏమి వుంది? ఇది ఈనాటి కులతత్వంతో సరిపోయిందా? ఇది సంఘంలో సరిగా నడవాలంటే నేటి సమాజంలో ఏ మార్పు రావాలి? ఈనాటి కులతత్వ రాజకీయాలకు ఉపయోగించే చాతుర్వర్ణ వ్యవస్థ ఈనాటిలాగా దుష్పరిణామాలకు దారితీయకుండా ఉండాలంటే మానవుని పురోగతికై ఉపయోగపడాలంటే ఏయే మార్పులు చేయాలన్న అనేక శాస్త్రీయమైన సూచనలు ఇందులో ఇంకా ఎన్నో ఉన్నాయి!

## అమృతానుభవం

ఇది ఒక అసాధారణమైన రచనల మాలిక! ఇందులోనివి నిత్య జీవితంలో అనుభవాలూ అనేకుల యదార్థ జీవితానికి సంబంధించినవి. ఇవి కల్పనలుగాని, నవలగాని - కాదు.

నిత్యజీవితంలో సతమతమయ్యే సామాన్య గృహిణీ గృహస్థులయిన వారికి - శ్రీ గురుదేవులు కరుణతో అనుగ్రహించిన ఆధ్యాత్మికానుభవాలు. ఇవి అతిలోకమైన దివ్యానందమును అసాధారణ మాధుర్యమును అందించి వీరి జీవితాలకు "అమృతానుభవాన్ని" ప్రసాదించినాయి.

## శ్రీ విష్ణు సహస్రనామస్తోత్ర రహస్యము

ఇంతకు పూర్వం మరెప్పుడూ అచ్చుకాని సాధనా రహస్యాలతో తప్పులు లేకుండా దిద్దిన అందమైన పెద్ద అచ్చులో చదువుకోవటానికి తేలికగా అచ్చువేసిన అమూల్య గ్రంధం. ప్రతీ యింటా ఉండవలసిన "కొంగు బంగారం". ఇవి కొద్దికాపీలు మాత్రమే వేస్తున్నాము. వివాహాలలో ఉపనయనం వంటి శుభకార్యముల సందర్భంలో - బహుమతి చేసే వెలలేని ఆధ్యాత్మిక "మంత్రమాల" - ఈ విష్ణు సహస్రనామం.

## నారాయణతత్వం

ఇందులోనే నారాయణ మంత్రం జపించే విధానం, యోగమార్గంలో జరిపించే పద్ధతి, అంగన్యాసకరన్యాసములతో వెలలేని సాధనా రహస్యాలను తెలిపే అద్భుత నిధి.

ఈనాడు వ్యాపార సంస్థలు సంకుచిత దృష్టితో కుప్పలు తెప్పలుగా అచ్చువేసి తప్పుల తడకలతోనింపి ప్రజలనుంచి జేబులు నింపుకునే "స్తోత్రాల" బాధనుంచి నిజమైన సాధకులకూ భక్తులకూ అనువుగా ఆస్తికుల సహాయం కోసం వేసిన అమూల్యమైన ఆధ్యాత్మిక గ్రంథం - వెలలేనిది. మళ్ళీ బజార్లో దొరకనిది. నారాయణతత్వం అంటే ఏమిటో మామూలు పండితులకు సహితం అర్థంగాని నిగూఢ యోగరహస్యాలను ఆడవారికి కూడా అర్థమయ్యేలాగా సులభశైలిలో వ్రాసిన "అనుభవ గ్రంథం"!

## యుగపురుషుడు

సంస్కృత మహాభారతంపై జరిపిన గొప్ప పరిశోధనా గ్రంథం. పద్మశ్రీ వి. నాగయ్య తొలిపలుకులతో శ్రీకృష్ణుని అపూర్వ వ్యక్తిత్వాన్ని అనేక కోణాలతో ప్రదర్శించే గ్రంథం.

ఇంతే కాకుండా జ్యోతిష శాస్త్ర గణితంతో ఆనాటి గ్రహస్థితులను లెక్కించి శ్రీకృష్ణుని జననతేది (క్రీస్తు పూర్వం 19-7-3772) నిర్ణయించి చారిత్రక పరిశోధనతో శ్రీకృష్ణుని జాతకం - ఆయన నిత్యజీవితం ప్రతిబింబించే అద్భుత పరిశోధనా రహస్యాలుగల గ్రంథం!

ఇందులో విషయాలు సంగ్రహంగా చెప్పాలంటే -

1. **ఇది భారతజాతి గాథ.**
2. **భారతదేశ నిర్మాణచరిత్రే, మహాభారతంలోని కావ్యవస్తువు.**

3. నవభారత నిర్మాతగా శ్రీకృష్ణుడు.

4. శ్రీకృష్ణుని రాజకీయసేవ, సాంఘికవాదం-శ్రీకృష్ణుని సామాజిక వాదం.

5. శ్రీకృష్ణుని కాలం.

6. శ్రీకృష్ణుడు - భక్తియోగం.

7. శ్రీకృష్ణుని - నిత్య జీవితం, దైనిక కృత్యం.

## గణేశ పురాణం

నిత్యజీవితంలో మనలో చాలామందికి అనుకున్న పనులు అవక అనేక విఘ్నాలు, కష్టాలు, ఆలస్యాలూ, కలగటం అందరికీ అనుభవమే! కొందరికి గ్రహస్థితి కారణంగా, యింకొకరికి పూర్వపు 'చెడుకర్మ' నిమిత్తం గానూ మరికొందరికి తగినంత పట్టుదలా పురషకారం సామర్థ్యం లేకపోవటం వల్ల, అనేక ముఖ్యమైన పనులు ఆగిపోయిన వారున్నారు. ఇలాంటి వారికి "గణేశ పురాణం" వరప్రసాదం వంటిదని చాలామందికి తెలియదు. వీరిలో కష్టాలు నివారణ కోసం అనేకమంది గురుదేవులు శ్రీ వేదవ్యాస IAS గారిని సంప్రదించేవారు. అలాటి వారికిది కల్పతరువు.

శ్రీ జగద్గురువు "శృంగేరి శంకరపీఠాధిపతులు" పూర్వాశీర్వాదంతో "యుస్కెఫీ" ఆధ్యాత్మిక పిపాసులకు అందచేస్తున్న అద్భుత నిత్యపారాయణ గ్రంధము!!

## ప్రాచీన భగవద్గీత

(క్రీస్తు శకం 1186 నాటి ప్రాచీన తాళపత్రాల నుండి గ్రహింపబడిన అపూర్వ పరిశోధనా గ్రంధం)

ఈనాడు మనకు ప్రచారంలోవున్న భగవద్గీతలో 700 శ్లోకాలే వున్నాయి - ఇది సంపూర్ణ గ్రంథం కాదు. 45 శ్లోకాలు! మరుగున ఏనాడో పడిపోయినాయి. ప్రాచీన భగవద్గీతలో 745 శ్లోకాలు వున్నట్లుగా క్రీ॥శ॥ 1187 నాటి తాళపత్రాల గ్రంథంవల్ల ఋజువయింది. వ్యాసమహర్షి వ్రాసిన సంస్కృత మహాభారతంలోని శ్లోకాలు క్రమణిక కూడా అధిక శ్లోకాలు కలిపితే సరిపోతుంది.

## వేదవ్యాస మహర్షి దివ్యచరిత్ర :

(వేదవ్యాస మహర్షి జీవితంపై అపూర్వ పరిశోధనా గ్రంథం)

ఇందులో వ్యాసుని జననం! ఆయన అపూర్వ విశ్వానుభూతి, వ్యాస మహర్షి ఆశ్రమం, వేదవిభాగం, బ్రహ్మసూత్ర రచన, సర్వశాస్త్ర పరిరక్షణ. మహామునుల "యోగ మండలి", భాగవత ధర్మము - మోక్షవిద్య, మూర్తీభవించిన హిందూమతం, పరమ గురువుగా తపస్సు, అష్టాదశ పురాణాల రచన, కలియుగారంభం మొదలైన విషయాలు వివరంగా తెలియచేసే, అపూర్వ పరిశోధనా గ్రంథం.

## సోవియట్ రష్యాలో ఆధ్యాత్మిక పరిశోధన

సోదరి స్టాలిన్ జీవితంలో మరపురాని అనుభవం! లెనిన్ ఆత్మతో మాట్లాడిన స్త్రీ, రెండవ - శరీరం, సైన్సు పరిశోధనలో 'జీవాత్మ', 'మంత్ర దండం' - భూమిలోని జలం, జలవిద్యుత్తూ - మానవ శరీరంలో "కరెంటూ", 'నెల్యా-మిఖైలోవా' పదార్థంపై మనస్సు అధికారం యింకా ఎన్నో విషయాలపై రష్యన్లు జరిపిన పరిశోధనలను గురించి విపులంగా తెలియజేసే అద్భుత గ్రంథం!

## సోదరి నివేదిత

సోదరి నివేదిత భారత మాతకు ఆత్మ నివేదనగా చేసిన నిస్వార్థసేవ జాతీయ విద్యావిధానానికై ఆమె చేసిన కృషి - భారతీయ మహిళలకు ఆమె సందేశం - భారత మహిళా లోకం గర్వించతగ్గ సోదరి నివేదిత ఆశలకూ ఆశయాలకు దర్పణం - యీ చిన్న పుస్తకం.

## గాయత్రీ మంత్ర - ఉపాసనా రహస్యము

ప్రాచీన తాళపత్ర గ్రంధాలనుండి ఎన్నో అముద్రితములైన అమోఘ సాధనారహస్యాలను పరిశోధనా దృష్టితో పరిశీలించి రచింపబడిన అద్భుత గ్రంధము.

ఇందులో 1. బ్రహ్మాస్త్రము 2. బ్రహ్మాండము 3. బ్రహ్మ శీర్షాస్త్రము 4. బ్రహ్మ శిరోనామకాస్త్రం 5. వాయువ్యాస్త్రము 6. గాయత్రీ మంత్రశాపము 7. శాపనివారణ మంత్రము 8. పురశ్చరణ విధి 9. గాయత్రీ శాపనివారణ మంత్రము 10. గాయత్రీజపం, కవచ, అష్టోత్తరశత సహస్రనామంతో సహా... ఇలా సాధకులకు సాధనకై అనేక రహస్యాంశములు ఇందులో తెలుప బడినవి.

## నిత్యజీవితంలో యోగసాధన

సామాన్యులు తమ జీవితాల్ని ఆనందంతో, ఐశ్వర్యంతో, పరిపూర్ణంగా జీవించాలంటే అనుసరించదగు సాధనలను అందరికీ అర్ధమయ్యేలా చక్కగా వివరించబడినది.

## నవగ్రహ శాంతి విధానం

ఇది అమూల్య పరిశోధనా గ్రంధం! మీ జీవితాన్నే మార్చి వేయగల కల్పవృక్షం! మీ జీవితంలోని కష్టాలు, మీ జాతకంలోని "చెడుగ్రహపీడల"

నివారణ చేసుకునే మార్గం - తెలిపే ఆధ్యాత్మిక - జ్యోతిష - మంత్రశాస్త్ర సమ్మేళనమే" ఈ "నవగ్రహ శాంతి" 16 సంవత్సరాలుగా ప్రతియేటా **"శ్రీమన్నారాయణ యజ్ఞం"** లో నవగ్రహశాంతి హోమంద్వారా అనేక వేల మందికి ఉద్యోగాలూ, వివాహాలు, సంతానప్రాప్తి, వృత్తి, వివాహ, వ్యాపార లాభాలు పొందినవారు అనేకులున్నారు!! సుఖశాంతులు పొందేందుకు ప్రతీ ఇంటా తప్పక వుండవల్సిన గ్రంథం!!!

## శ్రీవిద్యారణ్యస్వామి చరిత్ర - (హిందూరాష్ట్ర స్థాపకుడు)

ఈనాడు మన హిందువులందరినీ ముస్లిములుగా మార్చివేస్తే ఏం జరుగుతుంది? మన హిందూమతమే ఈ భూగోళంపై నశించిపోతే వొచ్చే నష్టమేమిటి? అన్ని మతాలలాగా ఇదీ ఒక మతమేకదా! ఈ ఒక్క హిందూమతమూ లేకపోతే వచ్చిన నష్టమేమిటి? - ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పాలంటే మానవజాతికి హిందూమతం అవసరం ఏమిటో క్షుణ్ణంగా తెలియాలి.

ఈ రెండు ప్రశ్నలకూ సమాధానం తెలియాలంటే ఈ ముఖ్యమైన పుస్తకం ఎందుకు రాయాల్సిన అవసరం వుందో బోధపడుతుంది!

లెక్కలేనంతమంది హిందువులు ప్రతిరోజూ ఇతర మతాలలోకి - ముస్లిములుగా, క్రిస్టియన్లుగా మారి హిందువులే చరిత్రలో మన భారత దేశానికి శత్రువులై మన దేవాలయాలను ధ్వంసంచేశారు! గోవులను, స్త్రీలను, వేదపండితులనూ ఘోరంగా హతమార్చారు! విలువైన సుందరశిల్పాలను సర్వనాశనం చేశారు!

అలా మన హిందూమతం కొనవూపిరిలో వుండగా తిరిగి బ్రతికించి తన తపస్సు ధారపోసి - వేద ధర్మానికి భగవానుడు వెలిగించిన అఖండ

అర్షజ్యోతిగా అవతరించిన మహాపురుషుడే శ్రీవిద్యారణ్యస్వామి! ఆయన హిందూధర్మాన్ని ఎలా రక్షించాడో - ప్రాచీన వేదములలోని ఆధ్యాత్మిక శక్తిని హిందువులకు తెలిపి వారిచే ఆచరింపచేసి - అంతేకాదు, ఇతర మతాలలోకి మారిపోయని ముస్లిములను తిరిగి హిందువులుగా మార్చి వారిని మహా యోధులుగా చేసి ఆ హరిహర బుక్కరాయులను తాను స్థాపించిన విజయనగర సామ్రాజ్యానికి రాజులుగా చేసి, రాజనీతిలో రక్షించి ఎలా హిందూజాతిని కాపాడారో ఆ అద్భుత చరిత్రపై చారిత్రక పరిశోధనా ఫలితమే ఈ గ్రంథం!

విద్యారణ్యస్వామికి మహాలక్ష్మీ సాక్షాత్కారం - అపూర్వ గ్రహస్థితిలో ముహూర్తంపెట్టి సామ్రాజ్యాన్ని స్థాపించిన కధ - ప్రపంచ వాణిజ్య కేంద్రంగా విజయనగరాన్ని తీర్చిదిద్దిన అద్భుతగాధ చదివితే - ఈ పుస్తకం ఎందుకు రాయవలసిన అవసరం వున్నదో బోధపడుతుంది!

అట్టి, శ్రీవిద్యారణ్యస్వామి గురించి తెలియని హిందువులు బ్రతికి వుండినా మరణించినట్టే! విద్యారణ్యస్వామి శరీరం ధరించిన హిందూ మతమే! శంకరమఠాన్ని పరిపాలించిన యోగి, భవిష్యత్తును దర్శించిన ఋషి! వేదాలకు అర్థంరాసిన మహానుభావుడు! అపూర్వమైన ఫోటోలతో విద్యారణ్యస్వామి జాతకంతో విజయనగరం పట్టణం ప్లానుతో ప్రచురించ బడిన అద్భుతగ్రంథం!

## వీరబ్రహ్మేంద్రయోగిపై పరిశోధన

ఇపుడు జరుగుతున్న ప్రళయాలు, తుఫానులు, భూకంపాలు ఇంకా రానున్న ప్రళయాలు, తన తపస్సుతో దివ్యదృష్టితో ముందే దర్శించి వీరబ్రహ్మేంద్రయోగి 'కాలజ్ఞానం' రాశాడు!

చారిత్రక పరిశోధన చేపట్టి గవర్నమెంటు ఉద్యోగిగా కర్నూలు జిల్లా, కడపజిల్లాలో వీరబ్రహ్మేంద్రమఠము, వారు తపస్సుచేసిన గుహలు, వీరు

రాసిన ప్రాచీన తాటియాకుల కాలజ్ఞానం పరిశీలించి రాసిన అపూర్వ గ్రంథం! తప్పక ప్రతీవారూ చదవవలసిన "ప్రపంచ భవిష్యత్తు" ను తెలిపే గ్రంథం!

## అణుయుగంలో - హిందూమతం

అమెరికా యూనివర్సిటీలలో అన్ని మతాల్నీ డిగ్రీ కోర్సులలో బోధిస్తున్నారు! హిందూమతాన్ని బోధించాలన్న అమెరికన్లకు మన హిందూ మతాన్ని గురించి తెలిపే ఒక 'పాఠ్యగ్రంథం' (Text Book) లేని దుస్థితి రెండువందల సంవత్సరాలుగా మన హిందూమతానికి పట్టిన దురదృష్టం!

దీనిని చక్కదిద్దేందుకు అపూర్వ పరిశోధన చేపట్టిన శ్రీ వేదవ్యాస గురుదేవులు పదేళ్ళు కష్టపడి రాసిన అమూల్యగ్రంథం, ఇది!

వేదాలలో, ఉపనిషత్తులలో భగవద్గీతలో భారతము, భాగవతము ంటి పురాణాలలో సారముతీసి ఈనాటి సైన్సుదృష్టిలో వానిని విశ్లేషణచేసి ిటి సైన్సుదృష్టిగల విద్యార్థులకు కాలేజి లెక్చరర్లకూ అర్థమయ్యే భాషలో వేదవ్యాస గురుదేవులు రచించిన అపూర్వ ప్రమాణగ్రంథం!

ఇందులో -

1. "ఈ సృష్టి ఎలాపుట్టింది?"
2. "ప్రపంచ ప్రళయం" - అది ఎలా జరుగుతుంది?
3. కలియుగం - నాలుగు యుగాలలో జరిగే సృష్టి, స్థితి, ప్రళయాల చరిత్ర!
4. కర్మ - కర్మ సిద్ధాంతము!
5. యోగము - యోగశాస్త్ర రహస్యాలు!
6. హిందూ దేవతలు - వారి స్వరూప ఆకారములు, విగ్రహారాధన రహస్యములు!
7. 'నాలుగు వర్ణాలు - కులవ్యవస్థ' వెనుక సైన్సు సిద్ధాంతము!

8. వేదములు, పురాణములు!

9. ప్రపంచములో అన్ని దేశాలలో ఆదిగా వుండిన హిందూమతమొక - ప్రపంచ మతము!

10. రష్యా, చైనా, జపాన్, తుర్కిస్థాన్‌లలో నేటికీ లభించే హిందూ దేవతల విగ్రహాలు!

11. విదేశాలలో హిందూమతం!

12. హిందూ సంస్కారాలు, ఉపనయనం, వివాహం, నామకరణం అన్నప్రాశనవంటి కర్మల రహస్యాలు!

ఇంకా... ఇంకా... అనేక నిగూఢమైన శాస్త్ర విషయాలు సులభ శైలిలో అందించారు శ్రీవేదవ్యాస గురుదేవులు! ప్రతీ హిందువు తప్పక చదువ వలసిన గ్రంథం! విదేశాలలో నివశించే హిందువు తమ పిల్లలు 'హిందూమతం అంటే ఏమిటి?' అన్న ప్రశ్నకు సమాధానం లభించని వారందరికీ ఉపయోగపడే గ్రంథం!

ఇది! హిందూమత ప్రచారానికి పనికివచ్చే ఒక పాఠ్యగ్రంథం! నూరేళ్ళ చరిత్రలో హిందూమతాన్ని ఒకే పుస్తకంలో అందించే ఇంతటి పరిశోధనా గ్రంథం వెలువడలేదు! ప్రతీవారు తప్పక జీవితాంతం పారాయణ చేయ వలసిన గ్రంథం!

మహాభారత యుద్ధం జరిగి ఎన్నాళ్ళయింది? ఇది నిజంగా చరిత్రలో జరిగిందేనా? పాండవులు కౌరవులు కథలలోని పాత్రలా? మహాభారతం చరిత్ర అని నిరూపించే కాలనిర్ణయం సైన్సు పరిశోధన ద్వారా చేపట్టి సంస్కృత భారతంలోని గ్రహస్థితులు, తిథి, వార నక్షత్రాలు ఆధారంగా భారత కాలాన్ని లెక్కించి నిరూపించిన డా॥ వేదవ్యాస అపూర్వ పరిశోధనా గ్రంథం! ఆంధ్రాయూనివర్సిటీ సంస్కృతములో డాక్టరేట్ ఇచ్చిన వీరి

రీసెర్చి యొక్క సంగ్రహ తెలుగు సారము ఈ అపూర్వగ్రంథం! జనమేజయుని దానశాసనం కర్ణాటకలో లభించినది! శ్రీకృష్ణజాతకం, ఆయన జన్మతేదీ, టైము, కలియుగం ప్రారంభించిన తేదీ గంటలు, నిముషాలతోసహా శ్రీకృష్ణ నిర్యాణకాలం - సముద్రంలో మునిగిన ద్వారకపై సైన్సు పరిశోధన వంటి అనేక అపూర్వ విశేషాలు మనం కనీవినీ ఎరుగనివి ఎన్నో ఇందులో శ్రీ వేదవ్యాస మనకు అందించారు!

మహాభారత పరిశోధనా సారము తేలికగా మామూలు మాటలతో సంగ్రహంగా అందించే అద్భుత పరిశోధనా గ్రంథం ప్రతీ విద్యార్థి టీచరు ప్రతి హిందూమత ప్రచారకుడు కంఠస్థం చేయవలసిన సైన్సు సాక్ష్యాలతో వున్న అద్భుత గ్రంథం!

## శ్రీరామచరితామృతం!

శ్రీ వేదవ్యాస బాల్యంనుండే గురుకుల పద్ధతిలో - వేదాలను, జ్యోతిష యోగ మంత్రశాస్త్ర రహస్యాలను ఆపోశనపట్టిన వ్యక్తి! సైన్సులో వున్నత డిగ్రీని పొంది, ప్రభుత్వ అధికారిగా పనిచేస్తూ రామాయణంపై చేసిన పరిశోధనయే ఈ అపూర్వగ్రంథం!

ఇందులో శ్రీరాముడి జాతకం, లంక, ఇప్పుడు సింహళం కాదు! రష్యన్లు పుష్పకవిమానంపై చేసిన పరిశోధన వంటి అనేక విశేషాలు తెలుపుతుంది!

వాల్మీకి, మహర్షి ఒక్కడే కాకుండా - శ్రీరాముని టైములో జీవించిన అగస్త్యుడు, దూర్వాసుడు, వశిష్టుడు రాసిన రామాయణాలను పరిశీలించి హనుమద్ రామాయణంలో శ్లోకాలు ఉదహరిస్తూ అనేక రామాయణాలన్నీ

సామాన్యుడికి తేలికభాషలో అరచేతి మాణిక్యంగా అందించిన అద్భుత గ్రంధం!

## మీ ఇంటిని బట్టి అదృష్టం :

ఇల్లు అదృష్టం కలిగిస్తుంది? కష్టనష్టాలను సంపాదించి పెడుతుందా? వాస్తుశాస్త్రమంటే ఏమిటి? వాస్తుదోషాలు నివృత్తి అవుతాయా? ఈ ప్రశ్నలకు సమాధానమే ఈ పుస్తకం!

వాస్తుశాస్త్రం వెనుకవున్న - సైన్సు సూత్రం ఏమిటి? వాస్తు మూల సూత్రాలను తెలిపే చిన్న పుస్తకమే ఈ ఇంటినిబట్టి అదృష్టం. ఇల్లు కట్టుకోవాలనుకున్న వాళ్ళు, కట్టిన ఇంటికి దోషాలు వున్నవారు, తప్పక చదివి తీరాల్సిన గ్రంధం!

## భగవంతుని దీపాలు :

దేవుడంటే ఎక్కడో ఆకాశంలో మనకు అందకుండా పైలోకాల్లో వున్నాడని చాలామంది అనుకుంటారు! ప్రతి మనిషిలోనూ మానవత్వం వెనుక దాగివున్న దైవశక్తియే 'దేవుడు'!

ప్రతీ మనిషిలోనూ అనేక ఆలోచనలు, భగవంతుడు వున్నాడా, అనే సందేహాలు అనుమానాలు వుంటాయి! మీలోని దైవశక్తితో చెరువులోని నాచును పక్కకు నెట్టినట్లు మీ ఆలోచనలని పక్కకి నెట్టివేస్తూ పాచిపట్టిన స్వార్ధాన్ని నిస్వార్ధసేవతో తొలగించుకొని సందేహాలను ధైర్యంతో అధిగమిస్తూపోతే ప్రతీ మానవుడు దైవశక్తిని చూడగలడు!

అలాంటి వారయిన మహాత్ముల గురించి తెలుసుకోవాలంటే ఈ పుస్తకం తప్పక చదివితీరాలి!

1. షిరిడీసాయి సమకాలికులైన మహాత్ములలో హాజరత్ బాబా తాజుద్దీన్ మణిపూసవంటివారు! ఒక ఆధ్యాత్మిక జ్యోతి!

2. అలాంటి మహాత్ములలోనే అహింసా జ్యోతివంటి మహాత్ముడు గౌతమబుద్ధుడు! బుద్ధదేవుడు విష్ణుమూర్తియొక్క 9వ అవతారము! ఈనాటికీ పూజలూ, గౌరవం బుద్ధుడు పొందటానికి కారణం ఏమిటి?

3. జీవించే వెలుగు నమ్మాళ్వారులు! ఆళ్వారులలో శ్రేష్ఠులైన ఆళ్వార్ల దర్శనం, మధురకవి ఆళ్వార్లుకు సందర్భపడిన సన్నివేశం, ఇరువురు మహాత్ముల కలయిక భారతదేశపు ఆధ్యాత్మిక చరిత్రను మార్చివేసిన విధానం! నమ్మాళ్వార్ల మహిమ ప్రపంచానికి ఏవిధంగా తెలిసింది?

4. ఆళ్వార్లు, ముందువారా? రామానుజాచార్యులు ముందు జన్మించారా? )పే గ్రంథమే ఈ భగవంతుని దీపాలు!

5. నోరులేని మూగజీవాలను బాధపెట్టకూడదని జాలితో చూడాలన్న ఉద్యమం లేవదీసి ఒంటరిగా సమాజంతో పోట్లాడిన హెన్రీబర్గ్!

6. అరుణగిరిజ్యోతి, భగవాన్ రమణ మహర్షి!

ఇంకా వెలుగులోకిరాని మహాత్ముల చరిత్రను సంగ్రహంగా వివరించిన గ్రంథమే ఈ భగవంతుని దీపాలు!

## మీ జన్మతేదీలో మీ అదృష్టం :

సంఖ్యలు మీ జీవితాన్ని, మీ జన్మతేదీ నుంచి ఎలా పరిపాలిస్తాయి? అది తెలిసే విజ్ఞానం ఏది? ఏ సంఖ్యలు ఎలాంటి ప్రభావం కలిగిస్తాయి? ఏయే టైములో ఏయే పనులు జరుగుతాయి? ప్రాచీన ఋషులు రహస్యంగా కాపాడిన విజ్ఞానం ఇది!

సంఖ్యాశాస్త్రాన్ని కాచివడపోసిన డా॥ వేదవ్యాస గురుదేవులు ప్రతి సామాన్య మానవునికి అర్థమయ్యే రీతిలో సంఖ్యాశాస్త్రం ద్వారా రుచి చూపించారు!

ప్రాచీన వేద ఋషులిచ్చిన వైదిక సైన్సుతో ఈ సంఖ్యలను ఎలా వినియోగించాలో తెలుసుకోవాలంటే ప్రతీవారు ఈ చిన్న పుస్తకాన్ని చదివి తీరాలి!

## నవ్వితే నవరత్నాలు :

'జీవితంలో మనిషిని నవ్వించేవి నవరత్నాలు'! దీని అర్థం జ్యోతిషం లోతుగా తెలిసిన వారికే బోధపడుతుంది! నవ్వుతూ జీవితంలో తేలిపోవడం ఈ నవరత్నాల్ని తెలిసి ధరించడంవల్లనే పొందవచ్చు!

ఈ పుస్తకం చిన్నదే అయినా ఇందులో మీ జీవితాన్ని వెలకట్టలేనంత అమూల్యమైన రత్నాలు వున్నాయి!

మీ దురదృష్టాన్ని తొలగించుకోవటం ఎలాగ? సైన్సుకు పితామహు డైన న్యూటన్ మహాశయుడు ఎలాగ జ్యోతిషాన్ని పరిశోధించాడు? ఆకాశం లోని గ్రహాలు మానవజీవితంలో జరగబోయే అనేక సంఘటనలను ఎలా ఋజువు చేస్తాయి! ఈ ప్రశ్నలసారమే ఈ గ్రంథం!

నవరత్నాలకీ అధిష్టాన దేవతలు వుంటారని మీకు తెలుసా? నవ రత్నాలలో ప్రతిఒక్కదానికీ సంబంధించిన అధిష్టాన దేవతను ఏ విధంగా పూజించి, ఏ విధంగా రత్నాన్ని ధరించాలి? దీనికి సమాధానమే ఈ గ్రంథం!

మీ పేరును తొమ్మిదికన్నా ఎక్కువ సంఖ్య వస్తే? సంఖ్యాశాస్త్రం ఆధారంగా జ్యోతిషశాస్త్రం ఆధారంగా డా॥ వేదవ్యాస రచించిన గ్రంథం అత్యంత అద్భుతమైనది!

## నిత్యపూజకు చదవవలసిన స్తోత్రాలు :

ప్రతి గృహస్తునకూ నిత్యజీవితంలో ఎదురయ్యే కష్టాలూ, సమస్యలూ, చెడు గ్రహస్థితుల నివారణకు అవసరమయ్యే స్తోత్రాలు ఎన్నో వున్నాయి ఈ గ్రంథంలో!

**శనిస్తోత్రం** : శనిదోషం, ఏలినాటి శని బాధలుపడేవారి ఉపయోగార్థం!

**ఆదిత్యహృదయం** : అనారోగ్యంతో బాధపడేవారికి సూర్యగ్రహ శాంతికి పనికివచ్చే ఆదిత్య హృదయం!

**హనుమాన్ చాలీసా** : దుష్టగ్రహాలు, గాలి, భూతాల పీడల నివారణ నిమిత్తం!

దారిద్ర్యముతో బాధపడేవారికి లక్ష్మీ అష్టోత్తరశతము!

విద్యలో వెనకబడిన వారికి సరస్వతీ స్తోత్రము!

కుజదోషం సర్పదోషం కలవానికి సుబ్రహ్మణ్య స్తోత్రం!

ఇంకా అనేక విషయాలలో బాధపడే వారికి సంబంధించిన అనేక స్తోత్రాలు అన్నీ కలిపి ఒకే పుస్తకంగా ప్రచురించారు! శ్రీ వేదవ్యాస గురుదేవులు!

## కదిలే బ్రహ్మం - నడిచే దైవం

యోగమిత్రమండలి - "వ్యాసపూర్ణిమ" సందర్భంగా యోగమిత్రులకు అందించే అపురూపమైన కానుకగా ఈ ప్రచురణను 'వేదవ్యాస భారతి' 25-7-1991 నాడు విడుదలచేసిన అపూర్వ గ్రంథము! శ్రీ వేదవ్యాస గురుదేవులు అర్ధశతాబ్దంపైగా కలిసిని సిద్ధపురుషులతో పరమ గురువులతో ఇంకా అనేకులైన మహామహులతో అందుకున్న అపూర్వ 'అనుభవాల - మాలిక'గా ఈ గ్రంథం వెలువడింది!

ఇది ఒక సంకలనము - అనగా శ్రీవేదవ్యాస గురుదేవులు తమ చిన్ననాటి అనుభవాలను తమ శిష్యులకు, యోగమిత్రులకూ అప్పుడప్పుడు సందర్భానుసారముగా అందించిన విషయాలను ఏర్చి, కూర్చి ఒక దండగా మొదటినుంచీ చివరిదాకా ఆసక్తి పుట్టించే అద్భుతమైన అనుభవాల కూర్పు ఇది!

## బాలకాండ :

గ్రంథములోని విషయాన్నిబట్టి ఇందలి అధ్యాయాలు 'ఖండాలు'గా విభాగించి సంపుటి చేయడం జరిగింది. తండ్రిగారైన శ్రీమాన్ ఎక్కిరాల అనంతాచార్యులుగారి అద్భుత జీవితరహస్యాలు ఈ మొదటి సంపుటంలో చోటుచేసుకున్నాయి! మాతృమూర్తి శ్రీబుచ్చమ్మతల్లిగారి అపూర్వ చిత్రము, తండ్రిగారి గురుదేవులైన శ్రీమాన్ రామచంద్రాచార్యులతో దిగిన ఫోటోలతో ఈ మొదటి భాగం **'బాలకాండ'**గా రూపులు దిద్దుకున్నది!

దీనితోపాటు సోదరులైన భరద్వాజ జ్ఞాపకాలు, శ్రీవేదవ్యాస అన్న గారైన ఎక్కిరాల కృష్ణమాచార్యుల బాల్యస్మృతులూ, ఇంకా ఎన్నెన్నో అపూర్వ విషయములతో మనం కనీవినీ ఎరుగని దివ్యానుభవాలతో ఏర్చికూర్చి ముత్యాలదండగా ఏర్పడిన **ఈ బాలకాండలో, 'భరద్వాజాశ్రమం', 'కడుపార నెవ్వాని కన్నతల్లి'** అన్న అధ్యాయాలు మరపురానివి!

చిన్నతనంలోనే తల్లిని కోల్పోయిన శ్రీవేదవ్యాస, సోదరులను పెంచుతూనే ఇంటిపనులు నిర్వర్తించుకుంటూ తమ విద్యాభ్యాసం గురుకుల పద్ధతిలో చేస్తూ గడిపిన అపూర్వ అనుభవాలు ఎన్నో మన మనసును కదిపివేస్తాయి!

## కాశీ-ఖండము :

బాల్యము వీడీవీడని 12 ఏళ్ళ లేతవయసులోనే శ్రీ వేదవ్యాస కాశీ యాత్రచేసి ప్రతినిత్యం గంగాస్నానం యోగాభ్యాసంతోపాటు తమ విద్యాభ్యాసాన్ని కొనసాగించిన నాటి అపూర్వజ్ఞాపకాలు ఎవరికీ - అంటే ఆంతరంగిక శిష్యులకు కూడా - తెలియని నిగూఢ రహస్యాలెన్నో మనల్ని ఆశ్చర్య పరుస్తాయి! శ్రీవేదవ్యాస గురుదేవుల కాలేజీ విద్యలో 14 ఏళ్ళు నిండని వీరు ఇంటర్మీడియట్‌లో కాలేజీ ఫస్టుగా రావడం, విద్యావిధానంలో జరిగిన అపూర్వమైన మార్పులు - **'సస్పెన్సు విద్యాభ్యాసం'** అన్న అధ్యాయంలో రమణీయంగా వర్ణించబడినాయి! కాలేజీలో డ్రామా నటుడుగా చిత్రకారుడుగా ...ల్లకాయ చేష్టలతో గడిపిన రసవత్తరఘట్టాలు ఎన్నో శ్రీవారి బాల్యజీవితంను ...నోహరంగా అలరిస్తాయి ఈ సంపుటంలో!

## ...కళ్యాణము - లోక కళ్యాణము :

అన్న ఖండములో శ్రీవేదవ్యాస గురుదేవుల 'జ్యోతిష పరిశోధన', 'మంత్రశాస్త్ర', 'యోగశాస్త్ర' అభ్యాసములు - అనుకోని అద్భుతరీతిలో జరిగిన వీరి వివాహము, కాలేజి అధ్యాపకునిగా నూతన గృహస్థజీవితము, కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి భవిష్యత్తును తెలపిన అపూర్వ కాలజ్ఞానం వంటి ఘట్టాలు, ఈ పుస్తకం కింద పెట్టనివ్వకుండా చదివిస్తాయి!

అలానే విద్యాభ్యాసంలో యూనివర్సిటీ దశలోనే శ్రీవేదవ్యాస క్లాసు మేటుగా ప్రారంభించి, స్నేహితుడుగా అనుబంధంతో అల్లుకొనిపోయి తనకు కలిగిన దివ్యానుభవాలతో చివరకు భక్తుడుగా మారిపోయిన 'ప్రథమ శిష్యుడు' రామలింగరాజు జ్ఞాపకాలు, విద్యార్థిగా వేదవ్యాస చెప్పిన అపూర్వ భవిష్యత్తు, చూపించిన యోగమహిమలూ ఈ ఘట్టాన్ని ఎంతో ఆసక్తికరంగా రూపొందించాయి!

అలానే IAS ఆఫీసరుగా భద్రాచలంలో సబ్‌కలెక్టరు పదవి స్వీకరించడం, అక్కడి భద్రాచల రామాలయం అర్చకులయిన రాజగోపాలచార్యులు పొందిన 'రామానుగ్రహము' దానితో శిష్యులైన వీరి జ్ఞాపకాలు, రాధాకృష్ణ పండితునితో ఉపరాష్ట్రపతి V.V. గిరితో, బుద్ధుని అవతార మూర్తియైన శ్రీదలైలామా వేదవ్యాస గురుదేవులను కలిసి తమ భవిష్యత్తును, టిబెట్‌దేశపు భవిష్యత్తును తెలుసుకొన్న ఆసక్తికరమైన విశేషాలు **'కాలజ్ఞాన ఖండము'** లో మనకు అపూర్వంగా కనిపిస్తాయి!

అలానే జిల్లెళ్లమూడి అమ్మతో శ్రీవేదవ్యాస తెలిపిన భవిష్యత్ కాలజ్ఞానము, తరువాత ఉద్యోగస్తునిగా చింతపల్లి కొండలలో వీరు కలిసిన సిద్ధపురుషులు, సద్గురువైన **'పాకలపాటి గురువుగారి'** తో శ్రీ వేదవ్యాస అపూర్వ అనుభవాలు - 'సిత్రాలు సేయరో సివుడో', అన్న అధ్యాయం లోనూ, 'రూపుమార్చిన శివుడు' అన్న అధ్యాయంలోనూ, 'పెద్దలముందు చిల్లర ట్రిక్కులా?' అన్న అధ్యాయంలోనూ పరమాశ్చర్యం గొలిపేరీతిలో ఈ దివ్యానుభవాలు అందరినీ అలరించేవిగా వున్నాయి!

**బ్రహ్మసాక్షాత్కార ఖండము :**

అలానే శ్రీగురుదేవులు మద్రాసులో ఉద్యోగము నిమిత్తం వెళ్ళగా అనుకోకుండా వినడం తటస్థించిన **"అగస్త్యనాడి"** లోని 'యోగానుగ్రహ ఖండము', తరువాత శ్రీగురుదేవులు 'మాస్టర్ C.V.V.' యోగంలో పొందిన అద్భుత సాక్షాత్కారము, వీరి శిష్యులుగా, ఆంధ్రపత్రిక సంపాదకులు పిలకా గణపతిశాస్త్రివంటి ప్రముఖులెందరో పొందిన యోగానుగ్రహమూ, మాస్టర్ యోగాస్కూలులో వీరి శిష్యులు పొందిన మహాద్భుతమైన యోగానుభవాలు ఈ కాండలోని విశేషాలు!

ఇందులోనే మాస్టర్‌యోగం అంటే ఏమిటి? మాస్టర్ C.V.V. జీవిత సంగ్రహము, వారి డైరెక్టు శిష్యులయిన బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి దివ్యానుభవాలూ కళ్ళకు కట్టినట్టు వర్ణించారు!

శ్రీవారి యోగశక్తితో, చనిపోయిన దశలో పునర్జీవనం పొందిన పసిపాప అనుభవం, చేతితో ఇచ్చిన నీళ్ళు తీర్థంకాగా అద్భుతంగా రోగాలు నయం కావడం, ఇంకా ఎందరెందరో, పొందిన యోగానుభవాలు ఈ '**బ్రహ్మ సాక్షాత్కార ఖండానికి**' వన్నె తెచ్చాయి! ఆధ్యాత్మిక విషయాలపై ఆసక్తిగల ప్రతివారూ సాధనంటే ఏమిటి? సద్గురువువల్ల శిష్యునికి లభించిన నమ్మరాని **దివ్యానుభవాలు**' ఎంతటివి? నిత్యజీవితం నడుపుకుంటూనే బ్రహ్మజ్ఞానం పొందిన రాజయోగి ఎలావుంటాడు? ఉద్యోగిగా కనిపించే 'కర్మయోగి'ని ఈ ఖండములో చూడవచ్చు!

## ధర్మప్రచార-ఖండము :

అలానే అనేక సంవత్సరాలుగా తమ యోగానుభవాలను తమలోనే దాచుకున్న శ్రీవేదవ్యాస గురుదేవులను బయట ప్రపంచంలోకి లాగి తమ విజ్ఞానాన్నీ, శక్తినీ జనామాన్యానికి అందించవలసిందిగా ప్రోత్సహించిన శ్రీ కామకోటి శంకరాచార్యులవారైన చంద్రశేఖరేంద్రస్వామితో వీరి అద్భుత సమావేశం '**నెల్లూరులో సూర్యోదయం**' అన్న అధ్యాయంలోనూ, వేదపరిషత్ సభలో శ్రీవారి అధ్యక్షతన వీరు చేసిన గంభీరోపన్యాసము, ఇంకా ఎన్నెన్నో అనుభవాలు ఈ "**ధర్మప్రచార - కాండ**" లో చోటుచేసుకున్నాయి!

ధర్మ ప్రచారంలో భాగంగా శ్రీ వేదవ్యాస సంకల్పంతో నిర్మాణమైన (1) శ్రీ వేంకటేశ్వర ఆలయం, (2) హైదరాబాదులోని షిరిడీ సాయినాథుని ఆలయం, (3) ఈమని లోని గణపతి ఆలయప్రతిష్ఠ (4) కడపజిల్లా బద్వేలులో దత్తసాయి ఆలయంతోపాటు, అమెరికాలో యోగాయూనివర్సిటీకై

జరిపిన 'నారాయణ యజ్ఞము' వీరిజ్ఞాపకాలలో **'అమెరికాలో నారాయణుడు'** వంటి అధ్యాయాలలో చూడవచ్చు!

అలానే 1985, 1986, 1987 సంవత్సరాలలో వరుసగా అమెరికాలో శ్రీవేదవ్యాస గురుదేవులు ఇచ్చిన గంభీరోపన్యాసాలూ, అక్కడ నెలకొల్పిన యోగకేంద్రములూ, 'ధర్మప్రచారకాండకు' వన్నె తెచ్చాయి! ధర్మప్రచారంలో భాగంగా చేసే 'శ్రీమన్నారాయణ యజ్ఞము', "యోగమిత్రమండలి" స్థాపన, అన్ని జిల్లాలలోనూ, "సత్సంగ" ప్రతిష్ట ధర్మప్రచారంలో మరొకమెట్టు! దివ్యానుభవాలను పొందినవారు తమజ్ఞానాన్ని తమలోనే ఉంచుకోవడం కాకుండా - జనసామాన్యంలోకి వచ్చి అతిసామాన్యులకు సహితం అందు బాటులో వుండేలాగా గ్రంధాలు, 'గ్రంధ ప్రచురణ', 'శుభవార్త' మాసపత్రికలు నెలకొల్పటం, గ్రామాలు గ్రామాలు తిరిగి ఆధ్యాత్మికప్రచారం చెయ్యడం, అనేకులకు యోగోపదేశం, మంత్రోపదేశాలు చెయ్యడం, అనేకుల జీవితా లను మార్చడం - అందులో భాగంగానే తమ్ముడైన భరద్వాజను, అవిశ్వాసంతో వున్నవారిని సాయిభక్తునిగా మార్చి అతనికో నూతన జీవితాన్ని ప్రసాదించటం కళ్ళకు కట్టేలా చదివిస్తుందీ గ్రంధము!

'ధర్మ ప్రచారం'లో భాగంగానే శ్రీవేదవ్యాస గురుదేవుల తీర్థయాత్ర లకు తమ శిష్యులను మూడు బస్సుల నిండుగా తీసుకొని షిరిడీ సాయి సంస్థానము, పండరి, అక్కల్‌కోట, గాణ్గాపూర్, నర్సింగవాడి వంటి దత్త క్షేత్రాలు కట్టిన జపమాల వంటి ఆధ్యాత్మిక పారాయణా గ్రంధము!

గోదావరి పుష్కర పర్వకాల సందర్భముగా అంతరికీ అందుబాటులో వుండే విధంగా ఈ గ్రంధాన్ని నాలుగు సంపుటాలుగా అందుబాటులో 'యోగమిత్రమండలి' అందించారు!

పరిమితమైన కాపీలు అయిపోయేలాగా ఆసక్తిగల ప్రతీవారు తప్పక చదవవలసిన అద్భుతగ్రంధము **'కదిలే బ్రహ్మం నడిచే దైవం'!**

**రామానుజ వైభవం :**

(ప్రథమ, ద్వితీయ భాగములు)

శ్రీ భగవద్రామానుజులు సాక్షాత్తూ మూర్తికట్టి అవతరించిన "సనాతన-వేద ధర్మం" వంటివారు! అయన సముద్ధరించినది కేవలం నిర్జీవమైన అద్వైత, ద్వైత నాస్తికవాదాలవంటి – 'వాదం' కాదు! భగవానుని అస్తిత్వాన్ని నిత్యజీవితంలో అనుభవంలోకి తెచ్చే సాధనా విధానమే!

**శిష్య శిక్షణ - ఆచార్యోపాసన :**

శ్రీమద్రామానుజుల అసాధారణమైన మార్గంలో అతిముఖ్యమైనది వీరి ్య శిక్షణావిధానము!

"జాతీయ సాంకర్యం" తో పెంచబడే ఈనాటి మన యువతరానికి ్జీవంగా వెయ్యేళ్ళనాటి భారతదేశం పరిస్థితులను ఆనాటి ఆచార వ్యవహారాలను అప్పటి మహాభక్తుల గొప్ప ప్రేమైకరూపమైన జీవిత విధానాన్ని కళ్ళకు కట్టినట్టు ఈనాడు మనముందు సజీవంగా నిలిపి, వారికి ఫోటోలా చూపించే ఆసక్తికరమైన గ్రంథమే **"రామానుజవైభవం"**.

## HINDUISM IN THE SPACE AGE :

(A Space Age Presentation of Vedic Wisdom)

For the first time in the English language whole the Vedic Wisdom religion presented as a cogent "System" in the light of science in one book.

Specially designed for teaching Vedic Hinduism, to graduates and under graduates. It presents the whole teaching on Vedic

Cosmology, creation of man, and the fundamentals of Higher yoga, in simple lucid, enjoyable readable style.

Hinduism in the Space Age represents the synthesis of Science and Religion with yoga.

*"Surely if these ever was a serious work which puts that 'Ancient Wisdom' into a 'position of contemporary legitimacy and relevence. This is it!*

*"It is long overdue!" — Dr. Vedavyas presents powerful thesis which turns the western claim to a monopoly of Scientific progress, on its head".*

***— Dr. N.M.H. Chanceller***

*University of Cambridge (U.K.)*

*"The only book in English that presents the whole wisdom of the East in one "Single Volume".*

***— Eligibeth Warnon***

## ANCIENT BHAGAVAD GITA

(Original Text 745 - verses with critical introduction)

A miracle history is the rediscovery of the complete text of the **Original Bhagavad Gita** with all its 745 slokas last for over 2000 years from popular circulation. It is now available overnight in this 20th century. It is nothing short of an act of God! A miracle for those who believe in a miracle of God! For them, the present book is a Blessing without disguise.

This book gives the entire text of the **Original Bhagayad Gita** with all its **745 Stanzas** infact, is now printed and made available to the general public. In this book for the first time beyond the Learners, Research Scholars desk.

The spiritual minded may use the full text of the Gita in its entirely for the first time as a **'Prayer book'.**

The Research minded can indulge in this **Critical skill** to his scholarly satisfaction.

The doubter can **deny** the very verses **that exist** before im!!

What ever one wishes to do with the full text of the Gita **epends on his own inner light!** The fact is the whole text of ie Ancient Bhagavad Gita is **before you!**

## SCIENCE OF TIME

The Science of Time is a brilliant outer - space survey of all Ancient Nations, Cultures and Religions - whose Gods and Calenders are born in the zodiac of even the "Flying outer-space Gods" like "Garuda" — the devine bird vehicle of Lord Vishnu, located in the star 'Aquilla" (The Eagle)

It's survey of the 'Nadi' Grandhas - Ancient palm leaf Manuscript books of Rishes like Agastya and Vasishta contain thousands of horoscopic prophecies of unborn children of Future!!

The chapters "Astrology in communist countries" — as well as Vedic and Chineese Astrologies is a brilliant master piece of literature, even in style!

## ASTRONOMICAL DATING OF THE MAHABHARATA WAR

This is a brilliant attempt to Scientifically investigate into the exact Date when the Great Mahabharata War began! Hailed as "a highly Significant contribution to our existing Knowledge" — it is the authors' Thesis for his Doctorate in Sanskrit (Ph.D.) in the Andhra University, Waltair submitted while he was serving in the Board of Revenue, in the State Government.

Dr. Vedavyas used the latest Scientific techniques including Radio-Carbon Dating and the Astronomical Dating in this work to unravel the Mystic passages in the Sanskrit Epic of 'Mahabharata' - and he arrived at the exact date, when the Great World War had commenced!

## 1999 END OF KALIYUGA

Comet Strikes Earth!!

* New York Destroyed?
* Sanfrancisco sinks into sea!
* Earth-quakes destry Japan
* Aramageddan at Pyramid

* Sun & Moon black-out?
* New world Avataram in East Lord of Shambala born!

Researches by

— **Dr.Vedavyas,** Ph.D.

## READ

World Shattering prophecies from Himalayan Rishis.

**ఇంకా యితర ప్రచురణలు :**

1. 1999 కలియుగాంతం - కాలజ్ఞానం Volume - I
2. 1999 కలియుగాంతం - కాలజ్ఞానం Volume - II
3. మనదేశము - మనసంస్కృతి
4. జ్యోతిషం సైన్సా - మూఢవిశ్వాసమా?
5. మన పండుగలు
6. సాయిబాబా సద్గురువు - "హాజీ వారిస్ అలీషా" దివ్యచరిత్ర
7. సాధనా రహస్యాలు
8. శ్రీలక్ష్మీ సహస్రనామస్తోత్రం
9. శ్రీసూక్త రహస్యార్థం
10. ఏరినముత్యాలు
11. సత్సంగం

మొదలగు అమూల్యమైన రచనలు, అద్భుత పరిశోధనా గ్రంధాలను ఈ **'యుస్కెఫీ' (USCEFI)** సంస్థ ప్రచురణ చేసినది.

ఇతోధికంగా దేశంలో జరిగే విషసాహిత్యాన్ని నిర్మూలించేందుకు ఆరోగ్యకరమైన ఆధ్యాత్మిక మానసికమైన వికాసాన్ని అందించే ఉత్తమ

సాహిత్యాన్ని మీకు అందించేందుకు మీ సహాయం ఎంతో అవసరం. ప్రజల సహాయమే నారాయణ శంఖారావం! ఇదిగో ఇవే మా పూజా పుష్పములు! అందుకోండి.

ఈ గ్రంథం చదివి మీరు **USCEFI** ధర్మసంస్థకు విరాళంగా తమకు తోచిన సహాయాన్ని ఈక్రింది చిరునామాకు పంపవచ్చు. ఇందులో దేవాలయ నిర్మాణానికి, లేదా పాఠశాలకుగాని, ప్రాచీన గ్రంధాలకుగాని, గ్రంధాల ప్రచురణకుగాని యిలా ఏ నిమిత్తం పంపదలచినవారు ఆ విషయాన్ని వివరంగా Money Order ద్వారాగాని, Crossed Cheque ద్వారాగాని ఈక్రింది అడ్రసుకు పంపవచ్చు. ఈ ధనం **USCEFI** మూలధనంలోనే 'బ్యాంకులో' జమ అవుతుంది. ఈ విరాళం యిచ్చిన వారికి రాబడి పన్ను రద్దు (Income Tax Exemption) దొరుకుతుంది.

ఇట్లు

యోగమిత్రమండలి మీ

యుస్కెఫీ,

రోడ్ నెం. 8, ప్లాట్ నెం. 56, కార్యదర్శి

జూబ్లీ హిల్స్, హైదరాబాదు - 33. (USCEFI)

# భారతమాతకు - పూజాపుష్పాలు

మనదేశానికి రాజకీయ స్వాతంత్ర్యంవచ్చి అర శతాబ్దం కావస్తున్నా - ఇంకా బ్రిటీషువారి విద్యావిధానమే కాలేజీలలోను, స్కూళ్ళల్లోను నడుస్తున్నది. ఫలితంగా మానసిక దాస్యం, విదేశీభాష, కట్టూ బొట్టూ, తిండీ, సంస్కృతీ వీటిపట్ల మనకి బానిసత్వం పోలేదు. నిజమైన భారతీయ సంస్కృతి మనకి తిరిగి లభించాలంటే అసలైన 'భారతీయ విద్య' ఏర్పడాలని 30 ఏళ్ళనాడే కార్యక్రమాన్ని చేపట్టిన ఆదర్శపురుషులు డా॥ శ్రీవేదవ్యాస గురుదేవులు. వారిని పరిచయం చేయడమంటే మన భారతీయ సంస్కృతిని పరిచయం చేయడమే!

## బాల్యంలో గురుకుల విద్య

బాల్యంనుంచీ తండ్రిగారివద్ద వేదమూ, యోగాభ్యాసం, ఆయుర్వేదం, జ్యోతిషం, వాస్తువంటి ఋషి విజ్ఞానంతో 7వ ఏటనుంచే, శిక్షణపొందారు. ఎక్కడా ఇంగ్లీషుస్కూలులో చదవలేదుగాని ఇంగ్లీషు సైన్సును విడవలేదు. ఈనాటి ప్రపంచానికి ప్రాచీన వేదవిజ్ఞానాన్ని అందించాలంటే ఆధునిక పరిభాష, సైన్సువిజ్ఞానం అవసరమని గ్రహించి వేదవిద్యలతోపాటే సైన్సును, ఇంగ్లీషు చదువునూ అభ్యసించారు డా॥ వేదవ్యాస!

తమ 13వ ఏటనే మెట్రిక్యులేషన్ పాసై, 15వ ఏట ఇంటర్మీడియట్‌ను సైన్సులో కాలేజీలో ప్రథమ విద్యార్థిగా నిలచి 19వ ఏట M.Sc. డిగ్రీని పొందిన మహావిజ్ఞాని డా॥ వేదవ్యాస.

లయోలా (Loyola) కాలేజీలో 'బయాలజీ' (Biology) ప్రొఫెసర్‌గా తమ 19వ ఏటనే (1954లో) ఉద్యోగం ప్రారంభించారు. వీరి విద్యాభ్యాసం

వలెనే అధికార జీవనంలోకూడా అంచెలంచెలుగా ఎదిగివచ్చారు డా॥ వేదవ్యాస గురుదేవులు! తమ 23వ ఏట IAS ఆఫీసర్‌గా ఆలిండియా పోటీలో నెగ్గి భద్రాచలంలో సబ్‌కలెక్టరుగా హైద్రాబాద్ జిల్లా కలెక్టరుగానూ, రెవిన్యూబోర్డు మెంబరుగానూ ఇలా 32 ఏళ్ళు పనిచేసి ప్రభుత్వ ప్రధానకార్యదర్శిగా స్వతంత్రంగా పదవీ విరమణ చేశారు.

## మహాభారత - కాలనిర్ణయం :

ఈకాలంలోనే వీరు, సంస్కృత భారతంపై రీసెర్చిచేసి మహాభారత యుద్ధకాలనిర్ణయం ఖగోళ గణితంలో సైన్సుపరంగా నిర్ణయంచేసిన వీరి పరిశోధనకు సంస్కృతంలో Ph.D. ఆంధ్రా యూనివర్సిటీ నుండి 1985వ సంవత్సరంలో పొందారు.

## వేదాలపై పరిశోధన :

అటు సైన్సూ, ఇటు వేదాలలోని విజ్ఞానమూ రెండూ సమన్వయం చేస్తూ హిందూమతంపై ఒక అద్భుత పాఠ్యగ్రంథాన్ని "Hinduism in the Space Age" అన్న పేరుతో 1972లో ప్రచురించారు. ఇదే యిప్పుడు హిందూమతం డిగ్రీలో బోధించడానికి ప్రపంచంలో ఏ యూనివర్సిటీలోనూ మరో టెక్స్టు బుక్‌లేని కొరతను తీర్చే ప్రయోజనకరమైన ఏకైక పాఠ్యగ్రంథం (Text book) గా రూపుదిద్దుకున్నది.

## భగవద్గీతలో నష్టపోయిన - 45 అధిక శ్లోకాలు :

ఈనాటి భగవద్గీతలో రెండువందల సంవత్సరాలనాడే నష్టపోయిన 45 - అధిక శ్లోకాలు కలిగిన ఒక ప్రాచీన తాళపత్ర గ్రంథమును ఈ మొత్తం 745 శ్లోకాలుగల "ప్రాచీన భగవద్గీత"ను కనుగొని ఇంగ్లీషు, తెలుగు కన్నడభాషలలో ప్రచురించారు. దానిపై పరిశోధనా వ్యాసాన్ని కూడా ప్రచురించారు!

## ప్రపంచ సర్వమత పార్లమెంటు - చికాగో :

ఇవన్నీ ఒక యెత్తు - అమెరికాలో స్వామి వివేకానందుని తరువాత నూరేళ్ళ అనంతరం 1993 లో జరిగిన 'ప్రపంచ సర్వమత పార్లమెంట్' (World Parliament of Religions) సభలో 1993 సెప్టెంబర్ నెలలో సరిగ్గా వివేకానందుడు ప్రసంగించిన రోజునే **"అణుయుగానికి - వేదఋషుల సందేశం"** అన్న వేదాంత గర్జనతో విదేశీయులను ఉర్రూతలూగించి ముగ్ధులను చేశారు.

శ్రీ వేదవ్యాస గురుదేవులు అరవైకి పైగా అపూర్వ పరిశోధనాగ్రంథాల రచయిత. రెండు వందలకు పైగా ప్రాచీన తాళపత్ర ప్రతులను సేకరించిన పరిశోధకులు, ప్రధానమంత్రి నుంచీ, రాష్ట్రపతులదాకా తమ భవిష్యత్తు గురించి వీరితో సంప్రదించే మహాయోగి - ద్రష్ట!

## హిందూమతంలో - డిగ్రీకోర్సు :

ఇంతేకాక, తాము నేర్చుకున్న 'గురుకుల విద్యావిధానం' లోని అపూర్వ నైతిక శిక్షణ, మానసి క్రమశిక్షణ, యోగాభ్యాసంలోని ఏకాగ్రత కలిపి మేళవిస్తూ **గురుకుల విద్యావిధానంతో** సైన్సు విశ్లేషణతో వేదమతాన్ని బోధించే హిందూ మతంపై - డిగ్రీకోర్సును 1995 జూన్‌లో ప్రారంభించారు.

ఇదే ఈనాడు తన జీవిత విజయంగా శ్రీ వేదవ్యాస గురుదేవులు మనకు తెలియజేసే అతి ముఖ్య విషయంకూడా!! ఈనాటి **జాతీయ కార్యక్రమంతో** విద్యావిధానాన్ని **పూర్తిగా మార్చటం** ఇంతవరకూ జరుగ లేదు!! రానున్న తరాల వారికి మన **హిందూమతం జీవంగా జీవించివుండి** అందరికీ ఆచరణలో అందుబాటులోకి రావాలని శ్రీవేదవ్యాస గురుదేవులు ఈ పవిత్ర ప్రజాహిత కార్యక్రమాన్ని చేపట్టారు. అది ఇన్నేళ్ళకు, హిందూ

మతంలో డిగ్రీకోర్సు ఇచ్చే **University of Vedic Sciences** తో వీరిద్వారా అందించబడుతున్నది.

ఇంతేకాక శతాబ్దాల తరబడి వేదపండితులకే అందని వేదశాస్త్ర విజ్ఞానం అంతా - కుల మత భేదాలు లేకుండా సర్వమానవులకూ అందించ దలచారు శ్రీవేదవ్యాస గురుదేవులు!! అటు శ్రీ రామానుజాచార్యులవారు ఆలయంపై నిలచి అందరికీ అందాలని - ఆరాటపడింది - గాంధీజీ కలలు కన్నదీ - వేదవ్యాస నిజం చేస్తున్నారంటూ అది భారతీయు లందరూ ఎంతో గర్వించదగ్గ మహాకార్యం!!! దీనికి మనమందరమూ తలోచెయ్యి సహాయం అందించి మనం భారతీయులుగా ఋషుల వారసులుగా జన్మించినందుకు మన జన్మను సార్థకం చేసుకుందాం!

ఇది ఒక "జాతీయ - ఉద్యమం", ఒక దైవకార్యం - మహత్తర మానవతాకార్యం!! భారత దేశానికే గర్వకారణం! మన స్వాతంత్ర్యం చరితార్థం చేసుకొని యావత్ మానవజాతి గర్వించదగ్గ మహాసేవ!!

శ్రీ వేదవ్యాస గురుదేవులు నిశ్చయంగా కారణజన్ములు!! లేకుంటే యిన్ని అపూర్వ విజయాలు ఒక్క మనిషిగా సాధించటం ఊహకందని ఆశ్చర్యం!!

మనవంతు సేవ మనం చేద్దాం!! కాదు చెయ్యాలి!!

వేద పాఠశాలలను ఎందరో స్థాపించారు! ఇది **అటువంటిది కాదు!** వేదాల అర్థం ఏకొద్దిమంది పండితులకో లభించటం **కాకుండా** అది **అన్ని కులాలవారికీ, అన్ని మతాలకూ, అన్ని దేశాలవారికీ కూడా వేదఋషులు ప్రాచీన విజ్ఞానం అందించే అపూర్వమైన ప్రణాళిక ఇదే - ఈ 'వేదిక్ యూనివర్సిటీ'!!** దీనికై అమెరికాలో పది ఎకరాల భూమిని 1985లో సేకరించి, ఆంధ్రప్రదేశ్‌లో కూడా **నాలుగుచోట్ల** దేవాలయాలు నిర్మించి

అక్కడ **గురుకుల పాఠశాలలు** మొదలుపెట్టి **నూతన జాతీయ విద్యా విధానానికి అంకురార్పణ చేయడం డా॥ వేదవ్యాస** తాము IAS అధికారిగా ప్రభుత్వంలో వుండగానే 1986 నుంచే చేశారు. ఇప్పుడు బెంగుళూరులో శ్రీవేదవ్యాస మహర్షి ఆలయం - సప్తఋషులకు మందిరం నిర్మించి వ్యాసపూర్ణిమ 12-7-95 నుండి మూడు రోజులపాటు 'నారాయణ హోమం' - వేదపండితులతో తాము కూర్చుని జరిపించారు. శ్రీశివరాత్రి స్వామివంటి పీఠాధిపతులను 'హిందూమతం - డిగ్రీ'కి సిలబసు కమిటీలో చేర్చి 36 లక్షల ఖర్చుతో M.A., Ph.D. లకు P.G. సెంటరు నెలకొలిపారు! ఇది అద్భుతం అనన్యం!

వీరు గొప్ప జ్యోతిష్కులూ, యోగీ, విద్యావేత్తా! అంతేగాక గొప్ప వాగ్గేయకారులూ, కవీ, చిత్రకారుడూ, శిల్పీ! బెంగుళూరులోని వ్యాసమహర్షి విగ్రహాన్ని శిల్పశాస్త్రం ప్రకారం నమూనాలిచ్చి, తీర్చిదిద్ది శిల్పిచేత చేయించిన ప్రజ్ఞ వీరిది! ఇలా ఇంకా ఎన్నో విశేషాలు అగాధమైన వీరి నిత్యపరిశోధనా జీవితంలో వున్నాయి. వీరు కారణ జన్ములు!!!

ఈనాడు వీరు ప్రారంభించిన అన్ని జాతులవారికీ కులభేద, మతభేద, జాతిభేదాలు లేకుండా **హిందూమతంలో డిగ్రీయిచ్చి, అన్నంపెట్టే ఉద్యోగానికి గ్యారంటీఇచ్చే ఈ మహాప్రణాళికను మనమందరం విధిగా చేపట్టాలి!**

**"గురుః బ్రహ్మః గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**
**గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః"**

*

**అన్నంపెట్టి, ఉద్యోగం గ్యారంటీ యిచ్చేదే**
**'వేదిక్ యూనివర్సిటీ',**
**"హిందూమతం" లో యిచ్చే - డిగ్రీ!!!**

**వేదమతంలో డిగ్రీయిచ్చే**

# "వేదిక్ యూనివర్సిటీ"

## హిందూమతంలో

## B.A. — B.Sc. కోర్సులలో!

### గ్యారంటీ - లెక్చరర్ ఉద్యోగం - మీకు!

**నిరుద్యోగాన్ని పోషించే వ్యర్థ - చదువు మానండి!!!!**

**ఇందులో**

| ప్రాక్టికల్ (Practical) | థియరీ (Theory) |
|---|---|
| 1. యోగం (ఆసన, ప్రాణాయామ, ధ్యానం) | 1. హిదూమతం అంటే ఏమిటి? |
| 2. జ్యోతిషం | 2. వేదాలలోని సైన్సు విజ్ఞానం |
| 3. పూజా విధానం | 3. మరణించిన తర్వాత మనిషి 'ఆత్మ' ఎక్కడకు వెళుతోంది. |
| 4. ఆలయ అర్చన | 4. "కర్మ" - అంటే ఏమిటి? |
| 5. యజ్ఞ - యాగాలు | 5. దేవుళ్లు - మంత్రాలు - పురాణాలు |
| 6. వాస్తు విజ్ఞానం | 6. ఉపనిషత్తులు - శాస్త్రాలు - దర్శనాలు |

7. మంత్రశాస్త్రం

... ఇంకా ఎన్నో

7. వేదాలలోని - హిందూమతం - సారం అంతా అర్థంతో నేర్చుకోండి

లెక్చరర్ ఉద్యోగం ఖాయం! మన ధర్మాన్ని తెలుసుకోండి!! అనేకులకు నేర్పండి!!!

## రిజిష్టరు చేయుటకు

హిందూమతం కోర్సులో చేరగోరువారు తమ పూర్తి అడ్రసును స్టాంపులు అంటించిన కవరుపై వ్రాసి రూ. 25/- లు బ్యాంకు డ్రాఫ్టును ఈక్రింది పేరుతో జతచేసి పంపించాలి. వెంటనే మీకు అప్లికేషను ఫారము, సిలబస్ వివరాలు పంపబడతాయి.

**వివరాలకు**

**స్పెషల్ ఆఫీసర్**

**యూనివర్సిటీ ఆఫ్ వేదిక్ సైన్సెస్**

రోడ్‌నెం. 8, ప్లాట్‌నెం. 56, జూబ్లీహిల్స్

హైదరాబాద్ - 500 033.